# అపరాధ పరిశోధన

మార్చి '80



అపరాధ పరిశోధన అనుబంధం—75

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## నన్ను నేనే చంపుకున్నా

రచన : వసుంధర

## ఆఖరి అస్త్రం

రచన: వాణిశ్రీ

## మూడు దెయ్యాలు

రచన: ప్రతాప రవిశంకర్

## మాయమైన బుల్లెట్

రచన: సికిందర్

పొగమంచు — మూడవ భాగము

**అపరాధ పరిశోధన సప్లిమెంట్—75**
మార్చి, 1980
వెల: రు. 4-00
ఏడాది చందా 49 రూపాయలు
జీవిత చందా 325 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామదామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:
**టెంపోరావ్**
**శ్యాంబాబు**
**రమణశ్రీ**
**ఏ. వీ. మోహన్రావ్**
**సుజనశ్రీ**
**వసుంధర**
**విద్వాన్ షీలాదేవి**

కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
**క్రాంతి ప్రెస్,**
**2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.**

# నన్ను నేనే చంపుకున్నా

## వసుంధర

జైలు కటకటాల వెనుకనున్న నాన్నను చూస్తుంటే నా గుండె తరుక్కుపోయింది. ఆయనమాత్రం చాలా గంభీరంగా ఉన్నాడు. నా కళ్ళలోని నీళ్ళు చూసి కూడా ఆయన చలించలేదు.

"రోజులు లెక్కపెట్టుకుంటూ, బ్రతుకుతున్నావ్నేను. నేను దిగులుపడ్డా అర్థముంది. హాయిగా బ్రతకాల్సిన నువ్వు దిగులుగా ఉండడమేమిటి?" అన్నాడు నాన్న.

అలా అన్నాడే కానీ నాన్న నా బాధనర్థంచేసుకోలేడనుకోను. నాన్న నన్ను కంటికి రెప్పలా పెంచాడు. ఆయన లేని జీవితం ఊహించుకోలేను నేను.

అమ్మ నా పదిహేనో యేట చనిపోయింది. అప్పట్నించీ నాన్న మళ్ళీ పెళ్ళి చేసుకోకుండా పూర్తిగా నా సంరక్షణ భారం వహించాడు. అంతవరకూ మేము సామాన్య కుటుంబీకులమే గానీ అమ్మ పోయినప్పట్నించీ నాన్న పద్ధతి మారిపోయింది. ఏం చేసేవాడో గానీ ఇంట్లో

పుష్కలంగా డబ్బుండేది. అమ్మ పోయిన అయిద్నేళ్ళకు నాన్న పెద్ద మేడ కొన్నాడు. మాకు రెండు కార్లు వచ్చాయి. ఊళ్ళో మాకు చాలా పలుకుబడి.

నాన్నకూ నాకూ సరిగ్గా ఇరవై సంవత్సరాలే తేడా. నాకు ఇరవైయేళ్ళొచ్చే సరికి నాన్నకు నలభైఏళ్ళు. ఆయనకు పెళ్ళిగురించి బంధువులనుంచి బాగా వత్తిడి వచ్చేది. నాన్న అందరితోనూ ఒకేముక్క అనేవాడు— "నాకు జీవితంమీద విరక్తి పుట్టింది. నేను జీవించేది నా కొడుకుకోసం. వాడి బ్రతుకు ఒక దారిన పడితే నా జీవితం యేమైనా ఫరవాలేదు. ఇలాంటి విరాగి జీవితం లోకి కలలుకనే జీవిని ప్రవేశపెట్టలేను—"

ఇప్పుడు నాకు పాతికేళ్ళు. గత రెండు సంవత్సరాలుగా నాన్న చాలా దిగులుగా ఉంటూ వచ్చాడు. నేను తరచి తరచి అడుగగా—"ఒరేయ్ బాబూ-నాకు బ్రతకాలని లేదురా! మీ అమ్మ చనిపోయినప్పట్నించీ నేను జీవచ్ఛవాన్నయ్యాను. నీ కేలోటూ రాకుండా చేసి అప్పుడు తనువు చాలించాలని నా ఆశ. కానీ అదంత సులువుగా నెరవేరేలా లేదు. ఓ శనిగ్రహం నన్ను వేధిస్తోంది—" అన్నాడు.

ఆ శనిగ్రహం పేరు మాణిక్యాలరావు అని నాకు త్వరలోనే తెలిసింది. మాణిక్యాలరావు నాన్నను బ్లాక్ మెయిల్ చేస్తున్నాడనికూడా నాకు అర్థమైంది. నాన్న బాధ చూడలేక నేనొకసారి ఆయన్ను కలుసుకుని— "మీ కారణంగా నాన్న దిగులుగా వుంటున్నారు. నాన్ననుంచి మీరు కోరేదేమిటో తెలిస్తే నా శాయశక్తులా ప్రయత్నించి అది సాధిస్తాను. దయచేసి నాతో సహకరించండి—" అన్నాను.

మాణిక్యాలరావు నవ్వి—"మిస్టర్ సూర్యం! నీ పితృ ప్రేమ మెచ్చదగ్గది. కానీ ఇందులో నేను నీకు సాయ పడగలిగింది లేదు. మీ నాన్న నీకోసం అక్రమ మార్గాలు తొక్కి డబ్బు సంపాదిస్తున్నాడు. నేనా వివరాలు తెలుసుకుని ఆయన్ని బెదిరించి డబ్బు గుంజుతున్నాను. తను సంపాదించే డబ్బులో అంతా నీకే దక్కాలని మీ నాన్న ఆశయం. అది నెరవేరక ఆయన దిగులుగా ఉన్నాడు తప్పితే ఇందులో పెద్ద కొంపలు మునిగే వ్యవ హారమేమీ లేదు—" అన్నాడు.

అప్పుడు నాకు అసలు వ్యవహారం అర్థమయింది. నాన్నకు సంబంధించిన ఆయువుపట్టేదో మాణిక్యాల రావు గుప్పిట్లో వుంది. డబ్బు గురించి నాన్నకు బెంగ లేదు. ఆ ఆయువుపట్టు మాణిక్యాలరావు గుప్పిట్లో ఉండడం నాన్నకు యిష్టంలేదు. అది ఏనాడైనా నాన్నకూ, తద్వారా నాకూ కూడా ప్రమాదకరంగా పరిణమించవచ్చు.

నాన్న అక్రమ మార్గాలు తొక్కుతున్నాడని నే నూహించలేకపోలేను. తక్కువకాలంలో ఎక్కువ డబ్బు సంపాదించే వారెవరైనా అక్రమ మార్గాలు తొక్కి నట్లే లెక్క!

నేను వెళ్ళి మాణిక్యాలరావుతో మాట్లాడినట్లు తెలిసి నాన్న చాలా నొచ్చుకున్నాడు—"బాబూ! వాడు ప్రమాదకరమైన మనిషి. నువ్వు వాడి జోలికి వెళ్ళవద్దు. వాడి సంగతి నేను చూసుకుంటాను—" అని నన్ను హెచ్చరించాడు.

రెండు నెలల క్రితం నాన్న ఇంటికి బాగా ఆలస్యంగా వచ్చాడు. బహుశ అర్థరాత్రి రెండు గంటల సమయంలో

వచ్చాడనుకుంటాను. ఆ సమయానికి నేను ఎందువల్లనో మెలకువగానే ఉన్నాను. ఆయన్ను పలకరించాను.

"నువ్వు నిశ్చింతగా ఉండొచ్చురా బాబూ - పెద్ద అడ్డంకి ఒకటి తొలగిపోయింది. ఇకమీదట మనల్నెవరూ యెందుకూ బెదిరించలేరు—" అన్నాడు నాన్న.

ఏం జరిగిందని అడిగాను కానీ నాన్న అంతకుమించి ఏమీ చెప్పలేదు. ఆయన కళ్ళలో అంతులేని తృప్తిని మాత్రం స్పష్టంగా చూశాను.

ఏం జరిగిందో మర్నాడు తెలిసింది.

ఊరి చివర పాడుబడ్డ గుడివద్ద పోలీసులకు ఓ శవం దొరికింది. అది మాణిక్యాలరావుది. ఎవరో మాణిక్యాల రావుని హత్య చేశారు.

నా అనుమానం వెంటనే నాన్న మీదకు పోయింది. పేపర్లో వివరాలనుబట్టి హతుడు చనిపోయిన సమయం నాకు తెలిసింది. ఆ సమయంలో నాన్న ఇంట్లో లేడు—

"మాణిక్యాలరావును నువ్వుగాని చంపేయలేదు గదా-" అనడిగాను.

నాన్న అవుననలేదు. కాదనలేదు. అలాంటి ప్రశ్నలు నేనడగకూడదన్నాడు. అసలు మనసులోకి ఆ విషయం రానివ్వవద్దన్నాడు.

పోలీసులు పరిశోధనలకు దిగారు. వాళ్ళకు పెద్దగా వివరాలు లభించలేదు.

మాణిక్యాలరావు కుటుంబం ఈ కేసు విషయమై పరిశోధించవలసిందిగా డిటెక్టివ్ వెంకన్నను కోరారు. నీటిలో కూడా జాడలు తీయగలడని పేరుబడ్డ ఆ డిటెక్టివ్‌కు కూడా ఆధారాలేమీ దొరకలేదు. హత్య జరిగి రెండువారాలైనా ఈ హత్య కేసులో నాన్న ప్రసక్తి

రాకపోవడం నాకు చాలా సంతోషాన్ని కలిగించింది.

అయితే కథ అనుకోకుండా ఓ కొత్త మలుపు తిరిగింది—సుబ్రహ్మణ్యాం అనే అతని కారణంగా!

సుబ్రహ్మణ్యాం నిరుద్యోగి. ఉద్యోగం ఇప్పించమని మాణిక్యాలరావు చుట్టూ తిరుగుతున్నాడు. మాణిక్యాలరావు యే విషయం తేల్చకుండా ఇతన్ని చుట్టూ తిప్పుకుంటున్నాడు. సుబ్రహ్మణ్యాం ఓపిగ్గా అతని చుట్టూ తిరుగుతున్నాడు.

హత్యజరిగినరోజు రాత్రి యెనిమిది గంటలకు సుబ్రహ్మణ్యాం మాణిక్యాలరావుకోసం వాళ్ళింటికి వెళ్ళాడు.

అయితే అప్పుడే ఆయన హడావుడిగా ఇంట్లోంచి వచ్చాడు.

సుబ్రహ్మణ్యానికి ఏం చేయాలో తోచలేదు. కాబట్టి ఆయనననుసరించాడు.

మాణిక్యాలరావు ఏదో ఓ కొత్త ఇంటికి వెళ్ళాడు. అక్కడ్నించి ఆయనతో ఇంకోమనిషి బయటకు వచ్చాడు. వాళ్ళిద్దరూ కలిసి కాలినడకన బయల్దేరారు. వాళ్ళను కొంతదూరంమాత్రమే సుబ్రహ్మణ్యాం వెంబడించాడు. ఎందుకంటే వారు ఊరి చివరగా వెడుతున్నారు.

ఆ రోజుకు మాణిక్యాలరావును కలుసుకోవడం కుదరదనుకుని తన కార్యక్రమాన్ని మర్నాటికి వాయిదా వేసుకున్నాడు సుబ్రహ్మణ్యాం. అయితే మర్నాడు మాణిక్యాలరావు లేడు. ఆయన హత్య చేయబడ్డాడని తెలియగానే సుబ్రహ్మణ్యానికి మతిపోయింది.హంతకుడ్ని తను కళ్ళారా చూశాననే అతను భావించాడు. పోలీసులు, డిటెక్టివ్‌లు ఏం పరిశోధిస్తారోనని కొంతకాలం యెదురుచూసి—చివరకు డిటెక్టివ్ వెంకన్నను కలుసుకొన్నాడు. అతను

చూసినవ్యక్తి నా తండ్రి అన్న విషయం చాలా త్వరగా బయట పడింది. హఠాత్తుగా నాన్న అనుమానితుల జాబితాలోకి వెళ్లి పోయాడు.

నాన్న సుబ్రమణ్యానికి లంచం ఆశజూపాడు. సుబ్రహ్మణ్యం చలించలేదు—"నేను చూసింది చూసినట్లుగా చెప్పడం నా విధి. డబ్బుకోసం నా అంతరాత్మను చంపుకోలేను—" అన్నాడతను.

సుబ్రహ్మణం సాక్ష్యానికి అనుకూలంగా ఆధారాలు దొరికాయి. నాన్న ఊరి చివర పాడుబడ్డ గుడివద్దకు వెళ్ళినట్లు బుజువయింది. పరిశోధన ఇంకా దూరంగా వెళ్ళబోగా నాన్న వెంటనే నేరం అంగీకరించేసి హత్య ఎలా జరిగిందో చెప్పేశాడు. మాణిక్యాలరావును తను ఎందుకు చంపాలనుకున్నాడో యేదో కుంటిసాకు కల్పించి చెప్పాడు. ఎక్కడా బ్లాక్ మెయిలింగ్ విషయం బయటకు రానివ్వలేదు.

విచిత్రమేమిటంటే మాణిక్యాలరావు నా తండ్రిని బ్లాక్ మెయిల్ చేస్తున్నాడన్న విషయం మాణిక్యాలరావు కుటుంబానికి కూడా తెలిసినట్లు లేదు. వాళ్ళ దృష్టిలో నా తండ్రి అనుమానితుల జాబితాలోకే రాలేదు.

బ్లాక్ మెయిలింగ్ విషయం బయటకు వస్తే నాన్న బండారం కూడా బయట పడుతుంది. ఈ ఆస్తిని ప్రభుత్వం స్వాధీనం కూడా చేసుకోవచ్చు. అందుకే సులభంగా నేరం ఒప్పేసుకున్నాడు. కేసు సులభంగా తేలిపోయింది. నాన్నకు యావజ్జీవ కారాగార శిక్ష పడింది.

నా కిప్పుడు సిరిసంపదలున్నాయి. కానీ నాన్న లేడు. నాన్నలేని జీవితం నాకు చాలా భారంగా వుంది. నా

బాధను నాన్న అర్థం చేసుకోగలడు.

"నువ్వుకూడా నాతో పాటుంటేనే నా జీవితానికి అర్థం. భవిష్యత్తంతా అంధకారంగా కనబడుతోంది నాన్నా" అన్నాను—ఏడుపును దిగమింగుకుంటూ.

"నాకు నిన్ను వదలాలని లేదురా! కానీ ఏం చేయను? మనతో ఏ సంబంధమూ లేని, మనవల్ల ఏ అపకారమూ పొందని ఒక సామాన్యుడు — సుబ్రహ్మణ్యం కారణంగా నేను జైలుపాలయ్యాను—" అన్నాడు నాన్న.

నా దృష్టి వెంటనే సుబ్రహ్మణ్యం మీదకు పోయింది. వాడే నాన్నకు పట్టిన దుర్గతికి కారణం. అమ్మ పోయాక కేవలం నాకోసమే బ్రతికాడు నాన్న. ఇప్పుడు నా కోసం తన జీవితాన్నే త్యాగం చేస్తున్నాడు. నేను నాన్న కోసం నా జీవితాన్ని త్యాగం చేస్తాను. ఆ సుబ్రహ్మణ్యం అంతు చూస్తాను!

## 2

"హలో!" అన్నాడు సుబ్రహ్మణ్యం నన్ను చూసి నవ్వి.

ఎంత ప్రయత్నించినా వాడ్ని చూస్తే నాకు నవ్వు రాలేదు—"క్షమించాలి. మిమ్మల్ని చూస్తే పెదవుల మీదకు చిరునవ్వు రానంటూంది—" అన్నాను.

"మాణిక్యాలరావుగారి కుటుంబంలోనివారు మిమ్మల్ని చూసి అలాగే అంటారు—" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"అంటే అనచ్చు కానీ ఆ పరిస్థితి నీ కారణంగానే ఏర్పడింది—" అన్నాను యేకవచనంలోకి దిగి.

"కాదు. నీ తండ్రే ఆ పరిస్థితి కొనితెచ్చుకున్నాడు" అన్నాడు సుబ్రహ్మణ్యం.

నా వాదనలో తర్కం లేదని నాకు తెలుసు. అందుకే

తార్కికంగా వాదించడం మాని—"మిస్టర్ సుబ్రహ్మణ్యం—తీరి కూర్చుని ఈ కేసులో కలగజేసుకుని మా నాన్నను హంతకుడ్ని చేశావు. మేము నీకు చేసిన అపకారమేమిటి? ఇలా చేయడంవల్ల నీకు కలిగిన ప్రయోజనమేమిటి?" అన్నాను దీనంగా.

"చూడు మిస్టర్ సూర్యం! నాకు నీ తండ్రిమీద పగ లేదు. బాధ్యతగల పౌరుడిగా ఒక హత్య కేసులో నాకు తెలిసిన సమాచారం పోలీసులకందజేశాను. ఒక హంతకుణ్ని మనుషులమధ్య తిరగనివ్వకుండా జైలు కటకటాల వెనక్కి పంపగలిగానన్న తృప్తి తప్పితే — ఇందులో నేనాశించే ప్రయోజనమేమీ లేదు—" అన్నాడతను.

నేను మౌనంగా అతనివంకే చూస్తూ వుండిపోయాను.

"మిస్టర్ సూర్యం! నీ బాధ నేనర్థం చేసుకోగలను. నన్ను తప్పుగా అర్థం చేసుకోకు. ఆఫ్టరాల్ ఓ నిరుద్యోగిని నేను. మీ కుటుంబంపై నాకు పగెందుకుంటుంది? నువ్వు నన్ను మిత్రుడిగా అంగీకరిస్తే నేను చాలా సంతోషిస్తాను—" అన్నాడు సుబ్రహ్మణ్యం మళ్ళీ.

నేను మాట్లాడలేదు కానీ మనసులో అతడిపట్ల ద్వేషం మరింత పెరిగింది. మెత్తగా మాట్లేడేవాళ్ళను చూస్తే ఎవరికీ కోపం తగ్గదనుకుంటాను. సుబ్రహ్మణ్యాన్ని మానసికంగా హింసించీ మరీ చంపాలనుకున్నాను.

సుబ్రహ్మణ్యం దగ్గర్నుంచి వెళ్ళిపోయేక అతడిగురించి తీవ్రంగా ఆలోచించసాగాను. అతని గురించిన వివరాలన్నీ తెలుసుకుని నా పథకం సిద్ధం చేసుకోవాలనిపించింది.

మర్నాటినుంచీ నా ప్రయత్నాలు మొదలుపెట్టాను. అతనిగురించి నన్నాకర్షించిన మొట్టమొదటి విషయం

అతని ప్రియురాలు రాజేశ్వరి.

రాజేశ్వరి చాలా అందంగా వుంటుంది. ఓ ప్రయివేట్ కంపెనీలో గుమాస్తా ఉద్యోగం చేస్తోంది. సుబ్రహ్మణ్యానికీ రాజేశ్వరికీ దూరపు బంధుత్వముంది. సుబ్రహ్మణ్యం ఆమెను కట్నం లేకుండా వివాహం చేసుకుంటాననడంతో వారిద్దరి మధ్యనూ ప్రేమ అంకురించింది. అతనికి ఉద్యోగం రాగానే వారిద్దరి వివాహం జరుగవచ్చు.

ఒకరోజు నేను సరాసరి రాజేశ్వరి పనిచేసే కంపెనీకి వెళ్ళి ఆమెను కలుసుకోగోరాను.

"ఎవరు మీరు?" అందామె.

ఆమె చేతికి చిన్న కవరు అందిచ్చి — "ఉత్తరం చదువుకోండి, రేపు మళ్ళీ వస్తాను—" అని వెళ్ళి పోయాను.

నా ఉత్తరం ఆడవాళ్ళ హృదయాలు కరిగిస్తుంది. కన్నెపిల్లలకు కలలు రేపుతుంది.

ప్రియమైన రాజేశ్వరీ!

ఇంగ్లీషులో అపరిచితులందర్నీ డియర్ అని సంబోధించడం తప్పుకాదు. ఆ సంప్రదాయాన్నే నేనూ పాటించాను. నేనొక అభాగ్యుణ్ని. లక్షలకు లక్షలు ఆస్తి వుంది. అన్నీ సర్వస్వమై నన్ను పెంచిన నా తండ్రి ఇటీవలే హత్యకేసులో హంతకుడుగా నిరూపించబడి నాకు దూరమయ్యాడు. ఒంటరితనం నన్ను పిచ్చివాణ్ని చేస్తుంటే జీవితంమీద విరక్తి రోజు రోజుకూ అధికమవుతూంటే ఒక క్షణంలో నిన్ను చూశాను. అది అందమో, అమాయకత్వమో తెలియదు కానీ నీ ముఖంలోని యేదో వింత ఆకర్షణ నాకో అనుభూతిని కలిగించింది.

నిన్ను చూస్తుంటే మళ్ళీ జీవితంపైన ఆశ చిగురిం

చింది. నీ గురించి వివరాలు సేకరించాను. నీకు సుబ్రహ్మణ్యం అనే అతనితో పెళ్ళి కావలసివున్నదని తెలిసింది. విషయం విని నిరుత్సాహపడ్డా నీకింకా పెళ్ళి కానందుకు సంతోషమే కలిగింది. నువ్వు తలచుకుంటే నాకు ప్రేమభిక్ష పెట్టడం అసాధ్యం కాదు. నువ్వు నన్నంగీకరిస్తే నా యావదాస్తీ నీ పేరుకు మార్చేస్తాను. నీ కనుసన్నలలో మెలగుతాను. నీ ఆలంబనతో బ్రతుకుపై రక్తిని సృజింపచేసుకుంటాను. లేదా నా జీవితం మరి కొద్దిరోజులు మాత్రమే!

ఈ ఉత్తరం చదివాక నీకు నామీద సదభిప్రాయం కలిగితే రేపు నేను వచ్చినపుడు నన్ను ఏకవచన ప్రయోగం చేయి. లేని పక్షంలో మనం మర్యాదగా విడిపోదాం...."

ఉత్తరం చివర సంతకం కూడా పెట్టాను.

సుబ్రహ్మణ్యం ఏదో ఇంటర్వ్యూ కాల్ వస్తే బొంబాయి వెళ్ళాడు. అందువల్ల రాజేశ్వరికి అతనితో చర్చించడానికి వీలులేదు. ఉత్తరం ఇంట్లోవాళ్ళెవరికీ ఆమె చూపించదనే నా నమ్మకం. ఉత్తరంలో నా చిరునామా ఉంది కాబట్టి ఆమె నా గురించి కొన్ని వివరాలు సంపాదించడానికి ప్రయత్నించవచ్చును. అవన్నీ తెలిసేక ఆమె మనసు నా సిరులవైపు మోజుపడక తప్పదు. అది వెంటనే జరుగకపోవచ్చు. కానీ ఈలోగా ఆమె మనసు అటూ ఇటూ ఊగిసలాడుతూంటుంది. నా తెలివితేటలతో ఆమెను నా వైపు లాక్కోవాలి.

మర్నాడామెను చూడ్డానికి వెళ్ళినపుడు — "నువ్వు సూర్యం కదూ?" అందామె.

నాకు కలిగిన సంతోషమింతా అంతా కాదు.

"సాయంత్రం గాంధీ పార్కులో కలుసుకుందాం—" అన్నాను. ఆమె జవాబుకోసం కూడా ఎదురు చూడ కుండా వెనుతిరిగాను.

సాయంత్రం ఆమె పార్కుకు వచ్చింది. అయితే అక్కడ ఆమె సంతోషంగా కనబడలేదు. ముఖంలో దిగులు స్పష్టంగా గోచరిస్తోంది.

"నువ్వు చాలా మంచిదానివి రాజేశ్వరీ!" అన్నాను.

రాజేశ్వరి తల అడ్డంగా ఊపి "నువ్వు ఒప్పుకున్న విషయాన్ని సుబ్రహ్మణ్యం ఒప్పుకోకపోవచ్చు. అతను నన్ను డబ్బు మనిషిగా జమకట్టవచ్చు—" అంది.

గతుక్కుమన్నాను—"కావచ్చు రాజేశ్వరీ! ఈ ప్రపంచం డబ్బుమీద నడుస్తోంది. మనిషి డబ్బు నాశించడంలో తప్పులేదు. అందులోనూ నీలాంటి అందమైన యువతికి డబ్బు మరింత ఆకర్షణనిస్తుంది. నీ తోడు లేకపోతే నా డబ్బు వ్యర్థమనిపిస్తోంది...." అన్నాను.

రాజేశ్వరి యెక్కువగా మాట్లాడలేదు. ఆమె నా తండ్రి గురించి వివరాలడిగింది.

"నేనొక హంతకుడి కొడుకునని భయమా?" అన్నాను దిగులుగా.

"అలా పొరబడకు. నువ్వు హంతకుడివైనా నాకు భయంలేదు. నలుగురిముందు నన్ను తాళికట్టి పెళ్లి చేసుకున్నవాడికి బ్యాంకులనిండా డబ్బు, మనసునిండా నాపై ప్రేమ ఉంటే నాకు చాలు. మిగతా విషయాలగురించి నేను పట్టించుకోను."

రాజేశ్వరి చాలా గట్టిదనిపించింది. ఆమె నేను కోరిన తరహా మనిషి కాబట్టి నాకింకేమీ భయం లేదు.

మేమిద్దరమూ పార్కులో ఎక్కువసేపు గడపలేదు.

నేను, ఆమె కలిసి బజారుకి వెళ్ళాం. నే నామెకు నూట యాభై రూపాయలు పెట్టి ఒక చీర, రెండువేల రూపాయలు ఖరీదుచేసే నెక్లెస్ కొనిపెట్టాను. ఆ రెండు బహుమతులూ రాజేశ్వరి మనసుపై చెప్పుకోదగ్గ ప్రభావాన్ని చూపించాయి. ఆమె కళ్ళలో వింత కృతజ్ఞత మెరిసింది. నాతో వీలైనంత చనువుగా ఉండానికి ప్రయత్నించింది. మాటలతో నన్ను సంతోషపెట్టడానికి ప్రయత్నించింది.

# 3

"మిస్టర్ సుబ్రహ్మణ్యం—నువ్వు నాకో చిన్న సాయం చెయ్యాలి—" అన్నాను.

"తెలిసో తెలియకో నావల్ల నీకు అన్యాయం జరిగింది. ఏ సాయమైనాసరే చేస్తాను నావల్లనయ్యే పక్షంలో—" అంటూ హామీ ఇచ్చాడు సుబ్రహ్మణ్యం.

నేను రాజేశ్వరిని గురించి చెప్పాను—"ఆమెకూ నీకూ బంధుత్వముందని తెలిసింది. వాళ్ళింట్లో మా గురించి చెప్పి ఈ పెళ్ళికి వాళ్ళు ఒప్పుకునేలా చేయాలి."

నేనూహించినట్లుగానే సుబ్రమణ్యం షాక్ తినేశాడు. అతను రాజేశ్వరి గురించి మరికొన్ని వివరాలడిగి ఓసారి పెదిమ విరిచి—"లాభంలేదు మిస్టర్ సూర్యం! ఇలాంటి త్యాగాలు చేయడానికి ఇది సినిమా కాదు. ఈ విషయంలో నేను మీకు సాయపడలేను—" అన్నాడు.

"ఎందువల్ల?"

"నేను రాజేశ్వరిని ప్రేమిస్తున్నాను—" అన్నాడతను.

"కానీ ఆమె నిన్ను ప్రేమించవద్దా?" అన్నాను.

అతను చిరాగ్గా నా వంకచూసి—"ఆ ముక్క తెలియ

కుండా నే నీకలా చెప్పాననుకున్నావా? మేమిద్దరం పర స్పరం ప్రేమించుకున్నాం. నా ఉద్యోగం కోసమే ఈ పెళ్ళి ఆగింది—" అన్నాడు.

"ఎవరితోనో ఆమెకు మాటలయ్యాయని నాకూ తెలుసు కానీ అది నువ్వేనని తెలియదు. అయితే నాది కూడా యేకపత్ని ప్రేమకాదు. ఆమె నన్ను ప్రేమిస్తోందని నేను విశ్వసిస్తున్నాను. నిన్న మే మిద్దరం కలుసుకున్నప్పుడుకూడా ఆమె తను యెవర్నీ ప్రేమిస్తున్నట్లు చెప్పలేదు—" అన్నాను.

"మీరు రోజూ కలుసుకుంటున్నారా?" అన్నాడతను నమ్మలేనట్లు. అతను మళ్ళీ షాక్ తిన్నాడు.

అతను షాక్ తింటాడని నాకు తెలుసు. అలా జరగాలన్నదే నా కోరిక. సంతృప్తిగా అతని ముఖ భావాలనే గమనిస్తున్నాను.

సుబ్రహ్మణ్యం త్వరగానే తేరుకున్నాడు. కొద్ది క్షణాలు నావంక మౌనంగా చూశాడు. తర్వాత నెమ్మదిగా—"ముందుగా నే నామెతో కాసేపు మాట్లాడాలి. తర్వాత నేను మీకు సాయపడగలిగిందీ లేనిదీ చెబుతాను. ఈ విషయంలో మీరు పొరబడ్డారేమోనని నా అనుమానం—" అని వెళ్ళిపోయాడు.

సుబ్రహ్మణ్యం, రాజేశ్వరి యెక్కడ కలుసుకుంటారో నాకు తెలుసు. అందుకే ఆ మర్నాడు ఆ సంకేత స్థలానికి కాస్త ఆలస్యంగా వెళ్ళాను. నేను వెళ్ళేటప్పటికి వాళ్ళిద్దరూ కబుర్లు చెప్పుకుంటున్నారు. నన్ను చూస్తూనే రాజేశ్వరి ముఖం విప్పారింది—"హలో సూర్యం— నేనిక్కడుంటానని నీకెలా తెలుసు?" అంది.

"తెలియదు. ఇదీజే ప్లెజంట్ సర్‌ప్రైజ్ ఫర్ మీ

టూ—" అన్నాను.

సుబ్రహ్మణ్యం నా వంక రాజేశ్వరివంక మార్చి మార్చి చూస్తున్నాడు. ఆమె కళ్ళలోని మెరుపు అతనికి నచ్చినట్లు లేదు. ఆమె నన్నతనికి పరిచయం చేయబోగా—

"మా ఇద్దరకూ ముందే తెలుసు—" అన్నాడు సుబ్రహ్మణ్యం.

రాజేశ్వరి నాతో మాట్లాడ్డానికి ఉత్సాహం చూపిస్తోంది. ఎందుకు చూపించదు? నేనొక బంగారు పిచికను. కోరి ఆమె గూట్లో వాలాలనుకున్నాను.

"మిమ్మల్నభినందిస్తున్నాను మిస్టర్ సూర్యం! బహుశా మీకు సాయపడగలననుకుంటున్నాను...."అన్నాడు సుబ్రహ్మణ్యం.

"థాంక్స్!" అన్నాను పొడిగా.

సుబ్రహ్మణ్యం వెళ్ళిపోయాడు.

"మీ రిద్దరూ ఇక్కడెందుకు కలుసుకున్నారు?" అన్నాను రాజేశ్వరితో.

రాజేశ్వరి తడబడలేదు. తన వివాహం నిశ్చయమైన సుబ్రహ్మణ్యం ఇతనేననీ, తను మనసు మార్చుకున్నట్లు విని తనతో మాట్లాడడానికి ఇక్కడకు రమ్మన్నాడనీ ఆమె చెప్పింది.

"ఏం మాట్లాడాడు? నా గురించి చెడ్డగా యేమైనా చెప్పాడా?" అని అడిగాను.

"అలాంటిదేం లేదు. తన విషయంలో నా మనసెందుకు మారిందో తెలుసుకోగోరాడు. మరికాస్త మంచి సంబంధం రావడమే కారణమని చెప్పాను...." అంది రాజేశ్వరి.

రాజేశ్వరి నాకు నచ్చింది. కొన్ని కొన్ని విషయాలు

మరీ కుండ బద్దలు కొట్టినట్లు చెబుతుంది. ఇలాంటివాళ్ళకు మాయమర్మం తెలియదు. వా జీవితం ఈమె తోడుతో సుఖంగా వెళ్ళిపోతుంది.

అప్పుడే నాకింకో విషయం గుర్తుకొచ్చింది. నేను సుబ్రహ్మణ్యాన్ని చంపాలని అనుకుంటున్నాను. అతడ్ని చంపితే నేను కూడా హంతకుడ్ని అవుతాను. హంతకుణ్ణి ఈ సమాజం వేటాడకుండా వదులుతుందా? సుబ్రహ్మణ్యాన్ని నేను చంపి—ఆ హత్యా నేరంనుంచి తప్పించుకోగలనా?

తప్పించుకోవడం కష్టం. అయితే నేను హత్య గురించి యెందుకాలోచించాను?

ప్రతీకారం. నేను ప్రాణాధికంగా ప్రేమించిన నాన్నను జైలుకు పంపించిన సుబ్రమణ్యంపై పగ తీర్చుకోవాలి. అందుకే అతన్ని చంపాలనుకున్నాను. ఆ విషయంలో నేనేమైపోయినా బాధలేదనుకున్నాను. నాన్న లేని నా జీవితానికి అర్థంలేదనుకున్నాను.

కానీ ఇప్పుడు రాజేశ్వరి నా జీవితానికో అర్థాన్ని కల్పిస్తోంది. ఆమె తోడుగా వుంటే ఎన్ని కష్టాలనైనా ఎదిరించగలననిపిస్తోంది. నా జీవితాన్ని కష్టాలపాలు చేసుకోరాదనీ—ఉన్న డబ్బుతో హాయిగా జీవితాన్ననుభవించాలనీ వివేకం హెచ్చరిస్తోంది.

## 4

రాజేశ్వరీ నేనూ విచ్చలవిడిగా ఒక నెలరోజులపాటు తిరిగాము. అయితే హద్దుమాత్రం మీరలేదు. ఆ విషయంలో రాజేశ్వరిని మాత్రమేకాక నా నిగ్రహాన్నికూడా అభినందించుకోవాలి.

ఆ నెల రోజుల్లోనూ రాజేశ్వరికోసం నేను పదివేలు వరకూ ఖర్చు చేశాను. అయితే నాకు డబ్బు బెంగ లేదు. బ్యాంకుల్లో డిపాజిట్ల రూపంలో మూల్గుతున్న తెల్లధనం కాక మా ఇంట్లో నల్లధనం లక్షల్లో ఉంది. అంత డబ్బుకూ నేనొక్కడ్నే వారసుడ్ని.

విచిత్రమేమిటంటే నాన్న నాకే వ్యాపారాలనూ అప్పజెప్పలేదు. ఆయనకు చాలామందితో వ్యాపారాలలో భాగం ఉంది. అయితే దానికి నేను వారసుడ్ని కాను. ప్రతి నెలా నా పేరున డబ్బు జమ అవుతూండేది. ఇంట్లోకి నల్లధనం చేరుతూండేది. ఆ వ్యాపారాలలో నాన్న పేరుకు మాత్రమే భాగస్వామి అనీ ఆయన అసలు వ్యాపారం ఏదో ఉందనీ, బహుశా అది ఏ స్మగ్లింగ్ అయినా కావచ్చుననీ నే ననుకున్నాను. ఏం మంత్రం వేశాడో కానీ—ఇన్‌కంటాక్స్ వాళ్ళుకూడా నాన్న జోలికి రాలేదు.

ఇప్పుడు మా ఇంట్లోని నల్లధనాన్ని ఇన్‌కంటాక్సు వాళ్ళు పట్టుకోలేరు. అంత రహస్యంగా దాచబడిందది. అందులోంచి రాజేశ్వరి గురించి వెచ్చించిన పదివేలు నాకో లెక్కలోవికావు.

నా పెళ్ళి విషయం సుబ్రహ్మణ్యం ద్వారా నే జరిపించాలన్నది నా పట్టుదల. అదే నా కానందాన్నిస్తుంది.

అందువల్ల రాజేశ్వరితో స్వేచ్ఛావిహారం చేశాక ఓ రోజు సుబ్రహ్మణ్యాన్ని కలుసుకున్నాను. అతను బాగా కృంగిపోయి ఉంటాడని ఆశించాను. నేననుకున్నంతలా కాకపోయినా అతను కాస్త నీరసంగానే కనిపించాడు. నేనతన్ని పెళ్ళి సంగతి అడిగాను.

సుబ్రహ్మణ్యం నా వంక అదోలా చూసి—"నువ్వ

ప్రాణాధికంగా ప్రేమించిన తండ్రి జైలుపాలయ్యాడు. అప్పుడు నీకెలా ఉంది?" అనడిగాడు.

"ఆ షాక్ తట్టుకోలేకపోయాను. తేరుకోడానికి చాలా కాలం పట్టింది. ఏం?" అన్నాను.

"మళ్ళీ అలాంటి షాక్‌ను తట్టుకోగల ఓపిక ఉందా నీకు!" అన్నాడు సుబ్రమణ్యం.

"లేదు. ఏం?" అన్నాను.

"అయితే రాజేశ్వరితో పెళ్ళి గురించి ఆలోచించకు" అన్నాడు సుబ్రమణ్యం.

"ఎందుకని?" అన్నాను కాస్త ఆవేశంగా.

"రాజేశ్వరి మంచిది కాదు...."

"నిన్ను కాదన్నది కనుకా....?" అన్నాను హేళనగా.

"అవును—అందుకే?" అన్నాడు సుబ్రమణ్యం నిబ్బరంగా.

అతనలా అంటాడని ఊహించని నేను కాస్త దెబ్బ తిన్నాను. ఓక్షణం ఆగి—"నిన్ను కాదన్నందుకు నాకేం బాధ? ఆమె నన్ను ప్రేమించింది. నేనామెను ప్రేమిస్తున్నాను—" అన్నాను.

"ఒకప్పుడామె నన్ను యెంతో తీవ్రంగా ప్రేమించింది. నేను లేకపోతే బ్రతకలేనంది. మా భవిష్యత్తు జీవితం గురించి కలలు కంది. తననుకున్న కలలన్నీ నాకు చెప్పి సిగ్గుపడింది. అలాంటిమనిషి డబ్బుకోసం ఒక్క రోజులో నీవైపు తిరిగింది. అలాంటి ఆడది మంచిదికాదు. ఏదో ఒకరోజున జీవితంలో నిన్నూ మోసం చేస్తుంది. అప్పుడా దెబ్బకు నువ్వు తట్టుకోలేవు. నీమీద నాకు జాలి. అందుకే హెచ్చరిస్తున్నాను. అసలు నిన్ను హెచ్చ

రించాలనే నిన్న నీ దగ్గరకు వద్దామనుకున్నాను. కానీ ఉద్యోగానికి ఓ సిఫార్సు దొరికింది—రాలేకపోయాను" అన్నాడు సుబ్రమణ్యం.

"మిస్టర్ సుబ్రమణ్యం! నీ అజ్ఞానానికి చాలా చింతిస్తున్నాను. మాటలన్నీ అయ్యాక మరో వెయ్యి రూపాయల కట్నం దొరుకుతుందంటే క్రొత్త బంధాల తెగబడ్డం లేదూ మగాళ్ళు! అదే ఆడది చేస్తే ఆమెను నమ్మకూడదంటావు! రాజేశ్వరి నిన్ను ప్రేమించలేదు. కట్నంలేకుండా పెళ్ళి చేసుకుంటానన్నావని నిన్నుఅంగీక రించింది. నీకంటే అధికుడు తన్ను వరించగానే ఆమె సంతోషంగా ఒప్పుకుంది. ఒకసారి పెళ్లి కాగానే ఏ ఆడదాని బుద్ధయినా నిలకడగానే ఉంటుంది. రాజేశ్వరి మీద నాకా నమ్మకముంది...." అన్నాను.

"అయితే పెళ్లి కాగానే బుద్ధిగా ఉంటే చాలా? పెళ్లికిముందు ఆమె ప్రవర్తన ఎలావున్నా ఫరవాలేదా?" అన్నాడు సుబ్రమణ్యం నెమ్మదిగా.

"అంటే నీ ఉద్దేశ్యం?"

"ముందే చెప్పాను. రాజేశ్వరి మంచిది కాదు...."

నమ్మలేకపోయాను. ఏ రాజేశ్వరి అమాయకమైన ముఖంచూసి నాన్నకు జరిగిన అన్యాయానికి ప్రతీకారం తీర్చుకునే ఉద్దేశ్యం మానుకున్నానో ఆ రాజేశ్వరి కులట అని సుబ్రమణ్యం చెబుతున్నాడు. ఇదెంతవరకూ నిజం.

"మిస్టర్ సుబ్రమణ్యం నోటికి వచ్చినట్లు మాట్లాడ్డం కాదు. అన్న మాటలకు ఋజువు చూపించాలి...." అన్నాను ఆవేశంగా.

"మిస్టర్ సూర్యం—అనవసరంగా ఆవేశపడకు! రాజే శ్వరి నన్ను మోసం చేయగానే నేను కాస్త దెబ్బతిన్న

మాట నిజమే కానీ అతి స్వల్ప వ్యవధిలోనే నా దిగులు నీ పట్ల జాలిగా మారింది. మొట్టమొదటిసారిగా రాజేశ్వరిపై నాకు అనుమానం కలిగింది. నా స్నేహితులు కొందరామె గురించి చెడ్డగా చెబితే మొదట్లో నిర్లక్ష్యం చేశాను. ఉద్యోగంచేసే ఆడవారిపై అందరూ అభాండాలు వేస్తారనీ అవి నమ్మకూడదనీ అనుకున్నాను.అందుకు కారణం రాజేశ్వరి ముఖంలో కనిపించే అమాయకత్వం.

నన్నామె మోసం చేయగానే ఆమె అమాయకురాలు కాదని అర్థమైంది. ఆ మర్నాటినుండి ఆమెను నీడలా వెన్నంటాను. ఉద్యోగంలేని నాకు వేరే పనేముంది? నా తీరుబడిని ఆమెచరిత్ర తెలుసుకుందుకుపయోగించాను. ఆమె చరిత్ర అతి నీచమైనదని తెలుసుకున్నాను. అప్పుడే నాకు నీ పట్ల కృతజ్ఞతాభావం కూడా కలిగింది. నీ కారణంగానే ఆ రాక్షసి బారినుండి తప్పించుకో గలిగాను కాబట్టి నీక్కూడా కొంత ఉపకారం చేయాలనిపించింది. నీకు చెప్పాలనుకునేలోగా నువ్వే వచ్చావు. నా మాట విని నువ్వు ఆమె సంగతి మర్చిపో—"

ఈ మాటలు నేనాశ్చర్యంగా విన్నాను. నేనూహించని కథ ఇది. ఇది అతను అసూయతో కల్పించి చెబుతున్నాడా, లేక నిజంగా జరిగినదేనా?

"నేను నీ మాటలు నమ్మవచ్చా — సుబ్రహ్మణ్యం?" అన్నాను.

"పూర్తి నమ్మకం కలగాలంటే నేను చెప్పినట్లు చెయ్యి—" అన్నాడు సుబ్రహ్మణ్యం.

## 5

"ఎవరు కావాలి సార్!" అన్నాడు అక్కడి వుద్యోగి.

రాజేశ్వరి పేరు చెప్పాను.

"ఆ పక్క గదికి వెళ్ళండి సార్!" అన్నాడతను.

గది తలుపులు దగ్గరగా వేసివున్నాయి. నెమ్మదిగా చప్పుడు కాకుండా తీశాను. లోపలి దృశ్యం నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది.

అది చిన్న గది. ఆ గది నీటుగా సర్ది వుంది. ఓ టేబులు, టైపురైటరూ పక్కగా ఫైళ్ళు పెట్టుకునే ర్యాకూ వున్నాయి. అక్కడ ఇంకో తలుపుదగ్గరగా వేసివుంది. ఆ తలుపులోంకి యూనిఫాంలో వున్న ఓ మనిషి కళ్ళు దగ్గరగా పెట్టి చూస్తున్నాడు. అతను ప్యూన్ అయుండాలని అనుకున్నాను.

నెమ్మదిగా అతన్ని సమీపించి భుజంమీద చేయి వేశాను. అతనులిక్కిపడి నా వంక చూసి ఏదో అనబోయాడు. చటుక్కున ఓ పదిరూపాయలనోటు అతనికి చూపి మాట్లాడవద్దన్నట్లు సైగ చేశాను. అతను నా కూడా ఆ గదిలోంచి బయటకు వచ్చాడు.

"లోపల ఏమిటి చూస్తున్నావ్?"

ప్యూన్ క్షణంపాటు తడబడి — "కావాలంటే మీరూ చూడవచ్చు—" అంటూ నా దగ్గర్నుంచి పది రూపాయలనోటు అందుకున్నాడు.

"ఆ గదిలోకి వెడతాను—" అన్నాడు.

"వెళ్ళడానికి వీల్లేదు. నా వుద్యోగం వూడుతుంది...." అన్నాడు ప్యూన్.

అతని పరిస్థితి అర్థమైంది. నేను వెళ్లి తలుపు దగ్గరకు వెళ్ళాను. తలుపుకు ఆ కన్నం చాలా తెలివిగా చేయబడివుంది. తలుపునిండా సున్నాల్లాంటి డిజైనులున్నాయి. అలాంటి ఓ డిజైను స్థానంలో ఆ రంధ్రం చేయ

పడింది. గదిలోనివారికి తెలియకుండా గదిలో విశేషాలు చూడవచ్చు. అందులోంచి చూసి షాక్ తిన్నాను.

లోపల ఒక పురుషుడు, స్త్రీ ఉన్నారు. వారి చేష్టలు చాలా అసభ్యంగా ఉన్నాయి. ఆ స్త్రీ సాక్షాత్తూ రాజేశ్వరి!

ఫ్యాన్ నాకు వివరాలు చెప్పాడు. ఆ పురుషుడు కంపెనీ యజమాన్యానికి సంబంధించినవాడు. ఈ ఆఫీసులోనూ కూర్చుంటాడతను. అతను ఆఫీసులో కూర్చునేది విలాస జీవితానికి. ఆ గదికి కాపలా ఈ ఫ్యాన్. రాజేశ్వరి అతనికి పర్సనల్ అసిస్టెంటు. ఈ గదిలోకి ఇంకెవ్వరూ రారు.

"గది తలుపుకు ఆ కన్నం ఎవరు చేశారు?" అన్నాను.

అది ఫ్యాన్ తనే స్వయంగా చేశాడుట. తనకు తెలిసిన వాళ్ళ దగ్గర అయిదూ పదీ పుచ్చుకుని గదిలో దృశ్యాలు చూపిస్తూంటాట్ట. ఆ గదిలో ఉన్నంతసేపూ రాజేశ్వరి నగ్నంగానే ఉండాలట. ఆ పురుషుడు మహా రసికుడట. ఒకరోజు తను ఇంకో స్త్రీని కూడా తీసుకువచ్చాట్ట. గదిలో టేబుల్ టెన్నిస్ ఆడడానికి టేబుల్ వుంది. ఒకరోజు సెట్ స్థానంలో రాజేశ్వరి బల్లమీద నగ్నంగా పడుకుందిట. ఆ పురుషుడూ, ఆమె కలసి టేబుల్ టెన్నిస్ ఆడారుట. అందరూ నగ్నంగానే ఉన్నారుట. ఫ్యాన్ వివరాలను కాస్త అసభ్యంగానే చెప్పాడు.

"నన్నెలా లోపలకు రానిచ్చారు?" అన్నాను.

రాజేశ్వరికోసం యెవరొచ్చినా ఈ గదికి పంపుతారుట. ఈరోజు నేనిక్కడికి వస్తానని ఫ్యాన్‌కి సుబ్రహ్మణ్యం చెప్పాట్ట.

ఫ్యాన్ చేతిలో మరో పదిరూపాయలు పెట్టి అక్క

డ్చించి బయటపడ్డాను.

ఎంత నీచమైనదీ ప్రపంచం.

లక్షల ఆస్తికి వారసుడ్ని నేను. ఇంతవరకూ నాకు స్త్రీ స్పర్శ తెలియదు. శరీరాన్ని చాలా పవిత్రంగా ఉంచుకున్నాన్నేను. ఎంతో అమాయకంగా కనబడే రాజేశ్వరి స్వైరిణి!

ఆ సాయంత్రం రాజేశ్వరిని పార్కులో కలుసుకున్నాను.

ఆమె ఎప్పటిలాగే మామూలుగానే వుంది. అమాయకమైన కళ్ళతో నా వంక చూసింది.

"ఈరోజు రెండోసారిగా నీ ఆఫీసుకు వచ్చాను. మొదటిసారి వచ్చినపుడు నిన్ను బయటకు పిలిపించి వుత్తరమిచ్చాను. ఇప్పుడు స్వయంగా లోపలకు వచ్చి నీ నిజస్వరూపం చూశాను...." అన్నాను.

ఆమె కళ్ళలో కలవరం కనబడింది—"నిజస్వరూపం అంటే?"

"మన అసలు రూపం కనబడకుండా బట్టలు కట్టుకొంటాం. నిజస్వరూపం బట్టల మరుగున ఉండిపోతుంది. కానీ ఆఫీసులో నీ నిజస్వరూపం చూసే అవకాశం కలిగింది...." అన్నాను.

ఈసారి ఆమె ముఖంలో మరింత కంగారు కనబడింది. "ఏం చూశావ్ నువ్వు?"

"నిన్నూ, నీ కంపెనీ యజమానినీ ఒకే గదిలో చూశాను. ఇద్దరూ నిజస్వరూపాల్లోనే ఉన్నారు. అప్పుడు టైము పదకొండయిందనుకొంటాను...." అన్నాను.

"నన్ను గురించి ఎవరైనా చెడ్డగా చెబితే విన్నావా?" అంది రాజేశ్వరి.

"విన్న విషయం వేరు. నువ్వు టేబిల్ టెన్నిస్ బల్ల మీద నెట్ గా నిజస్వరూపంలో పడుకోవడం విన్నాను. చూసింది వేరు. చెప్పమంటావా?" అంటూ స్వరం తగ్గించి నేను చూసింది చెప్పాను.

రాజేశ్వరి ముఖం గంభీరంగా మారిపోయింది — "అయితే నీకు అంతా తెలిసిపోయింది. నేనొక అభాగ్యురాలిని—" అంది.

"కాదు, మోసగత్తెవు...." అన్నాను.

"ఒకవిధంగా మోసగత్తెనే....ఒక హంతకుడి కొడుకునని స్పష్టంగా చెప్పావు. నీ గురించి ఒక్క విషయం కూడా దాచలేదు. కానీ నా గురించి నేను చెప్పలేదు. ఆ కంపెనీలో ఉద్యోగంలో చేరి నేను పాడైపోయాను. కానీ ఇది నా అనుమతితో జరిగింది కాదు. నా అసహాయత నాధారంగా తీసుకొని నా యజమాని నన్నిలా చేశాడు. మొదటిరోజు డిక్టేషన్ పేరుతో గదిలోకి పిలిచి బలవంతం చేశాడు. వాడి పశుబలానికి లొంగిపోయాను. అప్పుడు కొన్ని ఫోటోలు తీసుకుని వాటి సాయంతో బ్లాక్ మెయిల్ చేస్తూ నన్ని ఉద్యోగం మానకుండా చేస్తున్నాడు.

గదిలో నా శీలం కోల్పోవడమే కాక కంపెనీ తాలూకు కొన్ని అక్రమ వ్యవహారాల్లో కూడా నేను పాల్గొనవలసివస్తోంది. ఇంకో అమ్మాయెవరైనా నా వుద్యోగంలో ప్రవేశించేవరకు నాకీ బాధ తప్పదు. చూస్తూ చూస్తూ మరో అమ్మాయిని నా గతి పాల్జేయలేక నేనే ఈ వుద్యోగం కొనసాగిస్తున్నాను. ఒకటి రెండు సార్లు ఆత్మహత్య చేసుకోవాలనుకున్నాను కానీ— నేను కావాలని ఏ తప్పూ చేయనప్పుడలా యెందుకు చేయా

లనిపించి ఊరుకున్నాను...." అంది రాజేశ్వరి నిట్టూర్చి.

"అయితే నన్నెలా పెళ్ళి చేసుకోవాలని అనుకున్నావు...." అన్నాను తీవ్రంగా.

"నిజం చెప్పాలంటే సుబ్రమణ్యాన్ని కాదని మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలని నే ననుకోవడానికి కారణం అదే! ఓ పాతిక వేల రూపాయలిస్తే నా ఫోటోలు నాకిచ్చి ఉద్యోగంలోంచి నన్ను రిలీవ్ చేస్తానన్నాడు కంపెనీ యజమాని...." ఒక క్షణం ఆగి అంది రాజేశ్వరి—"నాకై నేను ఇంకో అమ్మాయినైనా అప్పగించాలి. లేదా పాతిక వేల రూపాయ లిస్తే అతనింకో అమ్మాయిని వెతుక్కుంటాడు. ఇదీ అతని షరతు. చూస్తూ చూస్తూ నా చేతుల్తో మరో అమ్మాయినీ రొంపిలోకి దించడం నా కిష్టంలేదు. కానీ సుబ్రమణ్యాన్ని పెళ్ళి చేసుకునేందుకాపనే చేయాలనుకున్నాను.

"మీ పరిచయం కాగా నే-సుబ్రమణ్యాని కన్యాయం జరగొచ్చుగాక—కనీసం నా కారణంగా ఇంకో కన్నె పడుచు జీవితం నాశనం కాకూడదనిపించింది. పాతిక వేలు మీకోలెక్క కాదు—ఈ ఊబిలోంచి బైట పడవచ్చు ననుకున్నాను కానీ మీకు అంతా తెలిసిపోయింది. మీరింక నన్నెలాగూ పెళ్ళి చేసుకోరు.... నేనీ ఊబిలోంచి బైట పడలేను....ఇంక ఆ సుబ్రమణ్యం సంగతి చెప్పనే అక్కర్లేదు...." అంది రాజేశ్వరి బాధగా.

ఆ క్షణంలో రాజేశ్వరిపట్ల నాకున్న ద్వేషమంతా పోయింది. ఆమెపైన జాలి కలిగింది. ఆమె తన గురించి నిజాన్ని దాచిపెట్టడం సహజమే! ఆ పరిస్థితుల్లో నేనున్నా అంతే చేసేవాడిని. అంతమాత్రాన అన్నీ కోల్పోయిన ఆమెను నా స్వంతం చేసుకోలేను.

"రాజేశ్వరీ నీపట్ల నాకు సానుభూతి ఉంది. కానీ నేను నిన్ను పెళ్ళి చేసుకోలేను...." అన్నాను.

రాజేశ్వరి కనుకొలకుల్లో నీళ్ళు తిరిగాయి. ఆమె రెండు చేతులతోటీ ముఖం కప్పుకుని యేడుపు ప్రారంభించింది. ఆ ఏడుపు క్రమంగా పెద్దదై ఆమె వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

ఆమెను అలా చూస్తూంటే నాకు బాధ అనిపించింది. అప్పుడే నేనో విషయం గుర్తించాను. సుబ్రహ్మణ్యాన్ని మానసికవ్యధకు గురిచేయాలనుకున్నాను నేను. కానీ అతను చెప్పిన నిజం కారణంగా నేనే ఇప్పుడు మానసిక వ్యధకు గురయ్యాను. రాజేశ్వరి గురించి తెలిసిన నిజం నన్ను కనీసం కొన్ని మాసాలపాటు వేధించి తీరుతుంది.

ఇప్పుడు ఒక్క రాజేశ్వరిమీద మాత్రమేకాక, స్త్రీ జాతిమీదనే నాకు మోజు పోయింది. సుబ్రహ్మణ్యాన్ని చంపేకనే ఇక నా బ్రతుకు గురించి ఆలోచిస్తాను — అనుకొని రాజేశ్వరిని ఆమె కర్మకు వదిలిపెట్టి అక్కడ్నించి బయల్దేరాను.

## 6

సుబ్రహ్మణ్యాన్ని చంపడం గురించి ఓ రాత్రంతా ఆలోచించాను.

అతన్ని చంపడానికి రెండే రెండు మార్గాలున్నాయి.

ఒకటి అతని గదికి వెళ్ళి చంపడం!

అతని గది ఆట్టే జనసంచారంలేని ఒకచోట ఉంది. అక్కడ అయిదు మేడలున్నాయి. ఒకదానితో ఒకటి సంబంధం లేకుండా ఉండే ఆ మేడల్లో ఒక మేడలో గ్రౌండ్‌ఫ్లోర్‌లో వుంది సుబ్రహ్మణ్యం గది. ఆ గదికి రాత్రి తొమ్మిదిగంటల ప్రాంతాల వెడితే ఎవ్వరూ

పట్టించుకోరు. అక్కడికి నేను వెళ్ళినట్లే తెలియదు.

సుబ్రహ్మణ్యానంది ఓ పల్లెటూరు. ఉద్యోగప్రయత్నంమీద వచ్చి ఉంటున్నాడతను కొద్ది మాసాలుగా. పగటిపూట కొందరిళ్ళల్లో ట్యూషన్ చెప్పి కొంత డబ్బు సంపాదిస్తున్నాడతను. అద్దె చవగ్గా వుంటుందని ఊరికి చివరగా ఉంటున్నాడతను. అతను హత్య చేయబడితే ఆ విషయం తెలుసుకుందుకు చాలాకాల పడుతుంది.

రెండో మార్గం నా ఇంటికి ఆహ్వానించి చంపడం. ఇక్కడ హత్య చేయడం సులభమే—కానీ తప్పించుకోవడం కష్టమవుతుంది. మళ్ళీ ఏ సుబ్రహ్మణ్యంలాంటివాడో యేదోవిధంగా సాక్ష్యంగా నిలబడి నన్ను పట్టించే అవకాశాలిక్కడున్నాయి.

బాగా ఆలోచించి అతన్ని అతనింట్లోనే చంపాలని నిశ్చయించుకున్నాను. ఇలా నిర్ణయించుకున్నాక నా మనసు బరువెక్కింది. కొరివితో తల గోక్కుంటున్నాననీ, కోరి ఆపద నాహ్వానిస్తున్నాననీ, కావాలని సుఖజీవితానికి దూరమవుతున్నాననీ అనిపించసాగింది. అయితే మరి నాన్న సంగతేమిటి?

సుఖంగా నాతో జీవించవలసిన నాన్న సుబ్రహ్మణ్యం కారణంగా ప్రస్తుతం జైల్లో వున్నాడు — యావజ్జీవ కారాగార శిక్ష ననుభవిస్తూ.

నాన్న నాకోసం ఎన్నో యేమిటి?—అన్నీ త్యాగం చేశాడు. నాన్నకోసం ఇంతవరకూ నేనేమీ చేయలేదు. ఒక్కటంటే ఒక్క త్యాగం కూడా చేయలేదు.

నేను సుబ్రహ్మణ్యాన్ని చంపితే నాన్న జైలుశిక్ష తగ్గుతుందా?

తగ్గొచ్చు తగ్గకపోవచ్చు. కానీ నా పగ తీర్తుంది.

నిజం చెప్పాలంటే నా పగ అంత బలంగా లేదు. కాలం గడుస్తూంటే ఆత్మబంధువుల వియోగాలే మరిచి పోవచ్చుగదా—అలాంటప్పుడు ఈ పగదేముంది?

నా ఆలోచనలింకా ఏ కొలిక్కి రాకుండానే రాజేశ్వరి దగ్గర్నుంచి నాకో ఫోన్ కాల్ వచ్చింది. దయతో తననోసారి పార్కులో కలుసుకోమని కోరిందామె— ఆ సాయంత్రం కలుసుకోవాలిట. సరేనన్నాను.

నా నుంచి రాజేశ్వరి యేమి కోరుతోంది? ఎందుకామె నన్ను చూడగోరుతోంది?

ఈ ఆలోచనలు చాలాసేపు నన్ను వేధించాయి.

ఆ సాయంత్రం ఆమె చెప్పిన చోటకు వెళ్ళాను. అక్కడ రాజేశ్వరిమాత్రమే కాదు సుబ్రమణ్యంకూడా వున్నాడు. అందుకు నేను చాలా ఆశ్చర్యపడ్డాను.

రాజేశ్వరి తలవంచుకుని కూర్చుంది. సుబ్రమణ్యమే నన్ను పలకరించి—"రాజేశ్వరి నా తరఫున నిన్ను పిలిచింది—" అన్నాడు.

"ఎందుకు?" అన్నాను ఆశ్చర్యంగా.

"రాజేశ్వరి కారణంగా నాకు స్త్రీ జాతిపైనే అసహ్యం ఏర్పడినమాట నిజం. అయితే రాజేశ్వరి అసలు కథ తెలిశాక నా అసహ్యం స్త్రీజాతి మీంచి మన సమాజం మీదకు మళ్ళింది. ఏదియేమైనా ఆమె పరిస్థితులకు బానిస తప్పితే—ఆమెదంటూ తప్పేమీ లేదని నాకు అనిపించింది. ఇప్పుడీ స్థితిలో ఆమెనలా వదిలేస్తే అధః పాతాళానికి వెళ్ళిపోతుంది. ఆమెకు చేయూత అవసరం. నేనామెకు చేయూతనిచ్చి గౌరవంగా బ్రతికే అవకాశం ఇవ్వదల్చుకున్నాను—" అని అన్నాడు సుబ్రమణ్యం.

"అంటే?" అనడిగాను.

"నేను రాజేశ్వరిని పెళ్ళి చేసుకుంటాను...."

షాక్ తిన్నాను — "నువ్వేమంటున్నావో నీకు తెలుసా?"

"తెలుసు—" అన్నాడు సుబ్రమణ్యం ముక్తసరిగా.

"అయితే ఈ విషయం నాకెందుకు చెప్పడం?" అన్నాను చిరాగ్గా.

అప్పుడు రాజేశ్వరి పెదవి విప్పింది—"నన్ను పెళ్ళి చేసుకోలేకపోయినా నాకు సాయపడగలనని అన్నావు గదా—అందుకని నీ సాయం కోరాలని అనుకున్నాను-"

"మీ పెళ్ళికి నేను చేయగల సాయమేముంది?" అన్నాను అర్ధంకాక.

"ఆ బ్లాక్ మెయిలర్ బాధనుంచి తప్పించుకోడానికో పాతిక వేలు కావాలి. నువ్వు తప్ప నాకు సాయపడగలవారెవ్వరూ లేరు—" అంది రాజేశ్వరి.

"ఊరికే ఇవ్వద్దు. అప్పుగా ఇవ్వు. నేను నీకు నోటు రాసిస్తాను...." అన్నాడు సుబ్రమణ్యం.

సుబ్రమణ్యం త్యాగశీలతకు నేనాశ్చర్యపడ్డాను. అంతలోనే నాలో ఓ చిన్న అనుమానం ప్రవేశించి క్షణాలమీద పెద్దదిగా మారిపోయింది.

నన్ను అమాయకుడ్ని చేసి వీళ్ళిద్దరూ నాటకమాడ లేదు గదా!

ఆలోచించి చూడగా వాళ్ళేదో ఓ పెద్ద పథకంవేసి నన్ను వెర్రివెధవను చేయాలనుకుంటున్నా రనిపించింది. ఈ భావం స్ఫురించగానే నాక్కలిగిన కోపమింతా అంతా కాదు.

ఏది యేమైనా ఈ విషయంలో పైకి తేలదల్చుకో లేదు. అందుకే రాజేశ్వరివంక చూసి — "ఆల్ రైట్.

పాతిక వేలిస్తాను. నీ బ్లాక్ మెయిలర్ ని నేనే స్వయంగా కలుసుకుని, ఆ డబ్బు ఇచ్చి నీ నెగటివ్సు తీసుకుంటాను. అందుకు యేర్పాట్లు చేయి—" అన్నాను.

## 7

రాజేశ్వరి నాకు ఫోన్ చేసి ఓ అడ్రస్ చెప్పింది. అది నోట్ చేసుకున్నాను. పాతిక వేలు—అన్నీ వందరూపాయలనోట్లు జేబులో పెట్టుకున్నాను. కాలినడకన బయటకు వచ్చాను.

రాజేశ్వరిచ్చిన అడ్రసు పట్టుకోవడం చాలా కష్టమైంది. సందుగొందులు తిరగాల్సొచ్చింది, ఎందరో ఇళ్ళ వాళ్ళను పలకరించాల్సొచ్చింది. కిళ్ళీకొట్ల వాళ్ళ సాయం కూడా తీసుకున్నాను.

ఇప్పుడు నన్నెవ్వరు కలుసుకుంటారు?

ఆ రోజు ఆ కంపెనీ ఆఫీసులో చూసిన మేనేజరేనా?

అతను నిజంగా కంపెనీ మేనేజరా—లేక రాజేశ్వరి, సుబ్రమణ్యం నాటకమాడిస్తున్న మనిషా?

ఎందుకో అది నాటకమంటే నాకు మనసొప్పలేదు. ఒక ఆడది పరాయి మగవాడిముందు మరీ అంత పచ్చిగా ప్రవర్తించలేదు-నిజమైన చనువుంటే తప్ప! పాతిక వేల రూపాయలకోసం యే ప్రియుడూ తన కాబోయే భార్య నటువంటి పనికి వినియోగించాడు. ఈ దృశ్యాన్ని చూసే మూడోవ్యక్తికి ఫ్యాన్ కూడా వున్నాడు. ఇలాంటి నాటకాన్ని సిగ్గూ, శరమూ ఉన్న వాళ్ళెవరూ ఆడలేరు. సుబ్రమణ్యం, రాజేశ్వరి మర్యాదస్తులవలెనే కనబడతారు.

ఆలోచిస్తూనే నాక్కావలసిన ఇల్లు చేరి తలుపు తట్టాను. అయితే తలుపు తెరిచే వుంది. కాస్త గట్టిగా తట్టగానే అది తెరుచుకుంది.

అది చాలా మామూలు పెంకుటిల్లు. ఇంట్లో ఎవ్వరూ వేరే మనుషులున్నట్లు లేదు. ఎక్కడా అలికిడి వినిపించడంలేదు.

ఒకసారి వాచీవంక చూశాను. టైము ప్రకారమే వచ్చాను నేను. అయితే రాజేశ్వరి ఎక్కడ? ఆ కంపెనీ మేనేజరెక్కడ? ఎవరూ ఇంకా రాలేదేం?

ఆలోచిస్తూనే నేను గదిని పరిశీలించి చూశాను. గది మధ్య నల్లగా మెరుస్తూ ఓ వస్తువు కనిపించింది. ఆశ్చర్యంగా దాన్ని సమీపించాను. అది ఒక పిస్తోలు.

అప్రయత్నంగా అందుకొని చూశాను.

నేనెప్పుడూ పిస్తోలు వాడలేదు కాని దానివాటం చూస్తూంటే అది బొమ్మ పిస్తోల్లా లేదు. నిజం పిస్తోలనే అనిపిస్తోంది. నిజం పిస్తోలయితే ఆ ఇంట్లో యెందుకు పడి వుంది?

పిస్తోలు చేతో పట్టుకుని చుట్టూ చూశాను. అక్కడ్నించి మరో గది ఉంది. గది గుమ్మానికి అడ్డంగా తెర వ్రేలాడుతూ ఉంది. తెరను తొలగించుకుని ఆ గదిలో ప్రవేశించాను. అంతే?

నా చేతిలోని పిస్తోలు నేలజారింది. నా కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి. నా గుండె నాకు తెలియకుండానే వేగంగా కొట్టుకోసాగింది. నా శరీరమంతా ఒక్కసారి వణికింది.

గదికి మధ్య నేలమీద వెల్లకితలా పడివుంది శవం. గుండెలనుంచి రక్తం కారినట్లుంది.

ఆ శవం రాజేశ్వరిది!

నేను రాజేశ్వరిని సమీపించీ జాలిగా ఆమెవంక చూశాను.

చివరకు ఆమెను ఎటువంటి చావు వరించింది.

అసలు రాజేశ్వరిని ఎవరు చంపారు? యెందుకు చంపారు?

నా ఆలోచనలింకా ఓ కొలిక్కి రాకుండానే వీధి గుమ్మంవైపు యేదో కలకలంలా వినబడింది. అప్పుడు నేనీ లోకంలోకి వచ్చాను. నేనున్నది ఒక హత్యా ప్రదేశంలో. ఇప్పుడెవరైనా వచ్చి నన్ను చూస్తే ఈ హత్యానేరం నాకే అంటగడతారు. అందులోనూ నేను హంతకుడి కొడుకును కూడా!

ఎవరో ఆ గదిలోకి వస్తున్నారనిపించి అక్కడున్న బీరువాపక్క దాక్కోవాలనుకొన్నాను. ఆ బీరువాపైన చేతులువేసి వెనక్కు వెళ్ళాలని ప్రయత్నించాను. కానీ వెనుక తగినంత చోటు లేదు. అప్పుడే నాకు ఆ గది లోంచి మరో గదిలోకి వున్న దారి కనబడింది. హడా వుడిగా అలా పరుగెత్తాను. ఆ దారి వంటింట్లోకీ అక్క డ్నుంచి దొడ్లోకీ నన్ను నడిపించింది. దొడ్డికి ఓ గుమ్మం వుంది. అది బార్లా తీసివుంది. అక్కడ్నుంచి నేనో ఇరుకు సందులోకి వెళ్ళాను. అంతవరకూ నా గుండెలు దడదడ లాడుతూనే వున్నాయి. అప్పటికి నా మనసు కాస్త తేలికపడింది.

నెమ్మదిగా ఇల్లు చేరుకుని బట్టలు మార్చుకున్నాను. అనుకోనిది జరిగినందువల్ల నా శరీరమంతా అదో విధమైన ఉత్తేజానికి గురైంది.

నేను ఇల్లు చేరుకున్న అరగంటకు నా ఇంట్లో టెలి ఫోన్ మోగింది.

"హలో!" అన్నాను.

"మిస్టర్ సూర్య మేనా?" అంది అవతలి కంఠం.

"అవును.... మీరెవరు?"

"రాజేశ్వరిని చంపిన హంతకుడ్ని...." అంది ఆవతలి కంఠం.

ఉలిక్కిపడ్డాను—"ఏమన్నావ్?"

"రాజేశ్వరిని చంపిన హంతకుడ్ని. తన కథ మరో మనిషికి చెప్పిన పాపానికి రాజేశ్వరి చచ్చిపోయింది. ఆమె శవాన్ని చూసి నువ్వు ఉత్తినే ఊరుకోక పిస్తోలుపై నీ వేలిముద్రలు వేశావు. నీ గురించిన ఆధారాలింకా మరి కొన్ని వదిలావు. అవన్నీ పోలీసుల రికార్డులోకి వెళ్లిపోతున్నాయి. ఆ హత్యానేరం నీకే చుట్టుకుంటుంది...."

నాకు ముచ్చెమటలు పోశాయి—"ఎవర్నువ్వు. నీకేం కావాలి!" అన్నాను కంగారుగా.

"నేనెవరో నువ్వు తెలుసుకోలేవు. కానీ హత్యానేరంపైన జైలుకి వెళ్ళడానికి సిద్ధంగావుండు...." అందా కంఠం.

"నేను నీకేం అపకారం చేశాను?"అన్నాను దీనంగా.

"అపకారికి ఉపకారం చేయడం చాలా గొప్ప విశేషమన్నాడు సుమతి. నేనందుకు వ్యతిరేకిని. నేను ఫాలో అయ్యేది కుమతీశతకం. కుమతీ శతకం ఏమంటుందంటే ఉపకారికి కూడా అపకారం చెయ్యమని!" అందా కంఠం.

"హలో—నన్ను రక్షించలేవా?" అన్నాను కంగారుగా.

"పాతికవేలతో మా కంపెనీ మనిషిని కొనడానికి ప్రయత్నిస్తావా? నీలాంటివాళ్ళు బ్రతికుండడం మా కంపెనీకి క్షేమంకాదు. నిన్ను రక్షించడం నా వల్ల కాదు. సో బీ రెడీ ఫర్ ట్రయల్!"—అవతల క్లిక్కుమంది.

నాకు పిచ్చెక్కినట్లయింది. ఇలాంటి పరిస్థితిలో ఇరుక్కుంటానని నే నెన్నడూ అనుకోలేదు.

ఈ సందర్భంలో నన్ను రక్షించగలిగిన వారెవ్వరు?

ఎవరైనా ప్రయివేట్ డిటెక్టివ్‌ను కలుసుకోవాలనుకున్నాను. ప్రయివేట్ డిటెక్టివ్ అనగానే నాకు డిటెక్టివ్ వెంకన్నే గుర్తుకొచ్చాడు. ఎలాంటి కేసులోనైనా అసలు హంతకులను పట్టుకోవడంలో ఆయన దిట్ట అంటారు. వ్యక్తిగత సామర్థ్యానికి అదృష్టం కూడా తోడుకావడం కొందరి విషయంలో జరుగుతుంది. అలా అదృష్టం కలిసిరావడంవల్లనే ఆయన మా నాన్నను హంతకుడిగా నిరూపించగలిగాడు.

వెంటనే నాకు భయం వేసింది. వెంకన్న మా కుటుంబానికి అచ్చిరాలేదు. ఆయన అదృష్టం సంగతి యెలావున్నా ప్రస్తుతం నన్ను దురదృష్టం వెంటాడుతోంది. తీరి కూర్చుని నేనాయన వద్దకు వెళ్ళడమెందుకూ? ముందు అనుమానితుల లిస్టులోకి నా పేరు రానీ చూద్దాం— అనుకున్నాను.

అప్పుడే నాకో విషయం గుర్తుకొచ్చింది.

నేను రాజేశ్వని పెళ్లి చేసుకుంటానన్నాను. ఆమె సంతోషంగా అంగీకరించింది. ఆమెకు ఖరీదైన బహుమతులిచ్చాను. ఆ తర్వాత ఆమెను పెళ్ళి చేసుకోనని అన్నాను. రాజేశ్వరి శవాన్ని గుర్తించడం జరుగగానే ఆమె తలిదండ్రులు నా పేరు చెబుతారు. పోలీసుల అనుమానం నాపై మళ్ళుతుంది. వేలిముద్రలు పరిశీలిస్తారు. నన్ను హంతకుడిగా నిరూపిస్తారు. నేనేం చెప్పినా యెవరూ నమ్మరు. నా కథ అంతా కల్పనతో వుంటుంది. అందులోనూ నేను హంతకుడి కొడుకును! ఎవరికీ నాపై దయ

ఉండదు. నమ్మకం వుండదు.

అంటే అన్యాయంగానైతేం నేను పట్టుబడడం తప్పని సరి! అంటే స్వేచ్ఛగా నేను తిరగడానికి నా కున్న వ్యవధి చాలా తక్కువగా వుంది. ఈలోగా ముఖ్యమైన రాచకార్యాలుంటే చక్కబెట్టుకోవాలి. సుబ్రహ్మణ్యాన్ని చంపడంకంటే నాకున్న రాచకార్యాలేమిటి?

ఈ ఆలోచన రాగానే నా రోమాలు నిక్కబొడుచుకున్నాయి.... సుబ్రహ్మణ్యం చావాలి.

నేను లేచి ఆల్మిరా దగ్గరకు వెళ్ళాను. అందులో ఒక సీసా వుంది. ఆ సీసాలోది విషం అని నాన్న చెప్పాడు నాకు. తను చేసే ప్రమాదకరమైన కార్యాలకు అటువంటి విషం దగ్గరుండడం మంచిదని ఆయన నాతో అన్నాడు.

నాన్నలో చెప్పుకోదగ్గ గొప్ప విశేషమేమిటంటే నాకు ఇరవయ్యేళ్లు వచ్చినప్పట్నుంచీ ఇంట్లోని రహస్యాలన్నీ నాకు చెప్పేశాడు. తను చేసే ప్రమాదకరమైన పనుల వివరాలు నాకు చెప్పేవాడు కాదు కానీ తను చేసేవి మంచిపనులు కాదనిమాత్రం చెప్పేవాడు. అమ్మ బ్రతికుంటే ఆయ నిలాంటి మార్గాలు తొక్కివుండేవాడు కాదుట. నన్నుమాత్రం చెడ్డపనుల జోలికి వెళ్ళకుండా జీవితాన్ననుభవించమనేవాడు.

నాన్నకు శత్రువులు చాలామంది వుండివుండాలి. వాళ్ళ పేర్లుమాత్రం ఆయన నాకెన్నడూ చెప్పలేదు. నేను కూడా యెన్నడూ తరచి తరచి అడుగలేదు.

ఇప్పుడాలోచిస్తూంటే అనిపిస్తోంది. రాజేశ్వరి పని చేసే కంపెనీ మేనేజర్‌కీ నాన్నకీ యేదో శత్రుత్వముండివుండాలి. ఒకే దెబ్బకు రెండు పిట్టలన్నట్లు వాడు

రాజేశ్వరిని చంపి నన్ను హత్యా నేరంలో ఇరికించాడు.

కొంపలుమునిగే పరిస్థితివస్తే తను చావడంకోసం విషం కూడా ఇంట్లో అట్టే పెట్టుకున్నాడు నాన్న. అంటే ఆయనెలాంటి ప్రమాదకరమైన పనులు చేసేవాడో ఊహించుకోవచ్చు. అంతా నా కోసం. అలాంటి నాన్న కోసం నేను ఈమాత్రం చేయలేనా?

అల్మిరాలోంచి విషం సీసా తీసుకున్నాను.

ఇంట్లోంచి బయటకు వచ్చాను. తిన్నగా సుబ్రమణ్యం ఇంటికి వెళ్ళాను.

సుబ్రమణ్యం ఇంటికి తాళం వేసివుంది. అతను తాళం చెవి ఇంటాయన దగ్గర వదిలి వెడతాడు. నేనాయన వద్దకు వెళ్ళి తాళంచెవి అడిగి తీసుకున్నాను. అదివరలో ఆయన ఒకటి రెండుసార్లు నన్ను చూశాడు. అందు వల్ల మాట్లాడకుండా తాళంచెవి ఇచ్చాడు.

నేను తాళంతీసి గదిలో ప్రవేశించాను. గదిలో కూజా వుంది. కూజాలో నీళ్ళున్నాయి. నా జేబులోవున్న విషం సీసా తీశాను. కూజాలోని నీళ్ళలోకి సీసాలోని విషాన్ని ఒంపాను. ఒకసారి కూజాను బాగా కలిపి మూత పెట్టాను. కూజాను నా చేత్తో పట్టుకునేటప్పుడు వేలిముద్రలు పడ కుండా రుమాలు వుపయోగించాను.

తర్వాత అక్కడున్న లెటర్‌పాడ్ తీసుకొని—"డియర్ సుబ్రమణ్యం - ఈరోజు సాయంత్రం నువ్వూ, నేనూ రాజేశ్వరీ పార్కులో కలుసుకొందాం. ఈ విషయం ఆమెక్కూడా చెప్పు—" అని రాసి కింద సంతకం పెట్టి తారీఖు, టైము రాశాను. తర్వాత గదికి మళ్ళీ తాళంవేసి-ఇంటి యజమాని కాతాళాన్ని అంద జేశాను.

ప్రస్తుతం నా పరిస్థితి అదోలా వుంది. నేను చాలా తెలివిగా ప్రవర్తిస్తున్నా అతి తెలివికి పోతున్నానేమో నన్న అనుమానం కూడా నన్ను పీడిస్తోంది. సుబ్రహ్మణ్యాన్ని చంపాలనుకోవడం యెంతవరకూ తెలివైనపనీ అని అంతరాత్మ అదేపనిగా ప్రశ్నిస్తోంది. అయితే తండ్రి ఋణం తీర్చుకోనేందుకు ఇంతకంటె చక్కని అవకాశ ముండదు మరి!

నేను ఇంటికి వెళ్ళాను. అంతవరకూ పోలీసులెవరూ ఇంటికి రాలేదు. కానీ యేదో క్షణంలో వాళ్ళు తప్పక వస్తారని నా అంతరాత్మ చెబుతోంది. అందుకని ఇంట్లో యెక్కువసేపు వుండదల్చుకోలేదు.

ఊరు విడిచి పోదామా అనిపించింది కానీ అందువల్ల అనుమానం మరింత పెరుగుతుంది. ఊరు విడిచినంత మాత్రాన పోలీసుల్ని తప్పించుకు తిరగడం చాలా కష్టం. అందువల్ల ధైర్యంగా వుండడమే మంచిది.

రోజంతా బయటే తిరిగాను. నా ఉత్సుకత అంతా రాజేశ్వరి మరణంపట్లే వుండడంవల్ల ఆ విషయాన్నొక కంట కనిపెడుతూనే వున్నాను.

శవాన్ని గుర్తుపట్టడం జరగలేదు. ఆ మెను వర్ణిస్తూ రేడియో ప్రకటనలు వచ్చాయి. వార్తా పత్రికలకు హతురాలి ఫోటో అందజేయబడింది. అయితే ఈ హత్యాకేసు కోసం ఒక్కసారిగా స్పెషల్ ఇష్యూ రాదు కదా! అందువల్ల మర్నాడుదయంవరకూ ఈ హత్యకేసు ముందడుగు వేయలేదు.

అయితే నా అంచనా తప్పయింది.

రాత్రి ఎనిమిది గంటల ప్రాంతంలో రాజేశ్వరి తల్లి దండ్రులు పోలీస్ స్టేషన్ కు ఫ్యాగునివ్వడానికి వెళ్లారు

అమ్మాయి యేమైందో తెలియడంలేదని. ఆ రోజల్లా ఆమె కంపెనీ ఆఫీసుకి కూడా వెళ్ళలేదని తెలిసింది. అందువల్ల వారు కంగారుపడి పోలీస్ స్టేషన్‌కి వెళ్లారు. అక్కడ కూతురు శవంగా ప్రత్యక్షమైంది.

శవం యెవరిదో తెలియగానే పరిశోధన వేగం అందు కోక తప్పదు. నేను రాజేశ్వరి కుటుంబాన్నోకంట కని పెడుతూండడంవల్ల ఈ విషయం క్షణాలమీద నాకు తెలిసిపోయింది. వాళ్ళు పోలీస్ స్టేషన్‌కు వెళ్ళగానే నాకు రోజులు దగ్గరపడ్డాయని గుర్తించాను నేను.

నిస్సందేహంగా పోలీసులు నా దగ్గరకు వస్తారు. నన్నింక యెవ్వరూ రక్షించలేరు.

అదృష్టవశాత్తూ పోలీసుల దృష్టికి నేను రాకపోతే!

ఈ విషయంలో రిస్కు తీసుకునేందుకు లేదు. ప్రస్తు తం నా అదృష్టం బాగోలేదు.

ఏమైతే అయిందని డిటెక్టివ్ వెంకన్నను కలుసు కొనేందుకు నిర్ణయించుకున్నాను.

# 8

"నువ్వు నా దగ్గరకు రావడం ఆశ్చర్యంగా వుంది—" అన్నాడు డిటెక్టివ్ వెంకన్న.

మా నాన్న కేసు గొడవలో నేనాయన్ను చాలా సార్లు కలుసుకున్నాను. అప్పట్లో నా దృష్టి ఆయన అసి స్టెంట్సు సీతమ్మ, రాజమ్మలపైన వుండేది. పిల్లలిద్దరూ రసగుల్లాల్లా వుంటారు. చూసినకొద్దీ మళ్ళీ మళ్ళీ చూడా లనిపిస్తుంది. వాళ్ళను చూడ్డంలో అదోరకమైన ఆనంద ముంది.

ఇప్పుడు నాకా ఆనందం కలగడంలేదు వాళ్ళను చూస్తూంటే. అసలు వాళ్ళను చూడాలన్న కోరికే లేదు

నాలో.

"ఆపదలో వున్నవారు మీ దగ్గరకు రావడంలో ఆశ్చర్యమేముంది?" అన్నాను.

"మీ నాన్నను నేనేగదా హంతకుడ్ని చేశాను?" అన్నాడు వెంకన్న అదోరకంగా.

"ఆ హంతకుడి కొడుకును హత్యానేరంనుంచి తప్పించ గలిగితే మీ గొప్పతనం బయట పడుతుంది—" అన్నాను.

వెంకన్న ఉలిక్కిపడి—"ఏమన్నావ్?" అన్నాడు.

నేను జవాబిచ్చేలోగా సీతమ్మ, రాజమ్మ లిద్దరూ ఏక కంఠంతో—"ఆ హంతకుడి కొడుకును హత్యానేరం నుంచి తప్పించగలిగితే మీ గొప్పతనం బయటపడుతుంది- అన్నాడు-" అన్నారు.

"హంతకుడి కొడుకు హత్యానేరంలో ఇరుక్కు న్నాడా? ఇటీజే వెరీ డిఫికల్ట్ కేస్—" అన్నాడు వెంకన్న నిట్టూర్చి.

"మీకు డిఫికల్టీ యేమిటిసార్—నిజాన్ని కనుక్కో వడం మీకు మంచినీళ్ళప్రాయం. నే నిరుక్కున్న హత్యా నేరం మీరు పరిశోధించి నిజం కనుక్కోగలిగితే నేను ఆటోమేటిక్ గా బయట పడతాను—" అన్నాను.

"చాలా బాగా మాట్లాడుతున్నావ్—నాపై నువ్వు చూపిన గౌరవానికీ నమ్మకానికీ ధన్యవాదాలు. అయితే నా సామర్థ్యాన్ని నువ్వు తప్పు అంచనా వేయలేదను కుంటాను...." అన్నాడు వెంకన్న.

"అంటే?"

"ఒకవేళ నువ్వు హంతకుడివనుకో. నాక్లయింట్ వైనా నిన్ను పట్టివ్వక తప్పదు. అటువంటి దురాశ నీకు లేకుండా వుండివుంటే నువ్వడగబోయే కేసు పరిశోధించగలను."

అన్నాడు వెంకన్న.

"మీ నిజాయితీ గురించి నాకు తెలుసు. కానీ ఈ కేసులో నన్ను మీరు హంతకుడిగా నిరూపిస్తే—మీ సామర్థ్యాన్ని మాత్రం బ్రతికున్నంతకాలం నిరసిస్తూనే వుంటాను...." అన్నాడు.

వెంకన్న అదోలా నవ్వి—"ఇంతకీ కేసు వివరాలు చెప్పు—" అన్నాడు.

నేను కేసు వివరాలు చెప్పాను.

"ఇంతకీ హతురాలి పేరేమిటన్నావ్?"

"రాజేశ్వరి" — అన్నారు సీతమ్మ, రాజమ్మ ఏక కంఠంతో.

"ఓహ్-రాజేశ్వరి హత్యకేసా?" అన్నాడు వెంకన్న యేదో తెలిసినట్లుగా.

"ఈ కేసుగురించి అప్పుడే మీ దాకా వచ్చిందా?" అన్నాను ఆశ్చర్యంగా.

"వచ్చింది. అసలు ఈ హత్యగురించి నువ్వేమనుకుంటున్నదీ చెప్పు...." అన్నాడు వెంకన్న.

"రాజేశ్వరి తను పనిచేసే కంపెనీలో తనకిష్టంలేని పనులు చేస్తోంది. ఆమె బ్లాక్ మెయిల్ చేయబడుతోంది. పాతికవేలిచ్చికానీ, మరోపిల్లను తనే వాళ్ళకప్పగించి కానీ రాజేశ్వరి ఆ బ్లాక్ మెయిల్ నించి బయటపడగలననుకుంది. నేనామెకు డబ్బిచ్చి సాయపడదామనుకున్నాను. అయితే రాజేశ్వరి తన కథను బయటివాళ్ళకు తెలియనివ్వడం ఆ కంపెనీ మేనేజర్ కి నచ్చలేదు. అతను రాజేశ్వరినంతం చేయదల్చుకున్నాడు. నామీదకూడా పగ వుండివుండాలి. ఆమెను చంపి నామీద కానేరాన్ని తోశాడు...." అన్నాను.

"నువ్వింందాకా చెప్పిన కథనం ప్రకారం నీకై నువ్వు రివాల్వర్ తీసుకున్నావు. నీ తెలివితక్కువ తనంతో అక్కడ నీ గుర్తులు వదిలావు. నీమీద నేరం తోసే అవకాశం నువ్వే అతనికిచ్చావు. కాబట్టి నేను అనుకునేదేమిటంటే నువ్వు చాలా తెలివితక్కువ వాడివైనా అయుండాలి...." అన్నాడు వెంకన్న.

"నేను హంతకుడ్ని కాను...." అన్నాను.

"నువ్వు హంతకుడివి కానిపక్షంలో నిశ్చింతగావుండు. అసలు హంతకుడెవరో నాకు తెలుసు. ఆ వివరాలన్నీ రేపు చెబుతాను. ఈ రాత్రికి సుఖంగా నిద్రపో—" అన్నాడు వెంకన్న.

# 9

నేను ఇంటికి వచ్చేసరికి నాకోసం పోలీసులు ఎదురు చూస్తున్నారు.

నేను ఆశ్చర్యాన్ని ప్రకటించాను. రకరకాలుగా నటించాను. రాజేశ్వరి హత్యగురించి విని మరోసారి బాధపడ్డాను. ఆ సంగతి తెలిసే మతిలేక తిరుగుతున్నానని చెప్పాను.

"ముందామెను పెళ్ళిచేసుకుంటానని చెప్పి తర్వాత చేసుకోనన్నారుట కదా-కారణం!"

"ఆమె నన్నుకాక నా డబ్బును ప్రేమిస్తోందని ఆలస్యంగా గ్రహించాను...." అన్నాను.

పోలీసులేవేవో ప్రశ్నలు వేసి అన్యథా భావించవద్దని చెప్పి నా వేలిముద్రలు తీసుకుని వెళ్ళారు. అప్పటి వాళ్ళ ప్రవర్తనబట్టి వాళ్ళకు నా మీద పెద్దగా అనుమానమేదీ లేదనీ, అప్పటికి తమ విద్యుక్త ధర్మాన్ని నిర్వహిస్తున్నారనీ గ్రహించాను. వేలిముద్రలు గుర్తించగానే వాళ్ళలో

ఎలాటి మార్పులు కలుగుతాయో ఊహించుకునేసరికి నా వళ్ళంతా చెమటలు పట్టింది. రాత్రి నాకు సరిగ్గా నిద్ర పట్టలేదు. అడుగడుగునా పోలీసులు వచ్చి తలుపు తడుతున్నట్లు ఫీలయ్యాను.

డిటెక్టివ్ వెంకన్న అసలు హంతకుడెవరో తనకు తెలుసునన్నట్లు మాట్లాడాడు. ఆయనకు నిజంగా ఆ హంతకుడెవరో తెలుసా? తెలిస్తే యెలా తెలిసింది?

ఆయన చాలా గొప్పవాడు. నేను హంతకుడు కాని పక్షంలో నిశ్చింతగా వుండమని చెప్పాడు. అసలుహంతకు డెవరో తెలిసిన మనిషికి నా గురించి ఆ మాత్రం అను మానం మాత్రం యెందుకుండాలి?

మర్నాడుదయం నేను నిద్ర లేచేసరికి యేడున్న రయింది.

సరిగ్గా పోలీసులు మా ఇంటికి వచ్చారు.

"యూ ఆర్ అండర్ అరెస్ట్!" అన్నాడు పోలీస్ ఇన్‌స్పెక్టర్.

ఇందుకు నేను సిద్ధపడే వున్నాను. అయినా కొద్దిగా నటించాను. "నేను చేసిన తప్పేమిటి?"

"రెండు హత్యలు చేశావ్...." అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"రెండా?" అన్నాను ఆశ్చర్యంగా.

"అవును. మా వాళ్ళు ప్రశ్నించడానికని సుబ్రమణ్యం యింటికి వెళ్ళారు నిన్న రాత్రి. తన గదిలో చచ్చి పడున్నాడతను. ఎవరో అతని మంచినీళ్ళ కూజాలో విషం కలిపారు. నిన్న అక్కడికి ఒక సమయంలో నువ్వు అతని గదికెళ్ళినట్లు ఇంటి యజమాని చెప్పాడు. అక్కడ నువ్వు వదిలిన చీటీ వుంది...." అన్నాడు ఇన్‌స్పెక్టర్.

సుబ్రమణ్యం చనిపోయాడనగానే నాకు చాలా సంతోషం కలిగింది. ఏమైతేనేం-నా జీవితాశయం నెరవేరింది. పైకిమాత్రం ఏమీ తెలియనట్లుగా-"సుబ్రమణ్యం చనిపోయాడా?" అన్నాను.

"నటించకు మిస్టర్-హత్యలు చేయడంలో నువ్వు నీ తండ్రికేమాత్రం తీసిపోవు...." అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"దయచేసి నాకు డిటెక్టివ్ వెంకన్నగారితో మాట్లాడే అవకాశమివ్వండి. ఈ హత్యకేసులో అసలు హంతకుడెవరో తనకు తెలుసునని ఆయన అన్నారు...." అన్నాను.

"అసలు హంతకుడివి నువ్వేనని ఆయన చెప్పారు. ఉదయం ఆయన పోలీస్‌స్టేషన్‌కు వచ్చారు...."అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"చేతకాని వెధవ-" అని మనసులో తిట్టుకున్నాను.

పోలీసులతో నేను స్టేషన్‌కు నడిచాను. అక్కడ వెంకన్న కనిపించాడు. ఆయన్ను చూడగానే నాకు ఆవేశం ఆగలేదు-"మిస్టర్ వెంకన్నా! ఇదేనా నీ తెలివి. ఒక అమాయకుడ్ని ఉరికంబమెక్కిస్తున్నావు!"అన్నాను.

"మిస్టర్ సూర్యం! సుబ్రమణ్యం నిన్న నాకు ఫోన్ చేసి, రాజేశ్వరి హత్య గురించి చెప్పాడు. ఆ హత్య తన కళ్ళముందే జరిగిందట. హంతకుడ్ని అతను చూశాడట కానీ హంతకుడతన్ని చూడలేదట. రాజేశ్వరిని కంటికి రెప్పలా కాచుకోవాలని రహస్యంగా వున్న అతను బయటకు రాలేకపోయాడట. హత్యజరిగిన తర్వాత హంతకుణ్ణి అనుసరించి-అతనే హంతకుడని బుజువుచేయడానికి తిరుగులేని ఆధారం సంపాదించాట్ట.

మర్నాడుదయం అతను నా దగ్గరకు వచ్చి వివరాలన్నీ

చెబుతాననీ అన్నాడు. అందుకే అసలు హంతకుడెవరో నాకు తెలుసునని అన్నాను. ఆ హంతకుడివి నువ్వే అయి వుండాలి. సుబ్రమణ్యాన్ని పసిగట్టి వుండాలి. నిజం బయటకు రాకుండా అతన్ని చంపేసివుంటావు. నా క్లయింటువైనంతమాత్రాన రక్షణ లభిస్తుందనుకున్నావు. నేనెప్పుడో చెప్పాను-నువ్వు హంతకుడివైతే నిన్ను రక్షించలేనని!" అన్నాడు వెంకన్న.

ఏదో అనబోయి ఆగిపోయాను. అవును నేను హంతకుణ్ణే! సుబ్రమణ్యాన్ని చంపిన హంతకుడ్ని. హంతకులను డిటెక్టివ్ వెంకన్న రక్షించడు. అందుకే ఆయన నన్ను పట్టిచ్చాడు!

సుబ్రమణ్యం బ్రతికుంటే ఈ హత్యకేసునుంచి నన్ను రక్షించి వుండేవాడు. అర్థంలేని పగతో, పిచ్చి ఆశయంతో నా రక్షకుణ్ణి నేనే భక్షించాను. నన్ను నేనే చంపుకున్నాను!

హిందూమతం క్షమాగుణాన్ని బోధిస్తుంది. అందులోని గొప్పతనం నాకు చాలా ఆలశ్యంగా అర్థమైంది. ఈ రోజు నేను హంతకుణ్ణయ్యాను. ఏదో ఒకరోజున ఆ కంపెనీ మేనేజర్‌కి కూడా తప్పకుండా నా గతే పడుతుంది!

ఎందుకో ఆ విషయమై నాకు నమ్మకంగా వుంది-
"వెంకన్నగారూ! నేను చెప్పిన ఆ మేనేజర్‌ని కూడా ఓ చూపు చూడండి. అంతే నేను చెప్పవలసింది-" అన్నాను.

వెంకన్న మందహాసం చేసి ఊరుకొన్నాడు.

—:ఐపోయింది:—

# ఆఖరి అస్త్రం

## వాణిశ్రీ

శ్రీధర్ హడావుడిగా వచ్చి "రాయ్!" అన్నాడు.

రాయప్ప తలెత్తిచూసి "శ్రీధర్! ఎన్నాళ్ళకు కన్పించావురా! యెలావుంది హౌస్ సర్జనీ!" అన్నాడు నవ్వుతూ.

"నా మొఖంలా వుంది." నీరసంగా ఛైర్‌లో కూలబడ్డాడు.

"ఏం అలా అంటున్నావ్?"

"పరిస్థితిలు అలా వున్నాయి." అన్నాడు శ్రీధర్.

"ఏమిటవి మీ వాళ్ళంతా స్ట్రయిక్ చేస్తున్నారా ఏం?"

"నీకెప్పుడూ స్ట్రయికులూ,ధర్నాలూను....అది కాదు పర్సనల్ వ్యవహారం బాగాలేదు. నేనొక చిక్కులో పడ్డాను. అందులోంచి బైట పడాలి."

"కొంపతీసి యెవర్నన్నా రేప్ చేశావా యేం?" అన్నాడు రాయప్ప.

"యూ! బ్రూట్!" కోపంగా చూశాడు శ్రీధర్.

"మరింకేమిట్రా నీ చిక్కు?" నవ్వాడు రాయప్ప.

"నాగరాజు రానీ చెప్తాను." అన్నాడు.

ఇంతలో నాగరాజు తలుపు నెట్టుకుని వచ్చాడు. అతనివెంట హోటల్ సర్వర్ ట్రేలో టీ కప్పులు తీసుకుని వచ్చి టీపాయ్‌మీద పెట్టి వెళ్ళిపోయాడు.

"నువ్వు జాబ్ కోసం ట్రై చెయ్యడం మానేసి ప్రైవేట్ డిటెక్టివ్‌గా ప్రాక్టీస్ మొదలుపెట్టావటగా. నాగరాజు చెప్పాడు" అన్నాడు శ్రీధర్.

"అవును. ఏం చెయ్యను? జాబ్ దొరికేటట్లు లేదు. ఇదే నయంగా వుందిరా. నెలకొక కేస్ తగిలినా చాలు. హాయిగా వుంది. నో వర్రీస్." అన్నాడు రాయప్ప.

"మనవాడు హైదరాబాద్‌లో డిటెక్టివ్ ట్రైనింగ్ చేసి వచ్చాడు." అన్నాడు నాగరాజు.

"వెరీగుడ్." అన్నాడు శ్రీధర్.

"ఇప్పుడు చెప్పు నీ చిక్కు యేమిటో?" రాయప్ప నోట్‌బుక్ తీసి ముందు పెట్టుకొన్నాడు.

"నేను సులోచన ప్రేమించుకున్నాం."

"హూ ఈజ్ సులోచన?"

"నా జూనియర్."

"ప్రొసీడ్."

"సులోచన ఫాదర్ కోటేశ్వరావు, మోడరన్ టొబాకో ఎక్స్‌పోర్టర్స్ ప్రొప్రయిటర్."

"ఆ కంపెనీ విజయవాడ రోడ్డులో వుంది కదూ!" అన్నాడు నాగరాజు.

"యస్. సులోచన ఫాదర్ మంచివాడే. కాని మదర్ —"

"సూర్యకాంతం మార్కు."

"నో అలాగా కూడా అనిపించదు. ఆవిడ పేరు రుక్మిణీ దేవి. మొదట్లో నేనంటే లైక్ చేసేది."

"కేస్ కన్ఫ్యూజన్ అయిపోతోందిరా. సులోచన, నువ్వూ ప్రేమించుకొన్నాం అంటూ రుక్మిణి నన్ను లైక్ చేసేది అంటావేమిటి?" అన్నాడు నాగరాజు.

"యూ ఫూల్. నీ జోక్స్ చాల్లేరా!" అని కసురుకున్నాడు శ్రీధర్.

"వాడిని చెప్పనివ్వరా! సీరియస్‌గా విను." అని మందలించాడు రాయప్ప.

"ఇదేదో చెత్త లౌ స్టోరీలా వుందిరా!" అన్నాడు నాగరాజు.

"ఒరేయ్ మాది పవిత్ర ప్రేమరా." అని నవ్వాడు శ్రీధర్.

"అసలు సంగతి చెప్పరా!" అని విసుక్కున్నాడు రాయప్ప.

"మొదటిసారి నన్ను తన బర్‌డేకి ఇంటికి పిలిచింది సులోచన. ఆరోజు వాళ్ళ ఫాదర్ కన్పించలేదు. ఊళ్ళో లేడని చెప్పింది. అప్పుడే చూశాను రుక్మిణీదేవిని. సులోచన నన్ను పరిచయం చేసింది వాళ్ళ మదర్‌కి. అప్పుడొక గమ్మత్తు జరిగింది."

"ఏమిటి?"

"నన్ను చూస్తే నే ఆవిడకి ఫిట్స్ వచ్చి పడిపోయింది. అంతా కంగారుపడ్డారు. ఆవిడని బెడ్‌రూంలో పడుకోబెట్టి డాక్టర్‌కి ఫోన్ చేశారు. సులోచన ఆమెకి అప్పుడప్పుడూ ఆలా వస్తూవుంటుందనీ, ఎక్కువ వుద్రేకం వచ్చినప్పుడు స్పృహతప్పి పడిపోతుందనీ చెప్పింది."

"తరచుగా ఫిట్స్ వస్తుంటాయా? అంతకు ముందు ఫిట్స్ వచ్చి యెంతకాలమైంది? మెంటల్ డిజార్డర్ ఏదైనా వుండేదా?" ప్రశ్నించాడు రాయప్ప.

"నేను అవన్నీ అడగలేదు." అన్నాడు శ్రీధర్.

రాయప్ప నోట్ చేసుకొన్నాడు.

"వూఁ. తర్వాత."

"తర్వాత నన్నొకరోజు డిన్నర్‌కి ఇన్వైట్ చేసింది సులోచన. రుక్మిణీదేవి నన్నుయెంతో ఆదరంగా చూసింది. సులోచన ఫాదర్ గోవిందరావు చాలా సరదా మనిషి. ఆరోజు హేపీగా గడిచింది. మా పెళ్ళికి సులోచన పేరెంట్స్ సుముఖంగా వున్నారని చెప్పింది.

"జనవరి 14 న సంక్రాంతి పండుగరోజు మా ఫాదర్ నేను వాళ్ళింటికి వెళ్ళాం. మా ఫాధర్‌ని చూసి రుక్మిణీ దేవికి మళ్ళీ ఫిట్స్ వచ్చాయి. విరుచుకొని పడిపోయింది. మళ్ళీ డాక్టర్ వచ్చి ట్రీట్‌మెంట్ ఇచ్చి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత వారం రోజులకు సులోచన చాలా విచారంగా కనిపించింది. ప్రాక్టికల్స్‌లో పరధ్యానంగా గడిపింది. ఆమెను, పలకరిస్తే యేడుపు ముంచుకొచ్చింది. కారణం అడిగితే మన పెళ్ళికి మా మదర్ ఒప్పుకోవడం లేదు అంది సులోచన. ఎందుకో తెలియదు. స్టేటస్ విషయం చూసుకుంటే వాళ్ళకంటే మేమే పై మెట్టులో వున్నాం."

"అయితే రుక్మిణీదేవి మీ పెళ్ళికి ఒప్పుకోవడం లేదు. కారణం తెలియదు. మిమ్మల్ని సస్పెన్స్‌లో వుంచింది. మరి గోవిందరావు ఏమంటాడు?" అన్నాడు రాయప్ప.

"పాపం అతనిది ఏముంది? భోళా శంకరుడు. నేనంటే

లైక్ చేస్తున్నాడు. భార్య యెందుకు అడ్డం తిరిగిందో అతనికే అర్థంకావడంలేదు. అదే సంగతి నాతో అన్నాడు."

"నో. గోవిందరావు నీకు అబద్ధం చెప్పాడు." అన్నాడు రాయప్ప.

నివ్వెరపోయాడు శ్రీధర్.

"ఎలా అనుమానిస్తున్నావ్?"

నవ్వాడు రాయప్ప.

"సింపుల్. ఒకసారి ఒప్పుకున్న సంబంధం విషయంలో భేదాభిప్రాయం వచ్చినప్పుడు భార్య భర్తకు చెప్పకుండా ఎలా వుంటుంది? రుక్మిణీదేవికి, గోవిందరావుకిగాని, గోవిందరావు రుక్మిణీదేవికిగాని యేదో ఒక విషయంలో విభేదించివుంటారు. అయితే అదంతా ఆడవాళ్ళ వ్యవహారంగా కొట్టిపారేసి తన మగతనం నిలబెట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు గోవిందరావు. అంతేగాని అసలు సంగతి అతనికి తెలియదంటే నమ్మలేను." అన్నాడు రాయప్ప.

"ఆయన ప్రవర్తన అలాలేదు. రహస్యంగా దాచుకునే మనిషి కాదని నా వుద్దేశ్యం." అన్నాడు శ్రీధర్.

"వెల్. అలాగే అనుకుంటే మొదట్లో అంగీకరించిన సంబంధం వద్దని భార్య అంటే కారణం తెలుసుకోకుండా వంత పాడతాడా ఏ భర్తయినా! పోనీ అలాగే అనుకొంటే హి ఈజ్ యే హెన్‌పెక్‌డ్ హజ్బెండ్." నవ్వాడు రాయప్ప.

"అయితే కారణమేమిటో తెలిసి దాచుకోవలసిన అవసరం యేమిటి?"

"అదే మిష్టరీ."

"వూ(....కానివ్వు. ఇంట్రెస్టింగ్ గా వుంది కేసు." అన్నాడు నాగరాజు.

"నేను సులోచనని వదులుకోదల్చుకోలేదు" అన్నాడు శ్రీధర్.

"అయితే గొడవ దేనికి? ఇద్దరూ కలిసి సీక్రెట్ గా ఏ గుళ్ళోనో పెళ్ళిచేసుకొని, ఆ తర్వాత పెద్దవాళ్ళ కాళ్ళ మీద పడిపోతే పోలా?" అన్నాడు నాగరాజు.

"ఏం కర్మం? గ్రాండ్ గా చేసుకోవలసిన పెళ్ళి దొంగతనంగా రహస్యంగా చేసుకోవలసిన అవసరం యేమిటి? మా డాడీ ఒప్పుకోరు. అసలు నాకే అలా చెయ్యడం ఇష్టంలేదు. అందర్నీ అంగీకరింపజేసి మారేజ్ చేసుకోవాలని నా ఐడియా!"

"ఆవిడ ఒప్పుకోకపోవడానికి కారణం యేమిటి?"

"రుక్మిణీదేవిని రెండుమూడుసార్లు యింటికివెళ్ళి కలుసుకొన్నాను. మొదటిసారి వెళ్ళినప్పుడు మాట్లాడింది."

"ఏం చెప్పింది. కారణం అడిగావా?"

"ఆ(. కుంటిసాకు చెప్పింది."

"ఏమిటది?"

"వాళ్ళ అబ్బాయి అమెరికాలో సెటిలయ్యాడు. సులోచన ఒక్కతే కూతురు. గోవిందరావు తర్వాత బిజినెస్ యెవరు చూస్తారు? అందుకే అల్లుడు ఇల్లరికం వుండి బిజినెస్ చూసుకొనే అల్లుడు కావాలట. నువ్వేం బిజినెస్ చేస్తావు? నువ్వు డాక్టర్ వి కదా! అంది. కాని నాకా కారణం సమంజసంగా కన్పించలేదు. వాళ్ళకి అటువంటి ఆలోచన మొదట్నుంచీ లేదా? వున్నప్పుడు డాక్టర్ తో పెళ్ళికి యెందుకు ఒప్పుకున్నారు? తర్వాత యెందుకు ఒప్పుకోవడంలేదు."

"ఏదో బలమైన కారణం వుందని నాకు తోస్తోంది." అన్నాడు రాయప్ప.

"ఈ స్టేజిలో వాళ్ళ ఆటలు సాగనివ్వగూడదని సులోచన, నేనూ కూడబలుక్కున్నాం."

"నేనేం చెయ్యాలో చెప్పు." అన్నాడు రాయప్ప.

"వారంరోజుల క్రితం నేను హాస్పిటల్ నుంచి వస్తుంటే యెవరో బులెట్ మీద నన్ను వెంబడించారు. తాళం తీసి రూమ్‌లోకి వెళ్ళానో లేదో హఠాత్తుగా నా మీద పడ్డారు. అయితే అతని చేతిలో కత్తి లేదు. చేతులతో గొంతుక పిసకడానికి ప్రయత్నించాడు. నేను ప్రతిఘటించి వాడిని తరిమేశాను." అన్నాడు శ్రీధర్.

రాయప్ప విస్మయంతో చూశాడు.

"చివరకు రుక్మిణీదేవి నిన్ను హత్య చేయించాలని చూస్తోందన్నమాట."

"ఆవిడ అని నిర్ధారించడానికి వీల్లేదు." అన్నాడు శ్రీధర్.

"ఏం?"

"అనుమానించాల్సివస్తే జగన్‌నిగూడ అనుమానించాలి." అన్నాడు శ్రీధర్.

"వాడెవడు?" ప్రశ్నించాడు రాయప్ప.

"వాడొక రౌడీ వెధవ."

"వాడితో పేచీ పడ్డావా?"

"యస్. నా రూమ్‌వున్న వీధిలో చివర ఒక పూరిల్లు వుంది. అందులో విజయ అనే అమ్మాయి వుంది. ఫాదర్ లేడు ఆమెకు. వాళ్ళ అమ్మ ఇళ్ళల్లో పనులు చేసి కుటుంబాన్ని పోషిస్తుంది. ఆమెకు విజయ కాక చిన్న కొడుకు వున్నాడు. విజయ ఇంటర్ ప్యాసై పైపు చేర్చుకుం

టోంది. ఆమె తమ్ముడు సెవస్తు చదువుతున్నాడు."

"అబ్బ ఆ హిస్టరీ అంతా ఎందుకురా బాబూ! అసలు సంగతి చెప్పు." విసుగ్గా అన్నాడు నాగరాజు.

"అంత విసుగైతే యెలారా? డిటెక్టివ్‌కి యెంతో ఓపిక వుండాలి. వివరాలన్నీ తెలుసుకోవాలి," నవ్వాడు శ్రీధర్.

"వాడి మాటలకేం లే. నువ్వు కానివ్వు," అన్నాడు రాయప్ప.

"ఎలాగైనా చిన్న వుద్యోగం సంపాదించి గౌరవంగా బ్రతకాలని విజయ వుద్దేశ్యం. ఆ జగన్‌గాడు వాళ్ళకి యేదో దూరపు చుట్టం. విజయని పెళ్ళి చేసుకోవాలని వాడి తాపత్రయం.

విజయ తను టైప్ నేర్చుకుంటున్న ఇనిస్ట్యూట్ ప్రిన్సిపాల్‌తో లా ఎఫైర్ పెట్టుకొంది. అతను ఆమెకోసం ఇంటికి గూడా వచ్చిపోతూ వుండేవాడు. ఆ సంగతి జగన్‌గాడు కనిపెట్టి అతను ఇంట్లోవుండగా వచ్చి గొడవ చేశాడు. విజయ వ్యభిచారం చేస్తున్నదనీ, వాళ్ళతో వీళ్ళతో చూశాననీ ప్రేలుతున్నాడు. అతను వీడితో ఘర్షణ పడుతున్నాడు.

నేను అప్పుడే రూమ్‌కి వస్తున్నాను. జగన్‌గాడు తొందరపడి అతన్ని శొక్కల్లో గుద్ది కింద పడేశాడు. విజయ యేడుస్తున్నది. కాని యెవరూ జోక్యం కలిగించుకోకపోవడం నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది.

అతను పాపం అర్భకుడు. ఇటువంటి గొడవల్లో ఇరుక్కున్నవాడు కాదనుకొంటాను. తను విజయ ప్రేమించుకొంటున్నామనీ, పెళ్లి చేసుకోబోతున్నామనీ, చెప్తున్నాడు. కాని జగన్‌గాడు అతన్ని డామినేట్ చేసి

పెద్దగా అరుస్తున్నాడు.

వాడి వ్యవహారం చూసి నాకు వళ్ళు మండిపోయింది. ఏమైతే అది అయిందని వెళ్లి జోక్యం కలిగించుకొన్నాను. అసలు నువ్వెవడివి. నీకేం సంబంధం? అని పాయింట్ లేవదీశాను. వాళ్ళిష్టం ప్రేమించుకున్నారు, పెళ్లి చేసుకొంటారు అన్నాను. వాడు అదంతా నిజం కాదన్నాడు. విజయ వ్యభిచారం చేస్తున్నదని గట్టిగా చెప్పాడు. అయినా సరే అది ఆమె యిష్టం కాదనడానికి నువ్వు యెవడివి అని అడ్డంగా వాదించాను. వాడు యేం చెయ్యాలో తోచక అసలు మధ్యలో నీకేం సంబంధం అని యెదురుతిరిగాడు.

ఘర్షణ పెరిగిపోయింది. నామీద చెయ్యి చేసుకొన్నాడు. అంతే. వాడిని పచ్చడి చేసేశాను. నా ధైర్యానికి అందరూ మెచ్చుకొన్నారు. కాని వాడు మాత్రం పోతూ పోతూ నా అంతం చూస్తానని ప్రతిజ్ఞ చేసి పోయాడు." అన్నాడు శ్రీధర్.

రాయప్ప ఆలోచిస్తూ కూర్చున్నాడు.

"అయితే నిన్ను చంపడానికి ప్రయత్నించేవాడిని కనుక్కోవాలి అంతేనా?" అన్నాడు నాగరాజు.

"ఆ రోజే వాడిని పట్టుకొంటే తెలిసిపోయేది. కాని వాడు తప్పించుకొని పారిపోయాడు." అన్నాడు శ్రీధర్.

"ఎక్కడికిపోతాడు? దొరక్కుండా పోతాడా?" అన్నాడు నాగరాజు.

"అంతేకాదు. రుక్మిణీదేవి మా పెళ్ళికి యెందుకు ఒప్పుకోవడంలేదు? అనేది తెలుసుకోవాలి." అన్నాడు శ్రీధర్.

"ఓ. కె. ముందు ఒక పని చెయ్యి." అన్నాడు

రాయప్ప.

ఏమిటన్నట్లు చూశాడు శ్రీధర్.

"సాయంకాలం నాలుగ్గంటలకు రా. ఇద్దరం కలిసి ఎస్. ఐ. చంద్రం దగ్గరికి వెళ్దాం."

"ఎందుకు?"

"రిపోర్టు ఇవ్వడానికి."

"ఎవరిమీద?"

"గోవిందరావు మీద."

"ఎందుకూ?"

"చెప్తానుగదా! నన్ను చంపించడానికి ట్రై చేస్తున్నాడు. కారణం ఇది అని ఇన్‌రైటింగ్ రిపోర్టు ఇద్దాం. అది తీసికెళ్ళి గోవిందరావుకి చూపిస్తాడు. సులోచన ఇంట్లో యేం జరిగిందీ విని మనకి చెప్పాలి. దట్సాల్." అన్నాడు రాయప్ప.

"ఓ. కె. బై షోర్ ఐ విల్ మీట్ యూ!" అన్నాడు శ్రీధర్ వెళ్ళిపోవడానికి లేస్తూ.

## 2

"అయ్యగారు పిలుస్తున్నారు" అన్నాడు నౌకరు.

ఎస్. ఐ. వెంకటేశ్వర్లు, రాయప్ప లోనికి వెళ్లారు.

"ప్లీజ్ బీ సీటెడ్." అన్నాడు గోవిందరావు.

రాయప్ప అతన్ని పరిశీలనగా చూశాడు.

ఎర్రగా లావుగా వున్నాడు గోవిందరావు. బట్టతల తళతళ మెరుస్తోంది. గోల్డు ఫ్రేమ్ కళ్ళద్దాలు పెట్టుకొన్నాడు. బ్రౌన్ కలర్ కోటు, చారల టై. వయస్సు ఏభై వరకూ వుండొచ్చు.

ఎస్. ఐ. కి తనతో యేం పని పడిందా? అని ఆలోచిస్తున్న వాడిలా చూశాడు గోవిందరావు.

నౌకరు ట్రేలో కాఫీ కప్పులు తెచ్చి నిల్చున్నాడు.

"ప్లీజ్ టేక్ కాఫీ." అన్నాడు గోవిందరావు.

ముగ్గురూ కాఫీ సిప్ చేస్తున్నారు.

విషయం ఎలా బైట పెట్టాలా అని ఆలోచిస్తున్నాడు ఎస్. ఐ.

శ్రీధర్ రిపోర్టు ఫైలోంచి తీసి గోవిందరావుకి అందించాడు యెస్. ఐ.

అంతా చదివి ఆశ్చర్యపడినట్లు కన్పించాడు అతను.

"మీరిలా చెయ్యడం యేం బాగాలేదు." అన్నాడు ఎస్. ఐ.

"రియల్లీ ఐ వండర్ ...."

"మీకేం తెలియదని చెప్పబోతున్నారు. యామ్ ఐ కరెక్టు." అన్నాడు యెస్. ఐ.

"మీరు నమ్మకపోయినా నిజం అదే. అతన్ని హత్య చేయించాల్సిన ద్వేషం యేం లేదు నాకు,"

"ద్వేషం లేకపోవచ్చు. కాని ప్రయత్నం చేస్తున్నారు గదా! అతను బ్రతికివుంటే మీ అమ్మాయి మనసు మార్చుకోదని గ్రహించి, అతని అడ్డు తొలగించుకోవడానికి చూస్తున్నారు."

"ఐయామ్ సారీ. మీరు ఆధారం లేకుండా మాట్లాడుతున్నారు." అన్నాడు గోవిందరావు, ఎస్. ఐ. ఆరోపణకు అభ్యంతరం తెలియజేస్తూ.

"ఆధారం లేదని మీరనుకొంటున్నారు. అతను మాకు రిపోర్టు చేశాడు. అతనికి యేమైనా జరిగితే బాధ్యత మీదే."

గోవిందరావు వులిక్కిపడ్డాడు.

"మీరు మమ్మల్ని అనుమానించడం సబబుగానే

వుంది. ఎందుకంటే శ్రీధర్ రిపోర్టు చేశాడు గనుక. కాని అతను ఇంత తెలివితక్కువ వాడనుకోలేను.”

“ఇష్టం లేదన్నా వెంటబడుతున్నాడనా?” ప్రశ్నించాడు రాయప్ప.

“ఇష్టం లేకపోవడానికి కారణం వుంది. బహుశ అతను మీకు చెప్పివుంటాడు. మాకు ఒక్కడే కొడుకు. అమెరికాలో స్థిరపడిపోయాడు. సులోచన ఆడపిల్ల. నా తర్వాత బిజినెస్ చూసుకోవడానికి అల్లుడు ఇల్లరికం వుండాలి. అది నా షరతు. శ్రీధర్ డాక్టర్. అతన్ని బిజినెస్ చూసుకోమనడం న్యాయంగా వుండదు. అందుకని ఈ సంబంధం వద్దనుకున్నాం.”

“ఆ సంగతి ముందు మీరు అనుకోలేదా? కొన్నాళ్ళు ప్రేమించుకోనిచ్చారు. పెళ్ళి చెయ్యడానికి ఒప్పుకున్నారు. ఏదో ఒక కారణంవల్ల కుదరదని అనుకొని ప్రేమికులను విడిపొమ్మంటున్నారు. మీకు యిది న్యాయంగా వుందా?” అన్నాడు రాయప్ప.

“ఎన్నో అనుకుంటుంటాం. అన్నీ జరుగుతాయా?” నవ్వాడు గోవిందరావు.

“జరగవనుకోండి. కొందరు పట్టుదలతో సాధిస్తారు. శ్రీధర్ అటువంటివాడే. మొండి వైఖరి అతనిది. మీరు ముందే అభ్యంతరం పెట్టివుంటే బాగుండేదేమో! వాళ్ళకి ఆశలు కల్పించి విడిపొమ్మని చెప్పడంవల్ల హర్ట్ అయ్యాడు. ఎవరు చెప్పినా, ఎంత మొత్తుకున్నా వినే పరిస్థితిలో లేడు. కాబట్టి మీరు సహృదయంతో ఆలోచించి మీ నిర్ణయం మార్చుకోండి. అంతేగాని చంపుతామని, బెదిరించి, భయపెట్టి లాభం లేదు,” అన్నాడు రాయప్ప.

“నాకు అదే అర్థం కావడంలేదు మిస్టర్. అతనిమీద

నాకేమీ కోపం లేదు. కొన్ని కారణాలవల్ల దూరం చేసుకోవలసివచ్చింది. ఐ యామ్ సారీ ఫర్ దట్. అంతే కాని, అతన్ని బెదిరించడానికి నేనేమీ ప్రయత్నం చెయ్యలేదు," అన్నాడు గోవిందరావు.

"షానీ మీ నాలెడ్జి లేకుండా ఇంకెవరైనా అలా చెయ్యడానికి అవకాశం వుందా?" ప్రశ్నించాడు ఎస్.ఐ.

"ఇంకేవరు చేస్తారు?" యెదురుప్రశ్న వేశాడు.

"మీ మిసెస్."

"నో...." అన్నాడు గోవిందరావు.

"అంత గ్యారంటీగా యెలా చెప్పగలరు?"

"నాకు తెలుసు. ఆమె అటువంటిది కాదు."

"ఏమో మీరు తెలుసుకోండి ఫోన్ చేసి." అన్నాడు యెస్. ఐ.

గోవిందరావు ముఖం యెర్రబడింది.

"అవసరం లేదు. నాకు తెలుసు" గట్టిగా అన్నాడు.

"మీరు అనవసరంగా ఫీలవుతున్నారు. ఫోన్ చేసి అడిగితే తెలిసిపోతుంది గదా!"

"నో ఇన్‌స్పెక్టర్. ఐ కాంట్. బిలీవ్ మీ! షి వోంట్ డూ సచ్ రబ్బిష్ థింగ్స్," ఆవేశంతో అన్నాడు.

"అయితే మీ భార్య గురించి మీకేమీ తెలియదన్న మాట," నవ్వాడు యెస్. ఐ.

దెబ్బతిన్నవాడిలా చివ్వున తలెత్తి చూశాడు గోవిందరావు.

"నో ఐయామ్ గోయింగ్ టూ ప్రూవ్ ది థింగ్," అని రాయప్ప వైపు చూసి "ప్లీజ్" అన్నాడు యెస్.ఐ.

రాయప్ప గదిలో నుంచి బైటికి వెళ్ళి కాసేపటి

తర్వాత తిరిగి వచ్చాడు. అతని వెంట ఒక కుర్రాడు వున్నాడు.

గోవిందరావు అతనివంక యెగాదిగా చూశాడు.

ఎత్తుగా, లావుగా, ఎర్రబనీను, నీలంరంగు ప్యాంట్‌తో మీసాలు వొత్తుగా, కొంచెం గడ్డం పెరిగి, మొత్తానికి రౌడీలా వున్నాడు.

"ఎవరు నువ్వు?" ప్రశ్నించాడు గోవిందరావు.

"కె. డీని," వికృతంగా నవ్వాడు అతను.

"అసలు సంగతి చెప్పు," గద్దించాడు యెస్. ఐ.

"ఒకరోజు అమ్మగారు నన్ను పిలిపించారు సార్. శ్రీధర్ అనే అతను మెడికల్ కాలేజీలో చదువుతూ వుంటాడని ఫోటో చూపించారు. అతన్ని యెలాగైనా చంపమని అన్నారు. ముందు వెయ్యి రూపాయలు ఇచ్చారు. ఎవరికీ తెలియకుండా పని పూర్తిచేస్తే ఇంకో నాలుగువేలు ఇస్తామన్నారు."

అతను చెప్తున్నదంతా వింటూనే గోవిందరావు ముఖం వెలవెలా పోయింది. కత్తివేటుకు రక్తపు చుక్క లేనట్లుగా తెల్లగా పాలిపోయాడు. అవమానంతో ముఖం వాల్చుకున్నాడు.

"సారీ ఇన్‌స్పెక్టర్. ఐయామ్ వెరీసారీ!" అన్నాడు వణుకుతున్న కంఠంతో.

"దట్సాల్ రైట్ గోవిందరావుగారూ! ఇప్పటికైనా తెలిసిందిగదా! ప్లీజ్ సీ దిస్ సార్ట్ ఆఫ్ థింగ్స్‌డోంట్ రిపీట్ ఇన్ ఫ్యూచర్!" వార్నింగ్ ఇస్తున్న వాడిలా అన్నాడు.

గోవిందరావుకి నోటివెంట మాటలు రావడం లేదు. గొంతులో తడి ఆరిపోయింది.

వాళ్ళు ముగ్గురూ రూమ్‌లోంచి నిష్క్రమించగానే గ్లాసులోని మంచినీళ్ళు గడగడా త్రాగేశాడు.

## 3

రుక్మిణీదేవి భర్తను వింతగా చూసింది.

"ఏమిటి మీరనేది?"

"ఏవుంది? నన్నొక అసమర్థుడిగా తీసిపారేసి తెలివితేటలు వుపయోగిస్తున్నావుగా?"

"నేనా? ఏం చేశాను?" ఆశ్చర్యంతో అడిగింది.

"ఎంత అమాయకంగా అడుగుతున్నావ్? ఆహాఁ...." అన్నాడు.

"ఏమిటో సూటిగా చెప్పండి?" చిరాగ్గా అంది.

"శ్రీధర్‌ని చంపమని యెవడికో డబ్బు ఇచ్చి పంపావా?" కఠినంగా వుంది అతని గొంతు.

ఉలిక్కిపడింది రుక్మిణీదేవి.

ఆమె కళ్ళల్లో భయం తొంగి చూసింది.

"నేనా?" అంటూ ఆమె కూర్చున్నదల్లా లేచి నిల్చుంది.

"ఆఁ. నువ్వే."

"నేనా! అతన్ని చంపమని మనిషిని పంపానా? నో. నో....!" గట్టిగా అంది.

"ష్! ఎందుగా అరుపులు, పెడబొబ్బలు. ఎవరైనా వింటారు."

"లేదండీ మీకెవరో లేనిపోనివి చెప్పారు. లేకపోతే నేనేమిటీ అతన్ని చంపమని యెవరికో డబ్బు యివ్వడం యేమిటి? మీరు యెలా నమ్మారు?" ఆందోళనగా అంది రుక్మిణీదేవి.

"నమ్మక యేం చెయ్యాలి? యెస్. ఐ. కి రిపోర్టు

చేశాడు శ్రీధర్. తనని యెవరో చంపడానికి ప్రయత్నిస్తున్నారని. పోలీసులు ఆ రౌడీ వెధవని పట్టుకొని నా ముందు పెట్టారు. నా ఎదుటే చెప్పాడు వాడు అమ్మగారు ఆతన్ని చంపమని వెయ్యి రూపాయలు ఇచ్చారనీ, పని చేసిన తర్వాత ఇంకా నాలుగువేలు ఇస్తానన్నారనీ...."

"నో....నో...." గట్టిగా అరిచి పడిపోయింది రుక్మిణీదేవి.

ఆమెకు మళ్ళీ ఫిట్స్ వచ్చాయి.

గోవిందరావుకి మత్తు వదిలిపోయినట్లయింది.

లేచి కూర్చుని డాక్టర్‌కి ఫోన్ చేశాడు.

తల్లి కేక విని పరిగెత్తుకొని వచ్చింది సులోచన. అప్పటివరకూ ఆమె ఇద్దరిమధ్యా సంభాషణ వింటూ నిల్చుంది.

డాక్టర్ వచ్చివెళ్ళిన అరగంట తర్వాత కళ్ళు తెరచి చూసింది రుక్మిణీదేవి.

అప్పటివరకూ అటూ ఇటూ పచార్లు చేస్తున్న గోవిందరావు ఆమె కళ్ళు తెరవడం చూసి గ్లాసులో మంచినీళ్ళు త్రాగించాడు.

"బ్రాండీ త్రాగుతావా?"

ఆమె వద్దన్నట్లు తల వూపింది.

"శ్రీధర్ మీద నాకు కోపం లేదండీ. అతన్ని చంపమని నేనెవర్నీ పురమాయించలేదు. మీకు తెలియకుండా అటువంటి పని చేస్తానా నేను?" ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

గోవిందరావు క్షణంసేపు జాలిగా చూశాడు ఆమె వైపు.

'కాని అతను తనకి చెప్పిందంతా అబద్ధమా?' ఆలో చనలతో బుర్ర తిరిగిపోయింది.

రుక్మిణీదేవి మన స్తత్వం అతనికి పూర్తిగా తెలుసు. తను పట్టిన పందేటికి మూడే కాళ్ళనే రకం. అంతా తండ్రి పోలిక.

అతనికి గతమంతా జ్ఞాపకం వచ్చింది.

అహోబలరావుకి ఏకైక సంతానం రుక్మిణీదేవి. తను వాళ్ళ బిజినెస్‌లో ఎక్కౌంటెంట్‌గా జేరాడు. అహో బలరావుకి ఒక కొడుకు వున్నాడనీ అతను కాస్ట్ ఎకౌంట్స్ చదువుతూ ఒక హరిజన యువతిని పెళ్ళి చేసుకొన్నా డనీ, తర్వాత తండ్రి అతని ముఖం చూడ్డానికి ఇష్టపడ లేదనీ, చనిపోయినప్పుడు గూడా తనకి కర్మ చేయవద్దని ఆదేశించడం....అదంతా గుర్తుకొచ్చింది.

గోవిందరావు అతన్ని యెప్పుడూ చూళ్ళేదు. కనీసం కొడుకు ఫోటో గూడా యింట్లో లేకుండా చేశాడు అహోబలరావు. క్రొత్తలో రుక్మిణీదేవిగూడ అన్నని సాధిస్తూనే వుండేది. కొడుకు దూరమయ్యాడనే దిగులు ఆయన్ని క్రుంగదీస్తూ వుండేది. గోవిందరావు ఎఫిషియన్సీ ఆయన్ని ఆకర్షించింది. తన తర్వాత సమర్ధవంతంగా బిజి నెస్ చెయ్యగల సమర్ధుడనీ, దక్షుడనీ గ్రహించి కూతుర్ని యిచ్చి పెళ్ళిచేశాడు.

అహోబలరావు చనిపోయినప్పుడు గూడ కొడుకుని పిలవొద్దని చెప్పిపోయాడు. అతను ఢిల్లీలో యెక్కడో వుంటున్నాడు.

'తండ్రి పట్టుదలే కూతుర్లోనూ వుంది' అనుకొని దీర్ఘంగా నిట్టూర్చాడు గోవిందరావు.

"నన్ను నమ్మండీ ప్లీజ్!" అంటోంది రుక్మిణీదేవి.

"పోనీలే రుక్మిణీ! యేదో జరిగిపోయిందిలే!" అన్నాడు అనునయంగా.

"మన పిల్లలకు అంతా మేనమామ పోలికలే వచ్చినట్లున్నాయి కదండీ!" అంది.

మేనమామ కులాంతర వివాహం చేసుకోవడం, తన కొడుకు కూడా అదేవిధంగా అమెరికన్ అమ్మాయిని పెళ్ళి చేసుకొని ఇంటిముఖం చూడకపోగా తమనే అమెరికా వచ్చెయ్యమని లెటర్స్ రాయడం గుర్తొచ్చింది గోవిందరావుకి.

"కాని....శ్రీధర్....!" అంటూ ఆమె ముఖంలోకి చూసి ఆగిపోయాడు గోవిందరావు.

# 4

హోటల్ దుర్గాలో కౌంటర్‌లో వున్న ఫోన్ గణ గణ మ్రోగింది.

రిసీవర్ యెత్తి "హలో....హలో హోటల్ దుర్గా!" అన్నాడు నాగరాజు.

"ఐ వాంట్ మిష్టర్ రాయప్ప, ప్రైవేట్ డిటెక్టివ్!" సన్నగా వుంది గొంతు. ఎవరో అమ్మాయే సందేహం లేదు అనుకున్నాడు.

"హూ ఈజ్ స్పీకింగ్ ప్లీజ్!"

"సులోచన."

"జస్ట్ యె మినిట్," అని రూమ్ నెంబరు వన్‌కి కనెక్షన్ ఇచ్చాడు నాగరాజు.

వాళ్ళు సంభాషించుకోవడం పూర్తయిన తర్వాత కౌంటర్‌లో తమ్ముడిని కూర్చోబెట్టి రూమ్ నెంబర్ వన్ కి హడావుడిగా వెళ్ళాడు నాగరాజు.

"సులోచన ఫోన్ చేసింది. శ్రీధర్...."

రాయప్ప మాటలకు అడ్డువస్తూ "అంతా విన్నాను," అన్నాడు.

"ఈ విషయం శ్రీధర్‌కు తెలియనివ్వకు. జాగ్రత్త. సులోచన అందుకే నాకు డైరెక్టుగా ఫోన్ చేసింది," అన్నాడు.

"నా వాట్టూ దూ?" ప్రశ్నించాడు నాగరాజు.

"మేము ఆడిన నాటకం రుక్మిణీదేవి, గోవిందరావుల పై బాగా పని చేసింది. అసలు శ్రీధర్‌ని చంపడానికి ప్రయత్నించింది జగన్ తాలూకు మనిషేనని యెస్. ఐ. నిర్ధారించి చెప్పేశాడు. జగన్ గూడ ఈ సంగతి పోలీసుల దృష్టిలోకి పోయింది గనుకనూ, యెస్. ఐ. వార్నింగ్ ఇవ్వడంవల్లనూ మళ్ళీ శ్రీధర్ జోలికి వెళ్తాడని నే ననుకోను."

"వాడి మొఖం! ఇక జన్మలో శ్రీధర్ జోలికిపోడు," అన్నాడు నాగరాజు.

"పోతే ఈ విషయం శ్రీధర్ ఫాదర్‌నే నేరుగా కలుద్దామని ఆలోచిస్తున్నాను. ఇది యెప్పటిదో పాత సంగతి. అసలు మనిషినే ఆరా తీసే సరిపోతుంది. ఊహాగానం చెయ్యడానికి వీల్లేదు. అప్పటివరకూ నేను ఎక్కడ వుందీ శ్రీధర్‌కి తెలియకుండా వుంచు," అన్నాడు రాయప్ప.

"సరే! ఈ రాత్రికే వెళ్ళు," అన్నాడు నాగరాజు.

# 5

కాకినాడ గాంధీనగరంలో వుంది శ్రీధర్ వాళ్ళ బిల్డింగ్.

విశాలమైన ఆవరణలో రెండంతసుల మేడ.

ఇనుప గేటు ముందు. గూర్ఖా బీడీ కాలుస్తూ స్టూలుమీద

కూర్చున్నాడు.

డిటెక్టివ్ రాయప్ప తన విజిటింగ్ కార్డు ఇచ్చాడు.

గూర్ఖా చిన్న గేటు తీసి అతన్ని లోనికి రానిచ్చాడు.

లోపలికి వెళ్ళి సింహద్వారం వద్ద నిల్చున్న జవానుకి చెప్పి, విజిటింగ్ కార్డు యిచ్చాడు.

కాసేపటికి రమ్మని పిలుపు వచ్చింది.

విశాలమైన హాల్లో సోఫాలో కూర్చుని వున్నాడు జగపతిరావు.

"గుడ్ మార్నింగ్!" అన్నాడు రాయప్ప విష్ చేస్తూ.

"గుడ్ మార్నింగ్! ప్లీజ్ టేక్ యువర్ సీట్ మిష్టర్ రాయప్ప," అన్నాడు జగపతిరావు నవ్వుతూ.

"మీతో కొంచెం మాట్లాడాలి."

"నాకు తెలుసు. ఈ మధ్య సముద్రంలో కొట్టుకొచ్చిన స్త్రీ శవం గురించి ఎంక్వయిరీ చేస్తున్నారు గదూ!" అన్నాడు.

"నో సర్. నేను గుంటూరునుంచి వస్తున్నాను."

జగపతి కొంచెం ఆశ్చర్యపోయినట్లు కన్పించాడు.

"గుంటూరునుంచా?"

"అవును."

"ఏం కావాలి మీకు?"

"నేను శ్రీధర్ ఫ్రెండ్ ని," అన్నాడు రాయప్ప.

"ఐ. సీ. మీ విజిటింగ్ కార్డు చూసి యే హత్య కేసో యెంక్వయిరీ చెయ్యడానికి వచ్చిన డిటెక్టివ్ అనుకొంటున్నాను."

"హత్యకేసు కాదుగాని. మొత్తానికి ఒక కేసు

యెంక్వయిరీ చేస్తున్నాను. మీ సహకారం కావాలి,” నవ్వాడు రాయప్ప.

“ఓ. యస్. అడగండి,” అన్నాడు జగపతి.

ఇంతలో జవాను కాఫీ తెచ్చి టీపాయ్‌మీద పెట్టాడు.

“తీసుకోండి,” అన్నాడు జగపతిరావు.

రాయప్ప కాఫీ సిప్ చేస్తున్నాడు.

“వేరీజ్ యువర్ లగేజ్?” ప్రశ్నించాడు జగపతి రావు.

“హోటల్లో రూమ్ తీసుకున్నాను సార్!”

“శ్రీధర్ ఫ్రెండ్‌వి. శ్రీధర్ ఇంటికి వస్తూ హోటల్లో రూమ్ తీసుకున్నావా?” నొచ్చుకుంటూ అన్నాడు.

“నేను యిక్కడికి వస్తున్నట్లు శ్రీధర్‌కి తెలియదు,” జగపతిరావు ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేశాడు.

“శ్రీధర్ మీ స్వంత కొడుకు కాదు గదా!” నెమ్మదిగా అన్నాడు రాయప్ప.

తనముందు ఆటంబాంబు ప్రేలినట్లు ఉలిక్కిపడ్డాడు జగపతిరావు. మనిషి షేక్ అయ్యాడు.

“ప్లీజ్! నిజం చెప్పండి,” ప్రాధేయపూర్వకంగా అడిగాడు రాయప్ప.

“ఎందుకు ఆ విషయం మీకు?”

“శ్రీధర్, కోటేశ్వరరావుగారి అమ్మాయిని ప్రేమించడం, పెళ్ళి చేసుకోవాలనుకోవడం మీకు తెలుసు గదా!”

అవునన్నట్లు తల వూపాడు జగపతిరావు.

“మొదట్లో పెళ్ళికి అంగీకరించి తర్వాత కాదంటున్నారు కోటేశ్వరరావు దంపతులు. కారణం యేమిటో తెలియక

శ్రీధర్ బాధపడుతున్నాడు. అదంతా తెలుసుకునే భారం నామీద పెట్టాడు. బహుశా మీకు గుర్తుండి వుంటుంది మిమ్మల్ని చూడగానే రుక్మిణీదేవి ఫిట్స్ వచ్చి పడిపోయింది. అదేవిధంగా మొదటిసారి శ్రీధర్‌ని చూసి గూడా! అలా జరగడంలో యేదో నిగూఢమైన రహస్యం వుందనిపిస్తోంది నాకు."

జగపతిరావు మౌనంగా ఆలోచిస్తున్నాడు.

"శ్రీధర్‌కి వాళ్ళమ్మాయిని ఇవ్వకపోవడానికి ఏదో కుంటిసాకు కారణంగా చూపుతున్నారు వాళ్ళు. కాని అసలు కారణం యేదో మీకు తెలిసి వుండాలి. బహుశా అది శ్రీధర్ మీ స్వంత కొడుకు కాదని తెలుసుకొన్నందు వల్లనేమో?"

"దాదాపు ఇరవై సంవత్సరాలు ఈ రహస్యం గుండెల్లో దాచుకొన్నాను. శ్రీధర్‌కి సైతం తెలియదు. నా బంధువులకిగూడా చెప్పలేదు. నిజమే శ్రీధర్ నా స్వంతకొడుకు కాదు. స్టిల్ ఐయామ్ యే బాచులర్," నవ్వాడు జగపతిరావు.

"శ్రీధర్ మీ స్వంతకొడుకు కాకపోతే మటుకు ఆమెకు అభ్యంతరం యెందుకో నాకు అర్థం కావడంలేదు," అన్నాడు రాయప్ప.

జగపతిరావు విల్స్‌ఫిల్టర్ సిగరెట్ తీసి వెలిగిస్తూ రాయప్పకి ఆఫర్ చేశాడు.

"నో థాంక్స్!" అన్నాడు రాయప్ప.

జగపతిరావు సిగిరెట్ పొగ నోట్లోంచి వూదుతూ సోఫాకి తల ఆనించి ఫ్రీగా కూర్చుని ఆలోచనలో పడిపోయాడు.

"అసలు శ్రీధర్, సులోచనల పెళ్ళికి మొదట్లో ఒప్పు

కొని, తర్వాత అడ్డం తిరగడం చాల ఆశ్చర్యంగా వుంది. నేనెంతో ఆలోచించినా యేమీ అర్ధం కాలేదు. శ్రీధర్ మీ స్వంత కొడుకు కాదని, ఏ వూరివాడో, ఎవరి పాప ఫలితమో తెలియదనీ, అటువంటివాడికి పిల్లనివ్వడం తనకి ఇష్టం లేదనీ రుక్మిణీదేవి భర్తతో వాదించడం విని సులోచన మాకు చెప్పింది. అఫ్‌కోర్స్ శ్రీధర్‌కి తెలియనివ్వాలేదనుకోండి," నవ్వాడు రాయప్ప.

"మొదటిసారి శ్రీధర్‌ని చూసి మూర్ఛపోవడానికి ఒక కారణం వుంది," అంటూ సోఫాలోంచి లేచి అటూ ఇటూ పచార్లు చేయసాగాడు జగపతిరావు.

రాయప్ప అతనిని విస్మయంగా చూశాడు.

"రుక్మిణీదేవి అన్న పార్ధసారధి పోలికలు శ్రీధర్‌లో వున్నాయి. తొలిసారి అతన్ని చూసి తన అన్నకొడుకే అనుకొని నిర్ఘాంతపోయి ఆవేశంతో మూర్ఛపోయింది. తన అన్నకొడుకే అనుకొని సులోచనని ఇవ్వడానికి ఒప్పుకుంది. కాని తీరా పెళ్ళి నిశ్చయం చేసుకోవడానికి నేను, శ్రీధర్ వాళ్ళింటికి వెళ్ళాం. నన్ను చూసి మళ్ళీ మూర్ఛపోవడానికి కారణం నేను ఆమె అన్నగారిని కాకపోవడమే!" అంటూ నవ్వాడు జగపతిరావు.

రాయప్ప ఆశ్చర్యంతో చూశాడు అదంతా నిజమేనా అన్నట్లు.

"నేను చెప్పేది నిజమే! తర్వాత ఆమె నన్ను ఏకాంతంగా కలుసుకొని శ్రీధర్ మీ స్వంత కొడుకు కాదు. నిజమేనా అంది. నాకు చాల ఆశ్చర్యం కలిగించింది. ఆమెకు యెలా తెలుసా అని. మొదట్లో బుకాయించాను నా స్వంత కొడుకే అని, నా భార్య చనిపోయిందనీ, మళ్ళీ పెళ్ళి యిష్టంలేక అలాగే వుండిపోయాననీ వాదిం

చాను.

ఆఖరికి ఆమె యెప్పటిదో ఒక పాత ఫోటో తీసి నాకు చూపించింది. ఆ ఫోటో చూసి నాకు చాల ఆశ్చర్యం కలిగింది. అందులో అచ్చు శ్రీధర్ లాగే వున్న యువకుడు వున్నాడు. ఆమె కథంతా చెప్పుకొచ్చింది. ఆమె అన్న పార్థసారథి గురించీ, శ్రీధర్ పార్థసారధికి పుట్టిన అక్రమసంతానం అని రుజువు చేసి నా నోరు మూయించింది.

అటువంటివాడికి తన కూతుర్ని ఇవ్వననీ, తన తండ్రి ఆత్మ క్షోభిస్తుందనీ, తన అన్న, తన కొడుకు గూడా ఇంటి పరువు ప్రతిష్టలు మంటగలిపారనీ వుపన్యాసం దంచింది. అయితే ఈ విషయం శ్రీధర్ కి తెలియనివ్వ వద్దని ఆమెను రిక్వెస్టు చేసి వచ్చేశాను." అన్నాడు జగపతిరావు.

"అయితే శ్రీధర్ మీకు యెక్కడ దొరికాడు?"

"చెత్తకుప్పలో."

"నిజమా?"

"ఎస్."

"పార్థసారథి కొడుకు చెత్తకుప్పలో యెలా దొరికాడు?"

"చెప్తాను. అప్పుడు నేనొక ఎక్స్‌పోర్టు కంపెనీలో గుమస్తా పని చేస్తూ వుండేవాడిని. అప్పటికే జీవితంలో ఎన్నో ఆటుపోటులకు గురై నిరాశతో వున్నాను. నేను ప్రేమించి పెళ్ళి చేసుకోవాలనుకొన్న యువతి నమ్మించి మోసం చేసింది. డబ్బు, హోదా వున్న యువకుడిని పెళ్ళి చేసుకొని నన్నొక అసమరుడి క్రింద జమకట్టింది. తర్వాత నేను ద్రైఫిష్ యెక్స్‌పోర్టు కంపెనీలో పని

చేస్తూనే చిల్లర వ్యాపారాలు చేస్తూ కొంత డబ్బు సంపాదించాను. ఇక వుద్యోగం మానేసి వ్యాపారంలో స్థిరపడాలని ఆలోచించసాగాను. ఆ సమయంలోనే శ్రీధర్ మా ఇంటిపక్క చెత్తకుప్పలో దొరికాడు. పిల్లవాడు ముద్దుగా వున్నాడు. ముచ్చటవేసి ఆ కుర్రాడిని తెచ్చుకుని పెంచుకున్నాను.

వాడి అదృష్టమేనేమో తర్వాత నేను మట్టి పట్టుకుంటే బంగారమైంది. ష్రింపిష్ యెక్స్పోర్టు బిజినెస్‌లో లక్షలు సంపాదించాను. మద్రాసులో హెడ్డాఫీసు వుంది నాకు, కాకినాడ, వైజాగ్ లలో బ్రాంచీలు వున్నాయి."

అదంతా విని దీర్ఘంగా నిట్టూర్చాడు రాయప్ప.

"ఇంత సంపాదించారు గదా! పెళ్ళి యెందుకు చేసుకోలేదు మీరు?"

"అదేం ప్రశ్న? అంతా చెప్పాను గదా! ఈ ఆస్తికి శ్రీధర్ వారసుడు. వాడే స్వంత కొడుకనీ, నా భార్య చనిపోయిందనీ అందర్నీ నమ్మించాను. డబ్బుంది కాబట్టి, ఏ సుఖమైనా ఇంటికి నడిచి వస్తుంది. నో రిస్క్. అర్థమైందనుకుంటాను," నవ్వాడు జగపతిరావు.

తల వూపాడు ప్రైవేట్ డిటెక్టివ్ రాయప్ప.

"కాని శ్రీధర్ ఇంత తెలివితక్కువగా బిహేవ్ చేస్తాడని కలలో గూడా అనుకోలేదు. కో అంటే కోటి మంది వచ్చి క్యూలో నిల్చుంటారు పిల్లనిస్తామని. సులోచనకంటే అందగత్తెలని రోజుకోదాన్ని తెచ్చి అనుభవించగలిగే స్టేటస్ మాది. ఆఫ్టరాల్ ఒక ఆడదానికోసం అది లేకపోతే బ్రతకలేననే హీనస్థితికి దిగజారిపోవడం ఐ హేటిట్," కొంచెం కోపంగా అన్నాడు జగపతి

రావు.

"వాళ్ళిద్దరూ ప్రేమించుకున్నారు."

"నో.... దేర్ ఈజ్ నో లా ఇన్ దిస్ వరల్డ్," గట్టిగా అన్నాడు జగపతిరావు.

"ఏమో మీరు పెద్దవారు. అనుభవజ్ఞులు. మీకు చెప్ప వలసినవాడిని కాను. కాని ప్రేమ మానసిక బంధం అని నా అభిప్రాయం," అన్నాడు రాయప్ప.

"మీరు వాడికి స్నేహితులు. కాబట్టి కొంచెం బుద్ధి చెప్పండి. వాళ్ళు వద్దు మొర్రో అంటుంటే, వీడు వెంట బడడం యెంత చులకనగా వుంటుందో చూడండి."

రాయప్ప ప్రయత్నిస్తానని చెప్పి సెలవు తీసుకొని వచ్చేశాడు.

"ఏం జరిగింది?" ప్రశ్నించాడు నాగరాజు రాయప్ప రాగానే.

జరిగిందంతా చెప్పాడు రాయప్ప.

"శ్రీధర్‌కి ఈ సంగతి తెలిస్తే బాధపడతాడని మనం సీక్రెట్‌గా వుంచుతున్నాం. కాని యెన్నాళ్ళు? ఈసారి మనవాడు రుక్మిణీదేవి యెదుటపడితే మొఖంమీదే అనేసే టట్లుగా వుంది. పైగా ఆవిడకి ఫిట్స్ రోగం ఒకటి. యేదైనా గట్టిగా మాట్లాడ్డానికి భయంగా వుంది."

"మరి కర్తవ్యం. చేతులెత్తి వూరుకోవడమేనా?"

"ఒకటే మార్గం వుంది."

"ఏమిటి?"

"బ్రహ్మాస్త్రంలాగా ఆఖరి అస్త్రం. ఢిల్లీ వెళ్ళి ఆవిడ అన్న పారసారథిని లాక్కొని రావడం. అన్నా చెల్లెళ్ళకి సంధి చేసి పెళ్ళికి వప్పించడం" అన్నాడు రాయప్ప.

# 6

"కొంప మునిగిందిరా బాబూ!" అంటూ హడా వుడిగా వచ్చాడు శ్రీధర్.

"ఏం జరిగింది" అన్నాడు నాగరాజు.

"పైకి రా చెప్తాను." అంటూ అప్ స్టెయిర్ కి వెళ్ళిపోయాడు.

"ఏమిటి హడావుడి? మళ్ళీ యెవడైనా తన్నడానికి వచ్చాడా?"

"తన్నడానికి వస్తే చావగొట్టి చెవులు మూయించి పంపిద్దును. కాని అంతా మోసం!" అన్నాడు శ్రీధర్.

బ్రౌన్ కవరు టీపాయ్‌మీదకు విసిరేసి "చూడు" అన్నాడు.

నాగరాజు కవరు తెరచి చూశాడు. ఫుల్ సైజు ఫోటో అందులో శ్రీధర్ పడుకొనివుంటే, ఎవరో యువతి అర్ధ నగ్నంగా అతనిమీద చేతులువేసి నిద్రపోతూ వుంది.

కరెంట్ షాక్ తగిలినట్లు అదిరిపడ్డాడు నాగరాజు.

"ఏమిట్రా ఇది?"

"మోసం," అన్నాడు శ్రీధర్ కోపంతో.

"ఎవరు ఇచ్చారు నీకు?"

"సులోచన."

"మైగాడ్. ఆవిడకు ఎక్కడిదిది?"

"వాళ్ళమ్మ ఇచ్చిందట. నువ్వు ప్రేమించే శ్రీధర్ యెంత నీతిమంతుడో చూడు అని ఇచ్చిందట. సులోచన నా రూమ్‌కి వచ్చి అది నా మొఖాన కొట్టి రుస రుస లాడుతూ మాటా పలుకూ లేకుండా వెళ్ళిపోయింది," అన్నాడు శ్రీధర్ నీరసంగా.

"ఈ ఫోటో యెవరు తీశారు? యెలా తీశారు? ఇదేదో ట్రిక్ ఫోటో కాదు గదా?"

"ట్రిక్ కాదు నా ముఖం కాదు. జరిగింది చెప్తాను విను," అంటూ సిగరెట్ వెలిగించి చెప్పసాగాడు శ్రీధర్.

"ఒకరోజు నేను సెకండ్ షో సినిమాకెళ్ళి వస్తున్నా. పార్కు దగ్గరికి వచ్చేసరికి యెవరో స్త్రీ కేకలు పెడుతున్నట్లు అనిపించి బైక్ ఆపేశాను. దూరంగా చెట్టు క్రింద యెవరో ఆడమనిషి యెవరితోనో పెనుగులాడుతున్నట్లు మసకగా కనిపించింది. మనకెందుకులే పోదాం అనుకున్నాను. కాని వెళ్ళలేకపోయాను. పార్కు గేట్లు తాళాలు వేసివున్నాయి. మోటార్ సైకిల్ లాక్ చేసి గోడ దూకి పరిగెత్తుకెళ్ళాను.

నన్ను చూసి అతను మీదకు దూకాడు. నాలుగు తంతే పారిపోయాడు.

ఆమె వెక్కి వెక్కి ఏడుస్తున్నది.

ఎవరో పాపం!

ఏం జరిగిందో చెప్పమన్నాను.

ఆమె పేరు పార్వతి. తాడికొండ గ్రామం వాళ్ళది. వాళ్ళ నాన్నకి నలుగురు ఆడపిల్లలు. పెద్దమ్మాయి పార్వతి. వయసు పాతికేళ్ళు. చెల్లెళ్ళంతా పెద్దమనుషులయ్యారు. ఆఖరివాడు తమ్ముడు. క్యాన్సర్ వచ్చి తల్లి చనిపోయి సంవత్సరం దాటింది.

తండ్రి అతి కష్టంమీద సంసారం ఈడుస్తున్నాడు. అతనికి రెండెకరాల పొలం వుంది. కౌలుకు మరికొంత తీసుకొని వ్యవసాయం చేస్తున్నా ప్రతి యేడూ తుఫాన్లు రావడంవల్ల తిండికే చాలడంలేదు రాబడి.

ఇక తనకి తండ్రి పెళ్ళి చెయ్యలేడని నిర్ణయించు కుంది పార్వతి. ఇంటిప్రక్క ఆమె తమ్ముడు ఇక్కడ ఏదో ఫ్యాక్టరీలో పని చేస్తూ అప్పుడప్పుడూ అక్కగారింటికి వచ్చేవాడు.

అతను పెళ్ళి చేసుకుంటానని నమ్మించి పార్వతిని తీసు కొచ్చాడు కాని మోసం చేశాడు. వెయ్యి రూపాయలకు ఎవరికో అమ్మేడు. నెలనుంచి నరకయాతన అనుభవిస్తు న్నది పార్వతి.

చివరికి ఈ రోజు యెవరో వంద రూపాయలు ఇచ్చి రూమ్‌కి తెచ్చుకొన్నారు. అందులో నలుగురు మనుషు లున్నారు. అంతా సీసాలు ముందు పెట్టుకుని త్రాగు తున్నారు. ఆమెకు భయంవేసి పారిపోయివచ్చిపార్కులో దాక్కుంది. అందులో ఒకడు కనిపెట్టి పట్టుకున్నాడు.

అదీ పార్వతి చెప్పిన కథ.

"చివరికి యేదైనా దారి చూపించి పుణ్యం కట్టుకో మని యేడ్చింది."

అదంతా నిజమేనని అమాయకంగా నమ్మాను.

అంత రాత్రిలో యేం చెయ్యగలను.

తెల్లవారిన తర్వాత ఆలోచిద్దామని ఆమెను మోటార్ సైకిల్ మీద యెక్కించుకొని రూమ్‌కి తీసుకెళ్ళాను.

చాప ఇచ్చి క్రింద పడుకోమని చెప్పాను. నేను నా బెడ్ రూమ్‌లో పడుకొని నిద్రపోయాను. సెకండ్ షోకి వెళ్ళిరావడం వలన వెంటనే నిద్ర పట్టింది.

నేను నిద్రపోతున్నప్పుడు యెవరో వచ్చి ఫోటో తీసి వుండాలి.

తెల్లవారి నేను నిద్ర లేచేసరికి ఆమె లేదు." అన్నాడు శ్రీధర్ ముగిస్తూ.

"భలే గమ్మత్తుగా వుందిరా కథ. రియల్లీ ఐ వండర్. నిజమేనా అని అనుమానంగా వుంది," నవ్వుతూ అన్నాడు నాగరాజు.

"నన్ను అనుమానిస్తున్నావా?"

"ఏం యెందుకు కూడదు? అర్ధరాత్రి ఒంటరిగా ఆడపిల్ల రూమ్‌లో వుంటే నిగ్రహించుకుని వుండడం! అబ్బ యెంత కష్టమో! ఏ ఋష్యశృంగుడో, ప్రవరాఖ్యుడో అయితే తప్ప నాలాటి వాడికి అసాధ్యం. నిజం చెప్పు. ఫరవాలేదు సులోచనకు చెప్పనులే," అన్నాడు నాగరాజు నవ్వుతూ.

"నిజం చెప్తుంటే నమ్మవేం? జోక్‌గా వుందా?"

"ఏమో నాకైతే నమ్మకం కలగడంలేదు."

"అంతా నా కర్మ. ఇదంతా వాళ్ళమ్మ చేయించిందని నా నమ్మకం."

"మే బీ." అన్నాడు నాగరాజు.

"నామీద అంత పగ ఎందుకో అర్ధం కావడంలేదు," సిగిరెట్ పొగ పైకి వదుల్తూ అన్నాడు శ్రీధర్.

"ఎందుకేమిటి? నువ్వు వాళ్ళమ్మాయిని యెత్తుకెళ్ళి దొంగపెళ్ళి చేసుకుంటావేమోనని భయం."

"అలా చేసేవాడ్నైతే యెప్పుడో చేసుకునేవాడిని. అంత కర్మ ఏంపట్టింది. దర్జాగా దొరలా చేసుకుంటాను."

"అందుకే కూతురు మనసు విరిచెయ్యడానికి ఆ ఫోటో కథ సృష్టించింది. భేష్ మీ అత్తగారు సారీ కాబోయే అత్తగారు గొప్ప తెలివితేటలు గలదిరా నాయనా! పోయిన జన్మలో ఏ డిటెక్టివో గాని," అంటూ నవ్వాడు నాగరాజు.

"ఇప్పుడు ఆ ఫోటో కథ నిజం కాదని సులోచనని

యెలా ఒప్పించాలో అర్థం కావడం లేదు," దిగులుగా అన్నాడు శ్రీధర్.

"రాయ్‌ని రానీ యేదైనా వుపాయం చెప్పకపోడు." అన్నాడు నాగరాజు.

"అన్నట్లు రాయ్ యెక్కడ?"

"ఏదో పనుందని హైదరాబాద్ వెళ్లాడు" అన్నాడు నాగరాజు. అతను ఢిల్లీ వెళ్ళిన సంగతి దాచిపెడుతూ.

"సరే, రాగానే నాకు ఫోన్ చెయ్యి," అన్నాడు శ్రీధర్.

# 7

"ఆ ఫోటో సంగతి చెప్పాడా మనవాడు," అంటూ వచ్చాడు శ్రీధర్.

"ఆఁ" అన్నాడు రాయప్ప తల వూపుతూ.

"సులోచనకి నచ్చజెప్పడం యెలాగో తల బద్దలై పోతోంది. నన్నింత చీప్‌గా అంచనా వేస్తుందని కలలో గూడ అనుకోలేదు," బాధగా అన్నాడు శ్రీధర్.

రాయప్ప మౌనంగా కూర్చున్నాడు.

"ఇప్పుడేం చెయ్యాలి చెప్పు. అసలు సమస్య అలాగే వుంది. కొత్త కొత్త సమస్యలు వచ్చి పడుతున్నాయ్!" చిరాకుగా అన్నాడు శ్రీధర్.

రాయప్ప నవ్వాడు.

"నవ్వుతావేమిటి? ఇల్లు కాలి నే నేడుస్తుంటే!"

"నవ్వక ఏడవమంటావా?"

"బాగుంది. ఏదొక సలహా చెప్పు. సులోచనని రమ్మని ఫోన్ చెయ్యి. నువ్వు రమ్మంటే వస్తుందేమోనని ఆశ" అన్నాడు శ్రీధర్.

"నీకొక సంగతి చెప్పాలి. ముందు డోర్ బోల్టు

వేసిరా!"

"ఎందుకూ?" ఆశ్చర్యంగా అన్నాడు శ్రీధర్.

"సీక్రెట్ కాబట్టి."

"ఏమిటది? ఇక్కడెవరున్నారు? చెప్పు."

"ముందు వేసిరా చెప్తాను."

శ్రీధర్ విసుగ్గా లేచి బోల్టు వేసి వచ్చి కూర్చున్నాడు.

"శ్రీధర్ నువ్వు సులోచనని మర్చిపో" గంభీరంగా అన్నాడు రాయప్ప.

"ఇదా నువ్వు చెప్పే సీక్రెట్?" అసహనంగా అన్నాడు శ్రీధర్.

"తొందరపడకు. సావధానంగా ఆలోచించు. ప్లీజ్!"

"నువ్వి సలహా చెప్పనవసరం లేదు" రోషంగా అన్నాడు.

"ఎందుకు చెప్తున్నానో ఆలోచించవేం?" మందలింపుగా అన్నాడు రాయప్ప.

"ఎందుకో చెప్పరాదూ! ఇంకా నేను ఆలోచించడం ఎందుకు టైం వేస్టు!"

"సులోచనని నువ్వు పెళ్ళి చేసుకుంటే రుక్మిణీదేవి చచ్చిపోతుంది."

"పొరబడుతున్నావ్ రాయ్! కొన్నాళ్ళు బాధపడినా తర్వాత సర్దుకుపోతుంది."

"నో శ్రీధర్."

"నువ్వెలా చెప్పగలవు?"

రాయప్ప పేలవంగా నవ్వాడు.

"శ్రీధర్. రుక్మిణీదేవి నీ కన్నతల్లి."

"నో...." గట్టిగా కేకపెట్టాడు శ్రీధర్.

"ప్లీజ్. డోంట్ అప్‌సెట్ శ్రీధర్. దిస్ ఈజ్ ఫాక్ట్" అంటూ చెప్పసాగాడు.

"రుక్మిణీదేవిని ఒప్పించడానికి ఆమె అన్న పార్థసారధిని తీసుకుని రాపడానికి ఢిల్లీ వెళ్ళాను. అతను చెప్పిన వివరాలు ఇవి. మెడ్రాస్‌లో చదువుకునే రోజుల్లో జరిగింది ఈ కథ. అన్నా చెల్లెలు ఒక రూమ్‌లో వుండి వంట మనిషితో వంట చేయించుకుని కాలేజీకి వెళ్తూ వుండేవాళ్ళు.

వాళ్ళు అద్దెకుంటున్న ఇంటి యజమాని కొడుకుతో ప్రేమలో పడింది రుక్మిణీదేవి. వ్యవహారం చాలాదూరం పోయాక తెలిసింది, అతనికి పెళ్ళయిందనీ, కట్నందగ్గిర పేచీ వచ్చి ఆమె పుట్టింట్లో వుందనీ.

డాక్టర్‌కి చూపిస్తే అబార్షన్ చేయిస్తే అసలు తల్లి ప్రాణానికే ప్రమాదం అని చెప్పింది. ఇక గత్యంతరంలేక ఆత్మహత్య చేసుకోబోయిన చెల్లెలిని రక్షించి, అనునయించి రహస్యంగా పురుడు పోయించారు. పుట్టిన బిడ్డని చెత్త కుండీలో పారవేశారు. ఆ బిడ్డవే నువ్వు!

నీకు మేనమామ పోలికలు వచ్చాయి. పార్థసారధి అచ్చు నీలాగే వుంటాడు. రుక్మిణీదేవి నీవు తన కొడుకువని తెలుసుకుంది. అందుకే మీ పెళ్ళికి సమ్మతించలేదు.

కాబట్టి, సులోచన నీ చెల్లెలు. ఆమె మనసులోవున్న అపోహను అలా వుండనీ. ఆమెను నీ స్వంత చెల్లెలుగానే భావించు...."

రాయ్ చెప్తున్నదంతా వింటూ శిలావిగ్రహంలా కూర్చుండిపోయాడు శ్రీధర్.

—: ఐపోయింది :—

# మూడు దెయ్యాలు

## ప్రతాప రవిశంకర్

రాత్రి ఎనిమిది గంటలు దాటుతోంది.

రోడ్డుమీద గబగబా నడుస్తున్నాడు రాజు. రద్దీగా వుంది రోడ్డు. ఎదురొస్తున్న మనుషులను తప్పుకుంటూ నడుస్తున్నాడు.

షాపుల్లో దీపాలు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి. అమ్మకాలు జోరుగా సాగుతున్నాయి. పేవ్ మెంటుమీద నిలబడి ఎవడో పెద్దగా అరుస్తున్నాడు లాటరీ టిక్కెట్లు కొనండని. కొంతమంది వాడి అరుపులు విని వాడి దగ్గరకు వెళ్ళి డ్రా తేదీ ఎప్పుడో కనుక్కొని టిక్కెట్లు కొంటున్నారు.

రాజుకూడా వాడి అరుపులు విన్నాడు. ఎందుకో తన అదృష్టాన్ని పరిశీలించుకోవాలని అనిపించింది. అవును. ఇంతవరకు తను ఒక్క లాటరీ టిక్కెట్టుకూడా కొనలేదు.

తన అదృష్టం ఎలా వున్నదో? ఒక్క లాటరీ టిక్కెట్టు కొంటే....

అరుస్తున్నవాడిని దాటిపోయాడు. అయినా లాటరీ గురించిన ఆలోచనలు రాజును వదల్లేదు. ఠక్కున ఆగి పోయాడు.

వెనక్కి తిరిగి వాడి దగ్గరగా నడిచాడు....

ఇద్దరు నిలబడి వాడిదగ్గర టిక్కెట్లు కొంటున్నారు.

రెండు రూపాయలిచ్చి ఓ టిక్కెట్టు కొన్నాడు.

లక్ కలిసొస్తే తనకు నాలుగు లక్షలొస్తాయి. అప్పుడు తను ఉద్యోగంకోసం వెతుక్కోవలసిన అవసరంలేదు. తనే ఓ ఇండస్ట్రీ పెట్టి ఎంతోమందికి ఉద్యోగాలిస్తాడు.

ఇంతకీ తన అదృష్టం ఎలా వుందో?

అక్కడినించి కదిలాడు. అదృష్టం గురించిన ఆలోచనలు రాజును చుట్టుముట్టాయి.

మెయిన్ రోడ్డును దాటి చిన్నరోడ్డులోకి ప్రవేశించాడు. ఆ రోడ్డు చివరకు వెళ్ళి ఇంకో మలుపు తిరిగితే అతని గది వస్తుంది. ఆ గదిలో అతనూ అతని స్నేహితుడు రంగారావు వుంటున్నారు.

రోడ్డుమీద నడుస్తూనే షర్టు జేబులోనించి సిగరెట్టు ప్యాక్ బయటకు తీశాడు రాజు.

ఓ సిగరెట్టు వెలిగించాడు....

పొగవదులుతూ నడుస్తున్నాడు.

అక్కడినించి వీధిదీపాలు వెలగడంలేదు. చలికాలం కావడంవల్ల అప్పటికే ఇళ్ళలో మనుషులు తలుపులు బిగించుకున్నారు.

మసక వెలుతురు రోడ్డును ఆక్రమించుకుంది.

అతని పెదవులమధ్య సిగరెట్టు ఎర్రగా వెలుగుతోంది.

కొంచెం దూరంలోవున్న రైలు స్టేషన్‌లో ఏదో రైలు పెద్దగా కూతపెడుతోంది.

నడుస్తున్న రాజు గబుక్కున ఆగిపోయాడు.

"వదలండి....వదలండి" ఎవరో ఆడది చిన్నగా అరుస్తోంది.

చుట్టూ చూశాడు.

రోడ్డు పక్కనే యెత్తయిన గోడవారగా ముగ్గురు మగాళ్ళమధ్య ఓ ఆడది గింజుకుంటోంది.

వాళ్ళు ఆ అమ్మాయిని హింసిస్తున్నారు. కొంచెం కూడా ఆలోచించలేదు రాజు.

రివ్వున పరుగెత్తి వాళ్ళమీద దూకాడు. ముగ్గురూ ఒక్కసారి ఉలిక్కిపడ్డారు.

ఆ అమ్మాయిని వదిలేశారు.

ఆమెకు కొంచెం దూరంలో కాలేజ్ బుక్స్ పడు న్నాయి. బహుశా ట్యూషన్‌నుంచి వస్తుందేమో ఆ అమ్మాయి. ఒకడిని డొక్కలో తన్నాడు రాజు.

పెద్దగా కేకపెట్టాడు వాడు. వెనక్కు పడిపోయేడు. మిగిలిన ఇద్దరూ అతనిమీదకు కలియబడ్డారు. గుండెల మీద పిడికిళ్ళతో పొడిచారు. విరుచుకు పడ్డాడు రాజు. ఎవడో రాజు మొహంమీద బలంగా కొట్టాడు. అదిరి పడ్డాడు రాజు. కళ్ళు తిరిగాయి.

ఒకడు రాజు గుండెలమీద కూర్చున్నాడు. మరొకడు చేతులను గట్టిగా మెలితిప్పాడు.

కీచుమంటూ అరిచాడు రాజు.

"పెద్ద హీరోలా దాన్ని రక్షించడానికి వచ్చావురా?" రాజు అరుస్తున్నాడు బాధతో.

రోడ్డు నిర్మానుష్యంగా వుంది. చీకటి పడితే సాధారణంగా ఎవ్వరూ ఆ రోడ్డున రారు. తొందరగా ఇంటికి

చేరాలనుకునేవారు ధయిర్యంచేసి ఆ రోడ్డున వస్తారు. సేషన్ అవతలకు అది దగ్గరిదారి. ఎవడో జేబులోనించి పెన్‌టార్చి బయటకు తీశాడు. రాజు మొహంమీద ఫోకస్ చేశాడు.

అతని ముఖం బాధతో మెలితిరుగుతోంది.

"చస్తాడ్రా" యెవడో అన్నాడు.

"చావనీ" మరొకడు చిన్నగా అన్నాడు.

దూరంనుంచి పడుతున్న మసక వెలుగులో వాళ్ళ ముఖాలు చూశాడు రాజు.

ఇంతకుముందు యెక్కడో చూసినట్టుగానే అనిపించాయి. కిరాతకుల్లా వున్నారు.

తనని చంపుతారేమో? వాళ్ళని ఎదిరించాలని వుంది. కాని తన బలం చాలటంలేదు.

వాళ్ళను గట్టిగా నెట్టబోయాడు. అంతే.అతని గుండెల మీద, మొహంమీద బలంగా దెబ్బలు పడ్డాయి.,

కేకలు పెడుతున్నాడు రాజు.

నోట్లోంచి నెత్తురు కారుతోంది.

వాళ్ళ ముగ్గురూ నిలబడ్డారు. ఒక్కసారి చుట్టూరా చూశారు.

"ఏదిరా ఇది?" ,ఎవడో అన్నాడు. అప్పటివరకూ వాళ్ళు ఆ అమ్మాయిని గురించి మరచిపోయారు.

"పిట్ట ఎగిరిపోయిందిరా?"

"ఎక్కడికి పోతుంది? రేపు దొరుకుతుందిలే పదండి."

వాళ్ళు వెళ్ళిపోయారు.

రాజు మూలుగుతున్నాడు. నెత్తురు గొంతుమీద కారుతోంది.

'ఎవరయినా వస్తే బావుండు' అనుకున్నాడు.

రోడ్డుమీదనుంచి ఏవో కారు మూసుకుపోయింది. రాజు వాళ్ళకు కనిపించలేదు రోడ్డుపక్కగా పడివుండటంవల్ల.

"దాహం.... దాహం...." అరుస్తున్నాడు రాజు. అతనికి యెలాగో లేవాలని వుంది. ప్రయత్నం చేశాడు. కాని కాళ్ళు కదల్లేదు. చేతులుకూడా కదల్లేదు.

రాజుకి స్పృహ పోయింది.

## 2

కళ్ళు తెరిచాడు రాజు.

పైన ఫ్యాను గిరగిరా తిరుగుతోంది. గోడనున్న ట్యూబు లైటు వెలుతురును విరజిమ్ముతోంది. వెంటనే వెలుగును చూడలేకపోయాడు. ఒక్కసారి కళ్ళుమూసుకొని మళ్ళీ తెరిచాడు కళ్ళని.

ఇప్పుడు రాజుకు పక్కనే కూర్చున్న మనుషులు కనిపించారు.

'థాంక్ గాడ్' అన్నాడు పక్కనే కూర్చున్న లావుపాటి ఆయన. ఆయనకు ఏభై ఏళ్లున్నాయి. బట్టతల. ఫుల్ షర్టు వేసుకున్నాడు. కళ్ళకు పలుచని అద్దాలు.

"మీ రెవరు?" అన్నాడు రాజు చిన్నగా.

"ఈ అమ్మాయి తండ్రిని" నవ్వుతూ అన్నాడాయన.

"ఈ అమ్మాయి...." అంటూ ఆగిపోయాడు రాజు. జరిగినదంతా అతనికి లీలగా గుర్తుకొచ్చింది.

"చాలా థాంక్సండీ. నా గురించే మీరు యిలా అయ్యారు" అన్నదా అమ్మాయి కృతజ్ఞతగా.

"ఫర్వాలేదు. నేను బతుకుతా ననుకోలేదు. అయినా నన్ను ఇక్కడికి యెవరు తీసుకొచ్చారు?" అడిగాడు రాజు.

"నేనే" అన్నదా అమ్మాయి.

ఆయన రాజు ముఖంలోకి పరీక్షగా చూస్తున్నాడు.

"మీరా! మీరు అక్కణ్నించి వెళ్ళిపోలేదా?"

"వెళ్ళాను. వాళ్లు ముగ్గురు. మీరు ఒక్కరు. ఎలా గయినా మీకు దెబ్బలు తగులుతాయని నాకు తెలుసు. అందుకే వెంటనే మా నాన్నని తీసుకొని వచ్చాను. నేను అనుకున్నట్టుగానే మీరు స్పృహలేకుండా వున్నారు."

"మెనీ థాంక్స్" అన్నాడు రాజు.

"నేనే మీకు థాంక్స్ చెప్పుకోవాలి. నాకోసం మీ రింతటి ప్రమాదాన్ని యెదుర్కొన్నప్పుడు ఈ మాత్రం చెయ్యడంలో గొప్పలేదు" అన్నదా అమ్మాయి.

ఇంతలోనే డాక్టరు వచ్చాడు.

"గుడ్.... తెలివొచ్చిందన్నమాట. ఏమోయ్ హీరో. తెలుగు సినిమాలు ఎక్కువగా చూస్తావా?" అన్నాడు డాక్టర్ నవ్వుతూ.

రాజు బలహీనంగా నవ్వాడు.

"నీ పేరేమిటి?" అడిగాడాయన.

"రాజు."

"ఒకరోజంతా నువ్వు రెస్టు తీసుకోవాలబ్బాయ్," అన్నాడు డాక్టర్.

"అలాగే సార్. నేను నా గదికి వెళతాను."

"ఎక్కడ నీ గది?"

చెప్పాడు రాజు.

"అయితే ఇక్కడకు దగ్గరే. ఒక్కరోజు యిక్కడ వుండలేవా?"

"సారీ సార్ ఆటోలో వెళ్ళగలను."

"నీ యిష్టం" అన్నాడు డాక్టర్.

"నువ్వేం చేస్తున్నావ్?" అడిగాడాయన.

"నిరుద్యోగిని సార్. ఇంకా పెళ్ళికాలేదు. పెళ్ళయి

నట్లయితే ఇంత ధైర్యంగా వాళ్ళతో తలపడే వాడిని కాదు."

"గుడ్ జోక్" పెద్దగా నవ్వాడాయన. ఆ అమ్మాయి చిన్నగా నవ్వింది.

"నా పేరు శివపాదం. ఓ ప్రయివేటు ఫర్మ్‌కి మేనేజర్‌గా చేస్తున్నాను. ఈ అమ్మాయి నా కూతురు కస్తూరి" పరిచయం చేశాడు.

"ఏం చదువుతోంది?" అడిగాడు రాజు.

"బియ్యే సెకండియర్."

"డాక్టర్. ఇక నే వెళతాను." బెడ్ మీదనుంచి మెల్లగా లేచాడు రాజు.

ఆయన జేబులోనించి యాభైరూపాయల నోటు బయటకు తీశాడు.

"ఇదిగో అబ్బాయ్....ఈ డబ్బు వుంచు."

"నేను మీ అమ్మాయికి అంగరక్షకుడిని కాదు. సమయానికి అటువైపు వచ్చాను కాబట్టి ఇలా జరిగింది."

"ఫర్వాలేదులే వుంచు."

రాజు ఆ డబ్బులు తీసుకోలేదు.

అందరికీ వెళ్ళొస్తానని చెప్పి, నీరసంగా బయటకు నడిచాడు.

## 3

"వాళ్ళెలా వుంటారు?" అడిగాడు రంగారావు సిగరెట్టు వెలిగించి.

"దారుణమయిన మొహాలు. జేబులుకొట్టే వాళ్ళలా వున్నారు. ఇద్దరు మన హయిట్ వుంటారు. ఒకడు బాగా పొట్టి. చైనావాడిలా వున్నాడు" చెప్పాడు రాజు.

"ఇంతకుముందు యెప్పుడయినా చూశామా?"

"నాకు వాళ్ళను చూడగానే పరిచయమున్న మనుషులు లాగానే అనిపించారు. కాని యెక్కడ చూశామో గుర్తురావడం లేదు."

"ఏ సెంటర్లో చూసివుంటాం?"

"ఏమో! గుర్తు రావడంలేదు."

"ఒకపని చేద్దాం."

"ఏమిటి?"

"సాయంత్రం చీకటిపడిన తర్వాత మనకు తెలిసిన సెంటరులన్నింటికీ వెడదాం. ఎక్కడో ఒకచోట దొరకక పోరు" అన్నాడు రంగారావు.

సరేనన్నాడు రాజు. అతనికి బాగా కసిగావుంది వాళ్ల మీద. ఇంతకుముందు యెవ్వరూ రాజుమీద చెయ్యి చేసుకోలేదు. ఇదే మొదటిసారి తన్నులు తినడం. అవమానంగా వుంది.

రంగారావు టేబిల్ సొరుగులోనించి బటన్ నైఫ్ బయటకి తీశాడు.

"కత్తి దేనికి?" అన్నాడు రాజు.

"ప్రాణ రక్షణకోసం. వీలు దొరికితే పొడిచేస్తాను" అన్నాడు రంగారావు.

రంగారావుకు పౌరుషం ఎక్కువ. తన ప్రాణమిత్రుడు అయిన రాజును తన్నినవాళ్ళమీద అతను పగబట్టాడు. రంగారావుది పాము పగకంటే యెక్కువ. అతను బదులు తీర్చుకునేవరకు నిద్రపోడు. అతనిది చిన్నతనం నుండి డేరింగ్ నేచర్. ఎప్పుడూ తగాదాల్లో తిరుగుతూండేవాడు.

రంగారావు దృఢంగా వుంటాడు. వ్యాయామం చేసిన శరీరం. లావుగా, పొడుగ్గా వుంటాడు.

సాయంత్రం అయిదయింది.

రాజు కొంచెం కోలుకున్నాడు.

గదిలోనించి సైకిలు బయటకు తీశాడు రంగారావు.

తాళం పెట్టాడు రాజు గదికి.

ఇద్దరూ సైకిలుమీద బయలదేరారు.

రంగారావు సైకిలు తొక్కుతున్నాడు.

రాజు వెనుక కూర్చున్నాడు.

రౌడీలు కలుసుకునే సెంటర్లన్నింటికీ తిరుగుతున్నారు ఇద్దరూ....

ఎక్కడా వాళ్ళు కనిపించలేదు.

అప్పటికి రాత్రి ఏడున్నరయింది.

వెనక్కు మళ్ళారు.

"రేపయినా దొరక్కపోరు" అన్నాడు రంగారావు.

"అవును" అన్నాడు రాజు.

ఆ రోడ్డు అంతగా జనంతో నిండిలేదు. పలుచగా వుంది. రంగారావు, రాజు సిగరెట్టు తాగుతూ ఆ ముగ్గురి గురించే మాట్లాడుకుంటూ వస్తున్నారు. కూనిరాగాలు తీస్తూ యెవడో రోడ్డుమీద తూలుకుంటూ నడుస్తున్నాడు. ఏదో హిందీ సినిమాలో పాట.

అతను బాగా తాగినట్టున్నాడు. అడుగులు తడబడుతున్నాయి.

నవ్వుకున్నాడు రంగారావు. తాగినవాడు పాటలు రాకపోయినా ఏదో ఒకటి పాడుతాడు.

సైకిలు వాడిని దాటిపోయింది.

సిగరెట్టు విసిరేసి వెనక్కుతిరిగి వాడిని చూశాడు రాజు.

"సైకిలు ఆపు రంగా" అన్నాడు వెంటనే.

ఆపాడు రంగారావు.

ఇద్దరూ సైకిలు దిగారు.

వాడు వాళ్ళదగ్గరకు వచ్చాడు.

"దొరికాడు రంగా....ఆ ముగ్గురిలో వీడొకడు" సంతోషంగా అన్నాడు రాజు.

"సరిగ్గా చూడు" అన్నాడు రంగారావు.

"అనుమానం లేదు రంగా. నా గుండెలమీద మోచేతులతో పొడిచాడు" అన్నాడు రాజు.

వాళ్ళిద్దరి మాటలూ విన్నాడు వాడు.

ఒక్క నిమిషం రాజుకేసి చూసి వెంటనే గుర్తుపట్టాడు. "ఒరేయ్ నువ్వు బతికే వున్నావా?" అన్నాడు తూలుతూ.

"అవును చూడు." అంటూ రాజు వాడి గుండెలమీద యెగిరి తన్నాడు.

వాడు వెల్లికితలా పడిపోయాడు పెద్దగా అరిచి.

"నువ్వు చూసుకో ముందు. తర్వాత వీడి అంతు నేను చూస్తాను" అన్నాడు రంగారావు మరో సిగరెట్టు వెలిగించుకుంటూ.

కిందపడిన వాడిని రాజు పైకి లేవదీశాడు. వాడు భయంతో చే బూతులు తిడుతున్నాడు.

వాడి నోటిమీద మరోసారి బలంగా కొట్టాడు రాజు. వాడి నోట్లోనించి నెత్తురు బయటకొచ్చింది. లేవలేని స్థితిలోకి వచ్చాడు. వాడి మొహంమీద కాలి సత్తువకొద్దీ తన్నాడు. విసుగు పుట్టేవరకూ అలా తంతూనే వున్నాడు.

"ఇక నీ ఇష్టం రంగారావ్" అన్నాడు తర్వాత రాజు.

రంగారావు జేబులోనించి కత్తి బయటకు తీశాడు. మూలుగుతున్నాడు వాడు. వాడి మొహమంతా నెత్తు

రతో నిండివుంది.

రంగారావు విసురుగా కత్తిని వాడి భుజంలోకి దింపాడు.

కెవ్వున అరిచాడు వాడు. నెత్తురు పైకి చిమ్మింది.

కత్తిని బయటకులాగి వాడి షర్టుకు తుడిచి మడిచి జేబులో పెట్టుకున్నాడు.

"ఎవరో వస్తున్నారు." అన్నాడు రాజు సైకిలు స్టాండు తీస్తూ.

రంగారావు సైకిలుమీద ఎక్కాడు. వెనుక కూర్చు న్నాడు రాజు.

సైకిలు చీకట్లోకి దూసుకుపోయింది. రోడ్డుపక్కనే పడివున్న వాడికి స్పృహాపోయింది.

## 4

తలుపుమీద యెవరో తడుతుంటే మెలకువ వచ్చింది రాజుకి.

కళ్ళు తెరిచాడు.

టేబిల్ మీద గడియారం కనిపించింది. సమయం ఎనిమిదిన్నర వుతోంది.

బెడ్ మీద రంగారావు నిద్రపోతున్నాడు ముసుగు పెట్టి. రాత్రి రంగారావు, రాజు ప్రశాంతంగా నిద్ర పోయారు. బద్ధకంగా లేచి నిల్చున్నాడు రాజు.

మెల్లగావచ్చి తలుపు తెరిచాడు.

"మీరా!" అన్నాడు ఆశ్చర్యంగా.

"అవును. మీరు ఎక్స్పెక్ట్ చెయ్యలేదనుకుంటాను" నవ్వుతూ అన్నది.

"అవును....రండి" లోపలకు పిల్చాడు.

కుర్చీలో కూర్చుంది వచ్చి.

"ఎలావుంది మీ ఆరోగ్యం?" నవ్వుతూ అడిగింది.

"బాగయ్యింది."

"ఇప్పుడే లేచారా?"

"అవును. ఐదునిమిషాల్లో వస్తాను" అని బాత్ రూమ్ లోకి నడిచాడు రాజు.

పదినిమిషాల తర్వాత స్నానం కూడా ముగించాడు. ఆతను ప్యాంటు, షర్టు వేసుకుని తలదువ్వుకుంటున్నప్పుడు రంగారావు లేచాడు.

అతనికి కస్తూరి కనిపించింది.

"ఎవరీ అమ్మాయి? ఇంతకుముందు చూళ్ళేదు"అన్నాడు.

"నన్ను కొట్టించిన అమ్మాయి, కస్తూరి" చెప్పాడు రాజు. కస్తూరి రంగారావుకు నమస్కారం చేసింది.

"నా ఫ్రెండ్ రంగారావ్."

రంగారావ్ బ్రష్ తీసుకొని బాత్ రూంలోకి నడిచేడు.

"ఇప్పుడు చెప్పండి. ప్రొద్దున్నే ఇలా మా గదికి వచ్చారు?" అడిగాడు రాజు.

"మీరు యెలా వున్నారో చూసిపోదామని వచ్చాను"

"థాంక్స్."

"నో మెన్షన్. అది నా ధర్మం. ఇంకో విషయం.... మిమ్మల్ని మా నాన్న తనదగ్గరకు తీసుకురమ్మని పంపారు నన్ను."

"నన్నా! యెందుకు?"

"మీకు ఆయన ఉద్యోగం ఇస్తాడుట."

"ఉద్యోగమా?"

"అవును. మీరు నిరుద్యోగి కదా! మా నాన్న ఫర్మ్‌లో ఓ క్లర్కు పోస్టుకు ఖాళీ వచ్చిందిట. మీకు ఇష్టమయితే ఆ ఉద్యోగంలో మీరు చేరవచ్చు."

"అయామ్ లక్కీ" అన్నాడు రాజు హుషారుగా.

"మీ ధైర్యమే మీ కిప్పుడు ఉద్యోగాన్నిస్తూంది" నవ్వుతూ అన్నది కస్తూరి.

"కాదు మీరు," అన్నాడు రాజు ఆమె కళ్ళలోకి చూస్తూ. తర్వాత—ఆమెతో బయటకు నడిచాడు.

## 5

వరండాలో కూర్చుని పేపర్ చదువుతున్నాడు శివపాదం.

"నమస్కారం సార్" అన్నాడు రాజు.

"నమస్తే" అన్నాడాయన రాజుకి కుర్చీచూపుతూ.

తండ్రిపక్కనే కూర్చుంది కస్తూరి.

"అమ్మాయి నీకు చెప్పేవుంటుంది."

"అవును సార్."

"క్లర్క్ పోస్టు.... జీతం ఆరొందల పది. బోనస్ కూడ ఇస్తారు. ఇష్టమేనా?"

"ఇష్టమే సార్."

"రేపు ఉదయం సర్టిఫికేట్లతో ఆఫీసుకురా" అని ఎడ్రసు ఇచ్చాడు శివపాదం.

"థాంక్స్ సార్ .... మీ ఋణం తీర్చుకోలేనిది"అన్నాడు రాజు.

"డోన్ట్ మెన్షన్. ఇది ఋణం తీర్చుకునే ప్రయత్నమే అబ్బాయ్. ఎక్కువ మాట్లాడకు"

"అలాగే సార్ ....ఇక నే వెడతాను" లేచి నిల్చుంటూ అన్నాడు.

"ఐదు నిముషాలు ఆగండి" అని లోపలకు వెళ్ళింది కస్తూరి.

"కాళ్ళూ చేతులూ స్వాధీనంలోకి వచ్చాయా" అడిగా డాయన నవ్వుతూ....

"వచ్చాయి సార్"

"అదృష్టవంతుడివి"

"అవును సార్."

"నువ్వు నన్ను బాగా ఆకర్షించావోయ్"

"థాంక్స్ సార్" అన్నాడు రాజు నవ్వుతూ....

ఇంతలోనే కస్తూరి రెండు కప్పులతో హార్లిక్స్ తెచ్చి ఓ కప్పు రాజుకు ఇచ్చింది.

"ఇప్పుడు వద్దు" అన్నాడతను.

"మీకు అవసరమయినప్పుడు నేను ఇవ్వలేను" అన్నది నవ్వుతూ.

"గుడ్ జోక్" అన్నాడు శివపాదం.

హార్లిక్స్ తాగి, మరోసారి వాళ్ళిద్దరికీ థాంక్స్ చెప్పి బయటకు వచ్చాడు రాజు.

అతనికి గాల్లో తేలిపోతున్నట్టుగా వుంది. ఇంత సులభంగా ఆరువందలిచ్చే ఉద్యోగం వస్తుందని కలలోకూడా అనుకోలేదు.

'ఎలాగయినా రంగారావుకు కూడా ఓ ఉద్యోగం చూడాలి' అనుకున్నాడు.

నిజానికి రంగారావుకు ఈ ఉద్యోగం చెయ్యవలసిన అవసరంలేదు. అతనికి తన స్వంత వూళ్ళో కావలసినంత పొలం వుంది. రెండు ఇళ్ళు వున్నాయి. అయినా అతనికి నగరంమీద వ్యామోహం. అందుకే చదువు అయిపోయినా నగరాన్ని విడిచిపెట్టలేదు.

రాజును చూడగానే రంగారావు అరిచాడు.

"ఏమిటి భాయ్? ఏమిటి కథ?" అడిగాడు నవ్వుతూ.

"కథ కాదు. నాకు ఉద్యోగం వచ్చింది. నెలకు ఆరు వందలు."

"నిజమా!"

"అవును. ఈ అమ్మాయి తండ్రి శివపాదం ఇచ్చాడు"

"నువ్వు అదృష్టవంతుడివి"

"అవును...."

"అయితే ఈరోజు నువ్వు నన్ను సినిమాకు తీసుకు వెళ్ళాలి"

"నీ యిష్టం...."

"థాంక్స్"

"ఇవాళ మిగిలిన ఇద్దరిలో ఎవరయినా దొరికితే బావుండు" అన్నాడు రంగారావు.

"రాత్రి వాడు బతుకుతాడంటావా?"

"ఇంతకు ముందే వెళ్ళి చూశాను. వాడు అక్కడ లేడు"

"వాళ్ళలో ఎవరయినా వచ్చి తీసుకెళ్ళారేమో"

"అవును. మిగిలిన ఇద్దర్నీ పొడిస్తేగానీ నా పగ చల్లారదు. రంగారావు స్నేహితుడిని తన్నటానికి ఎన్ని గుండెలు వెధవలకు.... నా సంగతి తెలియజేస్తాను" అన్నాడు కోపంగా రంగారావు.

## 6

స్నేహితులిద్దరూ మొదటి ఆట ఓ హిందీ సినిమాకు వెళ్ళారు.

పిక్చరు చాలా బావుంది. ఇంట్రస్టింగ్ గా వుంది. అయితే చాలా చిన్న సినిమా....

ఇంటర్వెల్ అయింది.

ఇద్దరూ బయటకు వెళ్ళాలని లేచి నిలుచున్నారు. ఇంతలోనే రాజు దృష్టి ముందువరుసలోనించి బయటకు వెళుతున్న ఒకడిమీద పడింది.

వాడు బాగా పొట్టిగా చైనావాడిలా వున్నాడు.

"రంగా....వాడిని చూడు" అన్నాడు గబుక్కున వాడిని చూపుతూ....

చూశాడు రంగారావు....

వాడు గళ్ళ బనీను వేసుకున్నాడు—నల్లగా కాకిలా వున్నాడు.

"ఎవడు వాడు? ఆ ముగ్గుర్లో ఇంకొకడా?" అడిగాడు.

"అవును" అన్నాడు రాజు.

"పద....వాడి వెనుకే వెళదాం"

ఇద్దరూ బయటకు వెళ్ళారు.

వాడు రెండు సమోసాలు తిని, టీ తాగి మళ్ళీ లోపలకు వచ్చాడు.

వాడి వెనుకే రంగారావు—రాజు లోపలకు వచ్చారు. వాడు వాళ్ళిద్దరినీ చూడలేదు.

వాడు కూర్చున్నాడు. వాడి పక్కనే మిగిలినవాళ్ళు కూడా వున్నారేమోనని చూశాడు రాజు. లేరు. సినిమా మళ్ళీ మొదలయ్యింది.

"వాడు మధ్యలో వెళ్ళిపోతాడేమో" అన్నాడు రాజు.

"అందుకే వాడిమీద ఒక కన్ను వేసి వుంచుదాం" అన్నాడు రంగారావు.

సినిమా చూస్తున్నా మధ్య మధ్యలో వాడికేసి చూస్తున్నారు ఇద్దరూ.

సినిమా అయిపోయింది.

జనం గబగబా బయటకు వస్తున్నారు నెట్టుకుంటూ. వాడి వెనుకే ఇద్దరూ బయటకు వచ్చారు.

వాడు స్టాండులోవున్న సైకిలు తీసుకున్నాడు.

రంగారావు తన సైకిలు తీశాడు.

అది నాలుగురోడ్ల కూడలి కావటంవల్ల జనం నాలుగు వైపులకూ చెదిరిపోతూరారు.

వాడు సైకిలుమీద నెమ్మదిగా పోతున్నాడు సిగరెట్టు వెలిగించుకుని.

వాడివెనుకే రంగారావు—రాజు సైకిలుమీద వెళు తున్నారు.

వాళ్ళ ముందునించి రిక్షాలు, ఆటోలు రివ్వున వెళు తున్నాయి.

వాడు సైకిలు వేగం పెంచకుండా అలాగే తొక్కు తున్నాడు. రంగారావుకు విసుగ్గా వుంది.

వాడు వున్నట్టుండి ఓ చీకటి సందులోకి మళ్ళాడు.

"మన అదృష్టం పండింది" అన్నాడు రంగారావు.

"ఎందుకు?" రాజు అడిగాడు.

"వాడు పల్లంలోకి వెళుతున్నాడు దగ్గర దారి అని"

రాజు మాట్లాడలేదు.

వాడు సందు చివరకు వెళ్ళి పల్లంలోకి సైకిల్ని పోనిచ్చాడు. ఇక ఆ పయిన చాలా దూరంవరకు ఇళ్ళు లేవు. అంతా చీకటి. గాఢాంధకారం....

వాడి సైకిలు కిర్రుమని చప్పుడు చేస్తోంది.

రివ్వున సైకిలును ముందుకు పోనిచ్చి వాడి సైకిలుకు తగిలించాడు రంగారావు.

అప్పటికే రాజు కిందకు దూకాడు.

వాడు కిందపడ్డాడు. వాడు లేవకముందే రాజువాడి తలమీద బూటుకాలితో గట్టిగా తన్నాడు.

"ఎవర్రా నువ్వు?" అన్నాడు వాడు గట్టిగా....

"ఏరా హీరోనిరా....ముగ్గురు కలిసి ఒక్కడిని కొడ తార్రా....ఇప్పుడు రారా...." అన్నాడు మళ్ళీ తన్ని....

"సువ్వా....నిన్ను బతకనివ్వడం తప్పయింది....ఇప్పుడు చంపుతాను" అంటూ వాడు ఎగిరి నిలబడ్డాడు.

అప్పటికే బెల్టు బయటకు తీసి నిలబడ్డాడు రాజు. వాడు కొంచెం ముందుకు రాగానే ఈడ్చి బెల్టుతో మొహంమీద చరిచాడు.

"చచ్చాన్రోయ్" కేక పెట్టాడు వాడు.

"ఇంకా చావలేదురా" అని మరోసారి వీపుమీద చరిచాడు. అతనికి గుండె మండుతోంది. ఆ రోజు రాత్రి ఒక్కడిని ముగ్గురు కలిసి దయలేకుండా నెత్తురు కారినంత వరకూ కొట్టారు.

వీడిని అంత సులభంగా వదలకూడదు.

మరోసారి కొట్టాడు. బెల్టు వాడి వంటిమీద వాతలను పెడుతోంది. వాడు నిలవలేక కిందపడ్డాడు. కింద పడి కూడా 'నిన్ను చంపుతాను' అని అరుస్తున్నాడు.... వాడలా అరచినకొద్దీ మరింతగా కొడుతున్నాడు రాజు.

వాడికి వంటిమీద నెత్తురు చిమ్మింది.

"ఇక నీ వంతు" అన్నాడు రాజు-రంగారావుతో....

రంగారావు జేబులోనించి కత్తిని బయటకు తీసాడు. దాన్ని వొంగి బలంగా వాడి భుజంలో గుచ్చాడు.

పెద్దగా అరిచాడు వాడు ప్రాణం పోతున్నట్టు.

కత్తిని వాడి బనీనుకు తుడిచి మడిచి జేబులో పెట్టుకున్నాడు.

తర్వాత ఇద్దరూ సైకిల్ని ఆ పల్లంలో నడిపించుకుంటూ చీకట్లో కలిసిపోయారు.

'పని చాలా తక్కువ' అనుకున్నాడు రాజు. అతను ఆ రోజునే ఉద్యోగంలో జాయినయ్యాడు.

అతను చేరగానే తోటి ఉద్యోగులు రాజును పార్టీ ఇవ్వమన్నారు.

సంతోషంగా పార్టీ ఇచ్చాడు రాజు. వాళ్ళంతా అతనికి థాంక్స్ చెప్పారు. అతనికి మంచి స్నేహితులయినారు. సాయంత్రం అయిదయింది.

అప్పటికే అందరూ ఫైల్సు మూసేసి ఆఫీసు వదలటానికి సిద్ధంగా వున్నారు.

రాజు ఎప్పుడో రెడీ అయ్యాడు. అతని పని మూడు గంటలకే అయిపోయింది.

ఐదు గంటలు దాటిన తర్వాత బయటకు వచ్చాడు రాజు.

ఒంటరిగానే సిగరెట్టు వెలిగిస్తూ కొంత దూరం నడిచాడు. బస్టాపు కనిపించింది. అక్కడ చలామంది మనుషులు నిలబడి వున్నారు.

తనుకూడా వాళ్ళదగ్గరగా నిలబడ్డాడు. అప్పుడే ఏదో బస్సు వచ్చి ఆగింది.

అందులోనించి కస్తూరి దిగింది. రాజు ఆమె కేసి ఆశ్చర్యంగా చూశాడు. ఆమె చేతిలో బుక్స్ వున్నాయి.

"హల్లో రాజుగారూ" అన్నది అతన్ని చూడగానే.

అతను నవ్వాడు.

"కాలేజీనించా?"

"అవును" అన్నది.

"ఇక్కడికెందుకు వచ్చారు? పనివుందా?" అడిగాడు

రాజు.

"మీ కోసమే వచ్చాను" అన్నది కస్తూరి.

"నాకోసమా!"

"అవును" అంటూ పార్కు వైపు దారితీసింది.

అక్కడికి పార్కు చాలా దగ్గర్లో వుంది.

నడుస్తూండగా "ఎలా వుంది మీ ఉద్యోగం?" అన్నదా అమ్మాయి కస్తూరి అతని కళ్ళల్లోకి చూడకుండా-ఎటో చూస్తూ.

"నా కంతా అయోమయంగా వుంది" అన్నాడు రాజు.

"ఉద్యోగమా"

"కాదు. మీ ప్రవర్తన"

"చెబుతాను. ముందు పార్కులోకి వెళ్ళనివ్వండి"

పార్కులో బోగన్‌విల్లా చెట్టు పక్కనే కూర్చున్నారు.

"ఇప్పుడు చెబుతాను" అన్నది కస్తూరి.

"చెప్పండి" అన్నాడు రాజు సగరెట్టు వెలిగిస్తూ....

"నేనే మీకు ఉద్యోగం ఇవ్వమని నాన్నతో చెప్పాను. నాన్న నామాట కాదనడు. నాకు అమ్మలేదు. అందుకే నాన్న నాకోసం ఏమయినా చేస్తాడు."

"ఇదంతా నాకు ఎందుకు చెబుతున్నారు?"

"నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను రాజూ"

రాజు ఆశ్చర్యపోలేదు అంతగా....కస్తూరి ప్రవర్తన అతనికి కొంతవరకూ అర్థమవుతూనే వుంది.

"నువ్వు నాకు బాగా దగ్గరయ్యావు కస్తూరీ" అన్నాడు రాజు ఆమె చేతిని గట్టిగా నొక్కుతూ.

"రాజూ.... మైడియర్" అన్నది కస్తూరి చిన్నగా....

అప్పటికే చీకటిపడింది.

రాజు ముందుకు వొంగి ఆమె బుగ్గలమీద సున్నితంగా ముద్దు పెట్టుకున్నాడు.

కస్తూరి ఓ విధమయిన మైకంతో చిన్నగా వణికింది.

తలెత్తాడు రాజు. అతనికి దూరంగా నిలబడిన ఓ మనిషి కనిపించాడు. అతన్ని చూడటంతోటే గుర్తించాడు రాజు.

వాడు ఆ ముగ్గురిలో మూడోవాడు.

రాజుకు ఏం చెయ్యాలో అర్థంకాలేదు. ఇప్పుడు వాడేదయినా చేస్తే....తను ప్రతిఘటిస్తాడు. కాని తనకేమయినా జరిగితే....కస్తూరి వాడి చేతిలో చిక్కుతుంది.

"ఏమిటలా అయిపోయావ్ రాజూ" అన్నది కస్తూరి.

"ఏమీ లేదు....చీకటి పడింది ఇక వెడదాం" అన్నాడు.

అయిష్టంగానే నిలబడింది కస్తూరి.

పార్కులోనించి బయటకు వచ్చారు. బయటకు రాగానే వాడికోసం చూశాడు రాజు. కాని వాడు ఎక్కడా కనిపించలేదు.

"నిన్ను ఇంటిదగ్గర డ్రాప్ చేసి నేను గదికి వెళతాను" సరేనన్నది కస్తూరి.

ఆటోలో బయల్దేరారు.

పది నిముషాల తర్వాత కస్తూరి ఇంటి ముందాగింది ఆటో. "మళ్ళీ రేపు" అన్నది కస్తూరి.

"గుడ్ నైట్" అన్నాడు రాజు. కస్తూరి చెయ్యి వూపింది.

ఆటో ముందుకు కదిలింది.

రాజు ఆ మూడోవాడి గురించే ఆలోచిస్తున్నాడు. వాడు తనని ఎందుకు వదిలాడు. ఏదయినా ప్లాను వేస్తు

న్నాడో. ఆలోచిస్తుండగానే ఆటో గది ముందాగింది. దిగి ఫేర్ చెల్లించాడు. ఆటో వెళ్ళిపోయింది.

రాజు లోపలకు వెళ్ళగానే అతని గదిముందు ఓ. ఆటో దూసుకుపోయింది. ఆ ఆటోలో కూర్చున్న ఆ మూడోవాడు రాజు గదికేసి చూసి కసిగా నవ్వాడు.

# 8

రాత్రి పదకొండు గంటలవరకూ రాజు—రంగారావూ కబుర్లు చెప్పుకున్నారు.

రాజు - రంగారావుతో ఆ రోజు సాయంత్రం జరిగిన దంతా చెప్పాడు.

"నువ్వో అదృష్టవంతుడివి రాజూ" అన్నాడు రంగా రావు.

చివరికి పార్కులో కస్తూరితో మాట్లాడుతున్నప్పుడు దూరంగా ఆ మూడోవాడు కనిపించిన విషయంకూడా చెప్పాడు రాజు.

"వాడిని ఎందుకు వదిలావ్?" అన్నాడు రంగారావు.

"ఏం చేసేది? పక్కనే కస్తూరి వుంది. పెద్ద గొడవవు తుంది. కస్తూరి భయపడుతుంది. అందుకే వాడిని వదిలే శాను."

"పోన్లే ఎప్పుడో ఒకప్పుడు దొరక్కపోడు. ఈసారి కనిపిస్తే వాడిని వదలొద్దు" అన్నాడు రంగారావు.

"అలాగే" అన్నాడు రాజు.

ఆ తర్వాత ఇద్దరూ మాట్లాడుకోలేదు.

రాజు - కస్తూరిగురించిన కలలుకంటూ నిద్రలోకి జారు కున్నాడు.

రాత్రి ఒంటిగంట దాటింది.

రాజు - రంగారావు నిద్రపోతున్నారు గాఢంగా....

బయట తలుపుమీద ఎవరో గబగబా తట్టారు.

ఇద్దరిలో ఎవ్వరికీ మెలకువ రాలేదు.

రాజుది మొద్దు నిద్ర. అతనికి అంత సులభంగా మెలు కువ రాదు.

రంగారావుకే మెలుకువ వచ్చింది.

"ఎవరు?" అన్నాడు పక్కమీదనించి లేవకుండానే.

"టెలిగ్రాం"

అతని బధకం వదిలిపోయింది. లేచి లైటు వేశాడు. తర్వాత తలుపు తెరిచాడు. బయటకు వెళ్ళాడు.

బయట ఎవ్వరూ కనిపించలేదు.

రంగారావుకు ఆశ్చర్యం కలిగింది. కలకాదు. నిజం గానే ఎవరో టెలిగ్రాం అన్నారు.

మరి ఎవరూ కనిపించరేం?

రంగారావు మనసులో ఏదో అనుమానం పొడ సూపింది. అతను వెంటనే వెనక్కు తిరగబోయాడు. కాని అప్పటికే ఆలస్యమయింది.

ఇద్దరు చీకట్లోనించి అతనిమీద పడి గట్టిగా పట్టు కున్నారు. గింజుకున్నాడు. కాని వాళ్ళు వదల్లేదు.

అతను అరవబోయాడు. నోరు నొక్కేశారు.

అతని గుండెల్లోకి బలంగా కత్తి దిగింది. నెత్తురు బయటకు చిమ్మింది.

ఆ తర్వాత అతన్ని కసిదీరా చాలాసార్లు పొడిచారు. రంగారావు చచ్చిపోయాడు. కుప్పలా కూలిపోయాడు. వాళ్ళు చీకట్లో కలిసిపోయారు.

నెత్తురు మడుగు కడుతోంది.

రాజు గాఢనిద్రలో వున్నాడు.

గది తలుపులు తెరిచే వున్నాయి.

రంగారావు శవం వికృతంగా వుంది.

# 9

తెల్లారి పోలీసులొచ్చారు.

రాజు ఏడ్చాడు. గుండెలు పగిలేలా ఏడ్చాడు. అతనిలో ఓ విధమయిన పిరికితనం చోటుచేసుకుంది.

జరిగిందంతా పోలీసులకు చెప్పాడు రాజు.

మొత్తం పన్నెండు పోట్లు. గుండెనిండా చిల్లులు పడ్డాయి. నెత్తురు మయమయిపోయింది రంగారావు శవం.

వేలిముద్రలు దొరకలేదు.

హత్య విషయం శివపాదానికి తెలిసింది. ఆయనా, కస్తూరి వచ్చారు.

రాజు యేడవటం చూసి ఇద్దరూ చలించిపోయారు. రంగారావు తనకు ఎలాంటి స్నేహితుడో ఎన్నోసార్లు వాళ్ళతో చెప్పాడు రాజు.

కస్తూరి అతన్ని ఓదార్చింది. అయినా రాజు దుఃఖం తీరలేదు. వాళ్ళు తనమీదవున్న కసిని రంగారావుమీద చూపించారు.

రాత్రి అసలు ఏం జరిగిందో? రంగారావు ఎందుకు బయటకు వెళ్ళాడో? బహుశ, వాళ్ళు తలుపులు తట్టి వుండవచ్చు.

తను బయటకు వెళ్ళినట్లయితే? తననే చంపేవాళ్ళు. మైగాడ్! రంగారావు తనకోసం బలయిపోయాడు. రంగారావు—ఎంత మంచి స్నేహితుడు? తనకు కొండంత బలం.

తను రంగారావు తోడుచూసే ధయిర్యంగా తిరుగు

తున్నది. ఎంతోమంది రంగారావుకు భయపడే తన జోలికి రాకుండా వున్నది.

ఇప్పుడు వాళ్ళందరికీ తనమీద చులకన కలుగుతుంది.

పోలీసులు రాజును చాలా ప్రశ్నలు అడిగారు.

రాజు అన్నింటికీ సరయిన జవాబులు ఇవ్వలేదు. తను, రంగారావు ఆ ఇద్దరినీ చీకట్లో కొట్టి కత్తితో పొడిచిన విషయం చెప్పలేదు.

పోలీసులతోపాటు రాజు స్టేషన్‌కు వెళ్ళాడు. అక్కడ రిపోర్టు ఇచ్చాడు.

తననికూడా వాళ్ళు పొడిచి చంపవచ్చునే భయాన్ని పోలీసులముందు వ్యక్తం చేశాడు. పోలీసులు అతన్ని భయపడవద్దని చెప్పారు.

రాజుకి ఆ ముగ్గురిమీద అంతులేని కసి ఏర్పడింది. దొరికితే ముగ్గురినీ చంపాలన్నంత ఆవేశం వచ్చింది. కాని తను వాళ్ళంత దుర్మార్గుడు కాదు. తను హత్యలు చెయ్యలేడు. రంగారావు పోవడంతో తనలోవున్న ధైర్యం పోయింది.

తనకేదయినా అయితే? కస్తూరి భరించగలదా? ఇప్పుడు తను కస్తూరి కోసమయినా జాగ్రత్తగా వుండాలి. రాజు ఎలాగో మనసును దిటవుపరుచుకున్నాడు.

పదిరోజులు గడిచాయి.

రాజు ఎంతో జాగ్రత్తగా ఆఫీసుకు వెళ్ళి వస్తున్నాడు. రోజూ కస్తూరిని కలుస్తూనే వున్నాడు. కస్తూరి మాటలు అతన్ని వూరడిస్తున్నాయి. కస్తూరి ప్రేమ అతడి దుఃఖాన్ని మరిపింప చేస్తోంది.

ఆ గదిలో వుండలేకపోయాడు రాజు. అతడికి ఆ గదిలో వున్నంతసేపూ రంగారావే గుర్తుకొస్తున్నాడు. భరించలేకపోయాడు.

రంగారావు తనకు ప్రాణమిచ్చేవాడు. తనకోసం చచ్చిపోయాడు. రంగారావు స్నేహం తనకు లేకుండా పోయింది. అది తనకు తీరని లోటు....

రాజుకు చాలాసార్లు ఏడుపు వచ్చింది. నిద్రపట్టేది కాదు.

రాజు బాగా చిక్కిపోయాడు. కళ్ళు లోపలకు పోయాయి. కస్తూరి అతడిలో మార్పును సులభంగానే గ్రహించింది.

"నువ్వు ఈ గదిని మార్చెయ్యి రాజూ" అన్నది.

"నాకూ అలాగే అనిపిస్తోంది" అన్నాడు రాజు.

"మా ఇంటి పక్కనే మేడమీద ఓ గది ఖాళీ అయింది. అందులో వచ్చి చేరు" అన్నది.

ఒప్పుకున్నాడు రాజు. ఆ రోజునే ఆ గదిని ఖాళీచేసి కొత్తగదిలోకి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి రాజు - శివపాదం ఇంట్లో భోజనం చేశాడు. పొద్దుపోయేవరకూ శివపాదం—కస్తూరి—రాజు కబుర్లు చెప్పుకున్నారు. తర్వాత రాజుకు నిద్ర ముంచుకొచ్చింది. తన గదికి వెళ్ళిపోయాడు.

పక్కమీద పడుకున్నాడు గానీ నిద్రపట్టలేదు. కళ్ళ ముందు వికృతంగా వున్న రంగారావు శవమే కనిపిస్తోంది. వాళ్లు ముగ్గురూ తననికూడా అలాగే పొడిచి చంపుతారా? తనకి వాళ్ళ పేర్లుకూడా తెలీదు అనుకున్నాడు రాజు.

వాళ్ళ పేర్లు దాసు—రాజన్—సుందరం.

# 10

సిగరెట్టు దమ్ము కొడుతున్నాడు దాసు. అతడి కళ్ళు వీధిదీపం కింద నిలబడిన ఆమె మీదే వున్నాయి.

ఆమె వొంటరిగా అక్కడ నిలబడి వుంది.

అయిదు నిముషాల క్రితం దాసు ఆమెను చూశాడు. చూడగానే ఆమె ఎటువంటిమనిషో చూద్దామని అనిపించి అక్కడే నిలబడి పరిశీలిస్తున్నాడు.

మరో ఐదు నిమిషాలు గడిచాయి.

అప్పటికే వీధిలో రద్దీ తగ్గిపోయింది. బస్టాపుకు కొంచెం దూరంలో నిలబడింది ఆమె.

అప్పుడప్పుడు బస్సులు తిరుగుతున్నాయి.

బాగా చలిగా వుంది. జేబులో చేతులు పెట్టుకున్నాడు దాసు. అతని నోట్లో సిగరెట్టు ఎర్రగా వెలుగుతోంది. దాసు తనని గమనించటం చూసిందామె. ఒక్కసారి వొళ్ళు విరుచుకుంది.

నవ్వుకున్నాడు దాసు. చేతిలో సిగరెట్టును విసిరేశాడు. గబగబా ఆమె దగ్గరకు నడిచి పక్కనే నిలబడ్డాడు.

ఒక్కసారి ఆమె దాసును చూసింది. నల్లగా వున్నాడు దాసు. ఆమెకూడా నల్లగానే వుంది. పుష్టిగా, బలంగా వుంది.

"నీ పేరేమిటి?" అడిగాడు దాసు.

"పేరుతో పనేమిటి?" అన్నది.

"ఎంత?" అన్నాడు నవ్వుతూ....

"నువ్వు ఇవ్వగలిగినంత."

"రూపాయిస్తాను. వస్తావా?"

నవ్విందామె.... "పద వెడదాం" అన్నది తర్వాత. అలా అన్నవాళ్ళే తర్వాత పాతికో, ముప్పయ్యో ఇస్తారని ఆమెకు తెలుసు.

"గది వుందా నీకు?" అడిగాడు దాసు.

"వుంది. కాని దూరం....నీ గది వుంటే వెళదాం"

"పద" అన్నాడు దాసు ముందుకు కదిలి.

"రిక్షాలో వెళదాం"

దూరంగా వస్తోంది రిక్షా. దగ్గరకు రాగానే దాన్ని ఆపాడు. ఎక్కారు. ఎడ్రసు చెప్పాడు.

రిక్షావాడు సన్నగా, బలహీనంగా వున్నాడు. నెమ్మదిగా తొక్కుతున్నాడు. బరువుగా పోతోంది రిక్షా.

రిక్షా మెయిన్‌రోడ్డుమీదకు మళ్ళింది.

దుకాణాలు చాలావరకు మూసివున్నాయి. రోడ్డు పక్కనే బండ్లమీద పళ్ళు అమ్మేవాళ్ళు గట్టిగా అరుస్తున్నారు.

దాసు రిక్షా దిగి నాలుగు ఆపిల్‌పండ్లు కొన్నాడు.

"బావున్నాయి" అన్నదామె.

"మనిద్దరికీ" అంటూ నవ్వాడు దాసు.

పావుగంట తర్వాత రిక్షా దాసు గదిముందు ఆగింది. దిగారు. డబ్బులిచ్చాడు దాసు రిక్షావాడికి.

పండ్లు ఆమె పట్టుకుంది. దాసు తలుపులు తెరిచాడు. లోపలకు వెళ్ళారు.

"చాలా చిన్న గది" అన్నదామె లైటువేసిన తర్వాత గదిని చూసి.

"దీనికే ఎనభై రూపాయలు కిరాయి" అన్నాడతను తలుపులు మూస్తూ....

దాసుకు ఎవ్వరూ లేరు. అతనికి స్నేహితులే వున్నారు. అతను చిన్నచిన్న దొంగతనాలు చేస్తాడు. ఇంతవరకూ ఒక్కసారికూడా పోలీసులకు దొరకలేదు. అది అతని అదృష్టం.

దాసు లుంగీ కట్టుకున్నాడు.

ఆమె బెడ్‌మీద కూర్చుంది.

"నువ్వేం చేస్తుంటావ్?" అని అడిగింది అతన్ని....

"నీలాంటి వాళ్ళను రాత్రిపూట గదికి తెస్తూ వుంటాను"

"పగటిపూట"

"నిద్రపోతాను" అన్నాడు నవ్వుతూ....

"గట్టివాడివే"

"నీకే తెలుస్తుంది" అంటూ నవ్వాడు.

ఆమెకూడా నవ్వింది.

"లైటు తియ్యనా" అన్నాడతను.

"నీ యిష్టం"

"అయితే వొద్దు" అన్నాడు టేబిల్ సొరుగులోనించి కత్తిని బయటకు తీస్తూ.

"కత్తి ఎందుకు?" అడిగిందామె.

"భయపడకు .... పండ్లు కొయ్యటానికి" అన్నాడు ఆమె పక్కనే కూర్చుని నవ్వుతూ.

"ఇప్పుడు చెప్పు నీ పేరేమిటి?" అడిగాడు దాసు.

"రాజేశ్వరి" ముక్కలు తింటూ చెప్పింది.

"తగిన పేరు" అన్నాడు కాయను అందుకుంటూ.... ఉన్నట్టుండి దాసు చేతిలో కత్తి కిందపడింది. దాన్ని వొంగి తీసుకోబోయాడు అతడు.

అతను చూస్తుండగానే కత్తి గాలిలో పైకి లేచింది. దాసుకు ఆశ్చర్యం కలిగింది. తర్వాత భయం పుట్టింది. కళ్లు పెద్దవి చేసి చూస్తున్నాడు.

ఆమెకూడా ఆశ్చర్యంగా గాలిలో తేలుతున్న కత్తినే చూస్తోంది.

ఇద్దరూ చూస్తుండగానే కత్తి కొంచెం కిందికి దిగింది. దాసు దాన్ని అందుకోబోయాడు.

కాని అది విసురుగా వచ్చి అతని గుండెల్లో దిగబడింది. కెవ్వున అరిచాడు దాసు.... నెత్తురు బయటకు చూకింది.

ఆమెకూడా పెద్ద కేక పెట్టింది భయంగా....

మరోసారి కత్తి బయటకు వచ్చి అతని గుండెల్లోకి దూసుకుపోయింది. నిర్జీవంగా వెనక్కి పడిపోయాడు దాసు. పక్కంతా నెత్తురుతో తడిసిపోయింది.

రెండు నిముషాలకు ఆమె షాక్ నించి తేరుకుంది. అంతే. వెంటనే గది తలుపులు తెరుచుకుని రోడ్డుమీదకు పరుగుదీసింది.

# 11

ఉదయం - తొమ్మిది గంటలు కావస్తోంది. స్నానం చేసి బట్టలేసుకుని తల దువ్వుకుంటున్నాడు రాజు. అతని గదిముందు పోలీసు జీపు ఆగింది. అందులోనించి ఇన్ స్పెక్టర్ దిగాడు.

అద్దంలో ఇన్ స్పెక్టర్ తన గదిలోకి రావటంచూసి వెనక్కి తిరిగాడు రాజు.

"హల్లో రాజూ....ఎలా వున్నావ్?" అడిగాడు ఇన్ స్పెక్టర్ నవ్వుతూ....

"బాగానే వున్నాను సార్"

"మొత్తానికి నీ పగ తీర్చుకున్నావుగా"

"పగా!"

"అవును ఆ ముగ్గురిలో ఒకడిని పొడిచేశావుగదా!"

"ఎవడ్ని సార్"

ఇంతలోనే అక్కడకు శివపాదం వచ్చాడు "ఏమిటి ఇన్ స్పెక్టర్" అంటూ....

రాత్రి జరిగిన దాసు హత్యగురించి చెప్పాడు ఇన్ స్పెక్టర్.

"ఆశ్చర్యంగా వుంది" అన్నాడు శివపాదం.

"రాత్రి నువ్వు ఎక్కడ వున్నావ్?"

"గదిలోనే వున్నాను" చెప్పాడు రాజు.

"సాక్ష్యం వుందా?"

"రాత్రి పన్నెండు గంటలు దాటేవరకూ నేను, రాజు, మా అమ్మాయి కస్తూరి మా ఇంట్లోనే మాట్లాడుకుంటూ కూర్చున్నాము" చెప్పాడు శివపాదం.

"ఆశ్చర్యంగా వుంది" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"అసలు అతను రాజుకు శత్రువో కాదో" అన్నాడు శివపాదం.

"నిజమే. ముందు ఆ విషయం తేల్చుకోవాలి. కాని రాజు ఇంతకుముందు చెప్పిన గుర్తులను బట్టి అతనే. అయినా నువ్వు ఒకసారి మాతో రా" అన్నాడు రాజుతో.

గదికి తాళం పెట్టాడు రాజు.

శివపాదంకూడా ఇంటికి తాళం పెట్టి వచ్చాడు. కస్తూరి ఇంట్లో లేదు. ఎర్లీగానే కాలేజీకి వెళ్ళిపోయింది.

జీపు బయల్దేరింది. ఇరవై నిమిషాల తర్వాత దాసు ఇంటిముందు ఆగింది.

గబగబా కిందకు దిగాడు రాజు. అక్కడ పోలీసులూ డాక్టరూ వున్నారు.

శవాన్ని చూశాడు. అతనికి ఆశ్చర్యం కలిగింది.

"అవును. ఇతను ఆ ముగ్గురలో వాడే" అన్నాడు రాజు.

"డాక్టర్....హత్య ఎన్ని గంటలకు జరిగివుంటుంది" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"రాత్రి పదిన్నర పదకొండు గంటలమధ్య జరిగి వుండొచ్చు."

"ఆ సమయంలో రాజు మాతోనే వున్నాడు ఇన్‌స్పెక్టర్" అన్నాడు శివపాదం.

నవ్వాడు ఇన్‌స్పెక్టర్.

"ఎలాగయినా హంతకుడిని పట్టుకొంటాం రాజూ.... ఇక మీరు వెళ్ళొచ్చు" అన్నాడు.

శివపాదం, రాజు ఆటోలో ఆఫీసుకి బయల్దేరారు టైము కావడంవల్ల.

"అతన్ని ఎవరు చంపారో అర్థంకావడంలేదు" అన్నాడు రాజు.

"అతనికి ఇంకెవరయినా శత్రువులు వున్నారేమో" అన్నాడు శివపాదం.

"అయివుండవచ్చు" అన్నాడు రాజు ఆలోచిస్తూనే.

ఆ రోజు రాజు ఆఫీసులో వర్కు చెయ్యలేక పోయాడు. అతని మనసంతా అదోలా అయిపోయింది. పోలీసులకు తనమీద అనుమానం వచ్చింది. బలవంతాన ఏవో లెక్కలు చూస్తున్నాడు రాజు. చూస్తూ మధ్యలో సిగరెట్టు వెలిగించుకోవటానికి పెన్‌ని పక్కనపెట్టి షర్టు జేబులోనించి సిగరెట్టు పెట్టె బయటకుతీసి వెలిగించుకున్నాడు.

ఇంతలోనే అతని పెన్ను పైకి లేచింది. ఆశ్చర్యంగా చూశాడు రాజు.

పక్కనేవున్న కాయితంమీద గబగబా రాసుకుంటూ పోయింది.

రాజుకి మతిపోయినంత పనయ్యింది ఆ అక్షరాలను చదువుతుంటే. నిమిషం తర్వాత పెన్ను ఆగిపోయింది.

'రాజూ—ఆ ముగ్గురూ నిన్నుకూడా చంపాలనుకున్నారు. అందుకే వాళ్ళలో ఒకడిని రాత్రి చంపాను. మిగిలిన ఇద్దర్నీకూడా చంపుతాను. నువ్వేం భయపడకు— నేనున్నాను—రంగారావు—'

మరోసారి ఆ అక్షరాలను చదివాడు రాజు. అతనికి నమ్మశక్యంకాలేదు. అది రంగారావు దస్తూరి.

అతని కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయినాయి. గబగబా ఆ కాయితాన్ని తీసుకుని శివపాదం గదిలోకి వెళ్ళాడు. దాన్ని చూపించి జరిగింది చెప్పాడు.

శివపాదం నమ్మలేకపోయాడు....

"రియల్లీ వండర్! చనిపోయిన మనిషి ఇలా రాశాడంటే" అన్నాశు.

"అవును సార్....ఇది నా కళ్ళెదుటే జరిగింది" అన్నాడు రాజు.

అతనికి ఎంతో సంతోషంగా వుంది. చచ్చిపోయినా రంగారావు తనని రక్షిస్తున్నాడన్నమాట. 'రంగారావ్! స్నేహితుడంటే నువ్వే....నిన్ను పోగొట్టుకోవటం నిజంగా నా దురదృష్టం' అనుకున్నాడు రాజు.

"ఈ కాయితాన్ని మనం పోలీసులకు చూపటం మంచిది" అన్నాడు శివపాదం.

"అలాగే" అన్నాడు రాజు.

సాయంత్రం అయిదు కాగానే శివపాదం, రాజు పోలీస్ స్టేషన్‌కి వెళ్ళి ఆ కాయితాన్ని చూపించి జరిగింది చెప్పారు.

ఇన్‌స్పెక్టర్ నమ్మలేదు.

"కావాలంటే రంగారావు దస్తూరి వున్న పుస్తకాలు వున్నాయి, పోల్చి చూసుకోండి" అన్నాడు రాజు.

"అవసరంలేదు. మేము ఈ విషయాన్ని నమ్మటంలేదు. మీరు వెళ్ళిరండి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

మాట్లాడకుండా బయటకు వచ్చారు రాజు-శివపాదం.

"నిజమే....ఇలా జరిగిందంటే ఎవ్వరూ నమ్మరు"

అన్నాడు శివపాదం గోడ్డుమీద నడుస్తూ.

"నేనుకూడా నమ్మేవాడిని కాదు. కాని ఇది నా కళ్ళ ఎదురుగా జరిగింది. నమ్మకుండా ఎలావుంటాను" అన్నాడు రాజు.

ఇద్దరూ ఇంటికి వెళ్ళేసరికి కస్తూరి కాలేజీనించి వచ్చి వున్నది. ఆమె ఈ విషయాలన్నీ విన్న తర్వాత ఆశ్చర్య పోయింది.

"ఇలా జరిగే అవకాశం వుందా?" అని అడిగింది.

"ఏమో....అయితే ఇంతకుముందు నేను ఇలాంటి వింతలు జరిగినట్లు విన్నాను" అన్నాడు శివపాదం.

"నేను విన్లేదు" అన్నది కస్తూరి....

రాజు మాట్లాడలేదు. ఆ రాత్రి రాజు వాళ్ళతోటే కలిసి భోజనం చేశాడు. తర్వాత ముగ్గురూ రెండో ఆట ఓ ఇంగ్లీషు సినిమాకు వెళ్ళారు.

## 12

"నా దగ్గర డబ్బులు అయిపోయాయి" అన్నాడు రాజన్.

"అప్పులేదు గురూ" అన్నాడు పేకాట ఆడుతున్న నలుగురిలో ఒకడు.

"ఎవరయినా పాతిక రూపాయలు అప్పుగా ఇస్తారా? రేపు ఇస్తాను" అన్నాడు....

"సారీ....గురూ...." అన్నారు వాళ్ళు.

"సరే.... వెళ్ళొస్తా" అని నిలబడ్డాడు రాజన్.

"జాగ్రత్తగా వెళ్ళు గురూ....దాసుగాడ్ని పాడిచేసి నట్లు నిన్నుకూడా పాడుస్తారేమో" అన్నాడు ఒకడు.

"నన్నెవడురా పాడిచేది. ఇంతవరకూ పుట్టలేదు" అన్నాడు రాజన్. అతను మిగిలిన ఇద్దరిలాగా రాజుకీ,

రంగారావుకీ దొరకలేదు.

రోడ్డు చీకటిగా వుంది.

అది అసలే మురికి పేట యేరియా....అన్నీ కాలువలు-చిన్న చిన్న పాకలు.

బీడీ వెలిగించాడు. అగ్గిపుల్లను దూరంగా విసిరేశాడు.

ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తున్నాయి.

ఓ మురికి కాలువ వెంబడే నడుస్తున్నాడు రాజన్. అతనికి మనసులో భయంగా వుంది తనని పోలీసులు పట్టుకుంటారేమోనని.

పోలీసులు తమకోసం వెతుకుతున్నట్టు అతనికి తెలుసు. అందుకే జాగ్రత్తగా తిరుగుతున్నాడు.

ఒకచోట కుక్క అరిచింది పెద్దగా....

"ఛస్" అరిచాడు రాజన్ విసుగ్గా....

చలిగా వుంది. మురికి కాలువలోనించి కంపుకొడుతోంది. అక్కడవున్న పాకలు విసిరేసిన మట్టిముద్దలా వున్నాయి.

చచ్చిపోయిన దాసు గురించే ఆలోచిస్తూ నడుస్తున్నాడు రాజన్.

కొంచెం దూరంలో రైలుపట్టాలు. పట్టాలకు దూరంలో ఎక్కడో వుంది రైలుగేటు.

రైలు కట్ట ఎక్కాడు రాజన్. రెండు పట్టాలకు మధ్యకు వచ్చి ఆగిపోయాడు. దూరంగా చీకట్లోకి చూశాడు. రైలు వస్తోంది. కాంతి కదలకుండా ముందుకు దూసుకు వస్తోంది.

ముందుకు కదలబోయాడు రాజన్

కాని కదల్లేకపోయాడు. ఎవరో గట్టిగా పట్టుకున్నట్టు

అనిపించింది. ఎంతో ప్రయత్నం చేశాడు. కాని కొంచెం కూడా కదలేకపోయాడు.

రాజన్‌కు ఆశ్చర్యం వేసింది. ఎవరో పట్టుకున్నారు తనని. గట్టిగా విదిలించాడు. అయినా అక్కడినించి కదలేకపోయాడు.

రైలు దగ్గరకు వచ్చింది.

అరిచాడు రాజన్ భయంతో.

అతని కేక రైలు చప్పుడుతో ఎవ్వరికీ వినిపించలేదు.

అతనిమీదకు దూసుకు వచ్చింది రైలు.

రాజన్ శరీరం ముక్కలయింది. శరీర అవయవాలు దూరంగా ఎక్కడో పడ్డాయి.

# 13

"మళ్ళీ ఏమయినా జరిగిందా?" అడిగాడు రాజు లోపలకు వచ్చిన ఇన్‌స్పెక్టర్‌ని చూసి.

"అవును. ఇంకొకడిని ఎవరో రైలుకిందకు నెట్టారు. తల చెక్కు చెదరలేదు. శరీరం నజ్జయింది."

"అతనో కాదో" అన్నాడు రాజు.

ఉదయం తొమ్మిది గంటలయింది.

"అందుకే నువ్వు ఒక్కసారి వచ్చి చూసి చెప్పు"

"అలాగే" అన్నాడు రాజు బయటకు వచ్చి గదికి తాళం పెట్టి.

రాజుకు ఈ హత్య అంతగా ఆశ్చర్యం కలిగించలేదు. రంగారావు ఎలాగయినా చంపుతాడని అతనికి తెలుసు.

పోలీసులను చూసి శివపాదంకూడా వచ్చాడు. ఆయన ఈ సంగతి విని రాజు మొహంలోకి చూశాడు.

"అన్నట్టు రాత్రి నువ్వు ఎక్కడున్నావ్?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"నేను, శివపాదంగారు, ఆయన కూతురు రెండో ఆట ఇంగ్లీషు సినిమాకు వెళ్ళాము" చెప్పాడు రాజు.

"సాక్ష్యం వుందా?"

"ముగ్గురికీ సాక్ష్యమా?" నవ్వాడు శివపాదం....

"అవును" అన్నాడు ఇన్‌స్పెక్టర్,

"ఇంటర్వెల్ తర్వాత రాజు థియేటర్లో సిగరెట్టు కాలుస్తుంటే పోలీసులు పట్టుకున్నారు. ఈ సాక్ష్యం చాలనుకుంటాను" అన్నాడు శివపాదం.

"సరే. వెడదాం" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"నేనొక్కడినే వెడతాను సార్. మీరెందుకు? డైరక్టుగా ఆఫీసుకు వస్తాను" అన్నాడు రాజు.

సరేనన్నాడు శివపాదం.

జీపులో బయిల్దేరాడు రాజు.

పది నిముషాల్లో జీపు రైలుపట్టాల దగ్గరకు చేరింది.

శవం ముక్కలన్నింటినీ ఒక్క చోటుకి చేర్చారు. మొహం మాత్రం అలాగే వుంది. సులభంగానే గుర్తు పట్టాడు రాజు.

"అవును. ఇతను ఆ ముగ్గురిలో ఒకడు" అన్నాడు.

## 14

భోజనం చేసి తన గదికి వచ్చేసరికి రాజుకోసం శివపాదం ఎదురు చూస్తున్నాడు. ఆయన చేతిలో న్యూస్ పేపరు వుంది.

"ఇదేమిటి ఇక్కడ కూర్చున్నారు?" అన్నాడు రాజు ఆశ్చర్యంగా....

"నీతో మాట్లాడాలి" అన్నాడు శివపాదం నవ్వుతూ.

"రండి" అంటూ తలుపులు తెరిచి లోపలకు నడిచాడు.

ఇద్దరూ కుర్చీల్లో కూర్చున్నారు.

"చెప్పండి"

"చెబుతాను. అయితే ప్రత్యేకంగా నేను చెప్పేదేమీ లేదు. అమ్మాయి నీతో అంతా చెప్పానన్నది. మీ పెళ్ళికి నాకు ఎలాంటి అభ్యంతరం లేదు."

ఒక్క నిముషం రాజు ఏమీ మాట్లాడలేదు.

తర్వాత "మీరు బాగా ఆలోచించారా?" అన్నాడు.

"అవసరంలేదు. నేను కస్తూరిని నాలాగే ఆలోచించ గలిగేట్టుగా పెంచాను. దాని నిర్ణయమే నా డెసిషన్" అన్నాడు శివపాదం.

"నా గురించి అన్ని విషయాలూ చెబుతాను.... నాకు తల్లి తండ్రీ ఇద్దరూ లేరు. కొంచెం పొలం వుంది. దాని మీద ఆదాయంతో ఇప్పటివరకూ పెరిగాను. పొలం వ్యవ హారమంతా నా మామయ్య చూసుకుంటాడు. అయితే నా పెళ్ళిగురించి ఆయనకు తెలియబరచవలసిన అవసరం ఎంతమాత్రమూ లేదు."

"థాంక్యూ రాజూ....మరి కట్నం—"

"ప్లీజ్ .... ఈ విషయం గురించి జోక్ చెయ్యకండి శివపాదంగారూ....కస్తూరే నాకు మీరిచ్చే కట్నం" అన్నాడు రాజు.

"థాంక్స్.... వెళ్లొస్తాను....అన్నట్టు మరిచాను. నువ్వు ఇంతకు ముందు ఏదో, లాటరీ టిక్కెట్టు కొన్నానన్నావు గదా! ఇదిగో. ఈ పేపర్లో ఏవో లాటరీ డ్రా రిజల్ట్సు వేశారు. చూడు" అంటూ పేపర్‌ని ఇచ్చాడు శివపాదం.

చూశాడు రాజు. అతను కొన్న టిక్కెట్టు డ్రా ఫలి తాలే అవి.

గబగబా సూట్కేసు తెరిచి, అందులోనించి టిక్కెట్టు తీసుకొచ్చి నెంబరు చూశాడు.

పేపర్లో మొదటే వుంది ఆ నెంబరు. సరిగ్గా అదే. సంతోషంతో పెద్దగా అరిచాడు రాజు. గుండెలు పగిలి పోతాయేమో ననిపించింది.

"నాలుగు లక్షలు....ఫోర్ లాక్స్.... చార్ లాక్" అంటూ గట్టిగా అరిచాడు.

"నిజంగానా రాజూ" అన్నాడు శివపాదం అయోమయంగా.

"అవును. మీరే చూడండి" అంటూ ఆ టిక్కెట్టును ఆయనకు ఇచ్చాడు.

ఆయనకూడా చూశాడు. అవును. అదే నంబర్ కు నాలుగు లక్షల బహుమతి వచ్చింది.

"యూ ఆర్ లక్కీ రాజూ....నువ్వు అదృష్టవంతుడివి" అన్నాడు శివపాదం—రాజు భుజం తడుతూ.

"నేనుకాదు....కస్తూరి అదృష్టవంతురాలు" అన్నాడు రాజు.

## 15

రాజు పెళ్ళయింకా పన్నెండు రోజులు వుంది. పెళ్ళి నిశ్చయమయిన తర్వాత రాజు కస్తూరితో కలిసి ఏమాత్రం టైము దొరికినా తిరుగుతున్నాడు.

"నిజంగా నేను అదృష్టవంతురాలిని రాజూ!" అంది కస్తూరి.

"కాదు నేను" అన్నాడు రాజు.

"కాదు నేను" అన్నది కస్తూరి.

"నేను."

"నేను."

"కాదు. ఇద్దరం" అన్నాడు రాజు.

"నిజం. అలా ఒప్పుకో" అన్నది నవ్వుతూ.

"నీకు ఎలాంటి నగలు చేయించమంటావ్?"

"నువ్వూ-నీ ప్రేమ వుండగా నాకు నగలెందుకు రాజూ!"

"అలా కాదు కస్తూరీ. ఏం కావాలో చెప్పు!"

"నీ ఇష్టం" అన్నది.

ఆ రోజు కస్తూరి సెలక్షన్ మీద రాజు మూడు రకాల గొలుసులను కొన్నాడు. వాటిలో కస్తూరి అతని కళ్ళకు మరింత అందంగా కనబడింది.

"బ్యూటిఫుల్" అన్నాడు రాజు.

అతనికి ఒకందుకు ఎంతో విచారంగా వుంది. రంగా రావు వుంటే తన అదృష్టానికి అతను ఎంతగానో సంతో షించేవాడు. అయినా ఫరవాలేదు. రంగారావు అను క్షణం తన వెంటే వుంటున్నాడు. అతను తన నీడ. తన రక్షకుడు, 'నీకు జన్మ జన్మలకూ ఋణపడి వుంటాను ఫ్రెండ్' కృతజ్ఞత చెప్పుకున్నాడు రాజు అనేకసార్లు మనసులోనే.

శుభలేఖలు అచ్చయ్యాయి.

రాజు ఒక శుభలేఖ రంగారావు పేర వ్రాసి, "ఫ్రెండ్! మా పెళ్ళికి నువ్వు తప్పక రావాలి" అన్నాడు శూన్యంలోకి మూస్తూ.

శివపాదం తన వాళ్ళందంకీ శుభలేఖలను పోస్టు చేశాడు. అతని ఆఫీసువాళ్ళందరూ శివపాదాన్ని ఎంతో పొగిడారు లక్షాధికారి రాజు ఆయన అల్లుడవుతు న్నందుకు.

రాజు తనకు ఓ స్కూటర్ కొన్నాడు. ఇప్పుడు అతను కస్తూరిని వెనుక ఎక్కించుకుని షికార్లు కొడు తున్నాడు.

# 16

సుందరం నల్లగా పొట్టిగా చెనావాడిలా వుంటాడు. అతనికి తన స్నేహితు లిద్దరూ వరుసగా చచ్చిపోవడంతో భయ మేసిపోయింది.

తన ఇంట్లోనించి బయటకు రాకుండా గడుపుతు న్నాడు. ఎంతో అవసరముంటే నేగానీ రావటంలేదు. పగటి పూట అప్పుడప్పుడు వేషం మార్చుకుని తిరుగు తున్నాడు.

తన కోసం కూడా పోలీసులు వెతుకుతున్నారని అత నికి తెలుసు.

కాని ఒక్క మనిషి ఇంత ధయిర్యంగా ఇద్దరిని చంపా డంటే అంత నమ్మశక్యంగాలేదు.

ఒక్కడిని ముగ్గురూ కలిసే చంపేశారు. ఇక మిగి లింది ఒక్కడు. వాడొక్కడే అందరినీ చంపుతున్నాడా?

సుందరంకి విసుగు పుట్టింది. ఎన్నాళ్ళిలా పిరికివాడిలా ఇంట్లో కూర్చుని గోళ్లు గిల్లుకోవడం? బయటకు వెళ్ళాలి. తన పని తను చెయ్యాలి. రోజులు గడవటం కష్టంగా వుంది అనుకున్నాడు సుందరం. ఆ రోజు రెండో ఆట సినిమాకు వెళదామనుకున్నాడు. రాత్రి తొమ్మిది గంట లకు బయటకు వచ్చాడు. రోడ్లు ఇంకా రద్దీగానే వున్నాయి. కొద్దిగా వేషాన్ని మార్చుకున్నాడు.

రోడ్డుమీద నడుస్తూ వాల్ పోస్టర్లను చూస్తున్నాడు సుందరం. ఏ సినిమాకు వెళ్ళాలో తేల్చుకుంటున్నాడు.

ఒకచోట ఆగిపోయాడు. మంచి ఫైటింగ్ వున్న హిందీ సినిమా వాల్ పోస్టరు కనిపించింది.

ఆ సినిమాకు వెడదామనుకొన్నాడు సుందరం. ఆ థియేటరు అక్కడకు దగ్గరే.

రోడ్డు వారగా వున్న కిళ్ళీ బంకులో అరప్యాకెట్టు చార్మినార్ సిగరెట్లు కొన్నాడు.

ఒకటి వెలిగించి నడచుకుంటూ థియేటర్ దగ్గరకు వెళ్ళాడు.

అప్పుడే మొదటి ఆట వదిలారు.

అది ఆవ్ స్టెయిర్ థియేటర్. పావుగంట తర్వాత రెండో ఆట సినిమాకు టిక్కెట్లు ఇచ్చారు. టిక్కెట్టు తీసుకుని పైకి వెళ్ళాడు.

లోపలకు వెళ్ళి కూర్చున్నాడు.

సినిమా ఇంకా మొదలు కాలేదు. పాటలు వేస్తున్నారు. గేట్లోనించి లోపలకు వస్తున్న మనుషులను పరిశీలనగా చూస్తున్నాడు సుందరం.

అతనికి గేట్లోనించి బయటకు వెడుతున్న రాజు కనిపించాడు.

ఆ సినిమాకు రాజు-కస్తూరి వచ్చారు. రాజు సిగరెట్ల కోసం కిందకు వెళుతున్నాడు.

రాజును చూడగానే సుందరంలో పగ బుసలు కొట్టింది.

వీడే తన స్నేహితు లిద్దరినీ చంపింది. ఇప్పుడు దొరికాడు. వీడి అంతు చూడాలి.

చటుక్కున లేచి బయటకు వెళ్ళాడు సుందరం. రాజు మెట్లు దిగుతున్నాడు.

అతని వెనక్కు వెళ్ళబోయాడు. ఇంతలోనే అతను ఎవరో పట్టి లేపినట్లు గాల్లోకి లేచాడు.

పెద్దగా అరచాడు సుందరం.

మెట్లు దిగుతున్న రాజు ఆ అరుపు విని వెనక్కు వచ్చాడు.

అప్పటికే సుందరం అందరూ చూస్తూండగా బాల్కనీ గోడమీదనించి కిందపడ్డాడు.

పడటంతోటే అతని తల చితికిపోయింది. నిమిషంలో అతని చుట్టూ మనుషులు పోగయ్యారు.

సుందరం పైకి లేచినప్పుడే రాజు అతన్ని గుర్తుపట్టాడు.

అతను కింద పడగానే గబగబా వచ్చి "వెళ్ళిపోదాం" అని కస్తూరిని తీసుకుని బయటకు వచ్చాడు.

కస్తూరికి ఏమీ అర్థం కాలేదు.

# 17

ఇక రెండు రోజులే వుంది పెళ్ళి.

శివపాదం పెళ్ళి ఏర్పాట్లు భారీ ఎత్తున చేస్తున్నాడు.

ఊళ్ళో వున్న స్నేహితులందరినీ రాజు-కస్తూరి వెళ్ళి పిలవదల్చుకున్నారు.

"స్కూటర్ తీసుకురా" అన్నది కస్తూరి.

"దాన్లో పెట్రోలు తక్కువగా వుంది. ఐనా ఓ టాక్సీ తీసుకువెడదాం" అన్నాడు రాజు.

అతనికి ఎంతో సంతోషంగా వుంది.

వెడ్డింగ్ కార్డ్సు తీసుకొని బయటకు వచ్చారు.

"త్వరగా రండి" అన్నాడు శివపాదం బయటకు వచ్చి.

"అలాగే" అన్నాడు రాజు.

వాళ్ళకు రోడ్డుమీదే ఓ టాక్సీ ఎదురయ్యింది. డ్రయివర్‌తో మాట్లాడి ఇద్దరూ ఎక్కారు.

టాక్సీ వెళుతోంది.

"మనం చాలా తమాషాగా కలుసుకున్నాం రాజూ!" అన్నది కస్తూరి.

"అవును. మేరేజస్ ఆర్ మేడ్ ఇన్ హెవెన్" అన్నాడు రాజు కస్తూరి కళ్ళలోకి చూస్తూ.

"ఆ రోజు ఆ సంఘటన జరక్కుండా వుంటే నువ్వెవరివో?"

"పోయిన ఆ ముగ్గురు రౌడీ వెధవలకీ మనం ఎంతగానో రుణపడి వున్నాం" అన్నాడు రాజు.

టాక్సీ ఓ యింటి ముందు ఆగింది.

దిగి లోపలికి వెళ్ళారు. ఆ ఇంట్లో కస్తూరి స్నేహితురాలు వుంటోంది. ఆ అమ్మాయి ఇంట్లోనే వుంది.

గర్వంగా రాజుని ఆ అమ్మాయికి పరిచయం చేసింది కస్తూరి. తర్వాత శుభలేఖ ఇచ్చి ఇన్వయిట్ చేసింది. ఐదు నిముషాల తర్వాత ఇద్దరూ వచ్చి టాక్సీలో ఎక్కారు. మళ్ళీ ముందుకు కదిలింది టాక్సీ.

"చాలామందికి జెలసీగా వుంది మనిద్దరం పెళ్ళి చేసుకోవడం" అన్నది కస్తూరి.

నవ్వేడు రాజు.

ఉన్నట్టుండి అతని షర్టు జేబులో వున్న పెన్ను పైకి లేచింది.

గబుక్కున ఓ కాయితాన్ని బయటకు తీశాడు రాజు. అతనికి తెలుసు రంగారావు ఏదో రాయబోతున్నాడని.

కస్తూరి చిత్రంగా చూస్తోంది.

పెన్ను రాస్తోంది. చదువుతున్నాడు రాజు.

"రాజూ! వాళ్ళు ముగ్గురూ నన్ను వశపర్చుకున్నారు. నిన్ను ఇక రక్షించలేను. వాళ్ళు నిన్ను బతకనివ్వరు.... నిన్నిక భగవంతుడే కాపాడాలి."

రాజుకు చెమటలు పట్టాయి.

కస్తూరి భయంగా అతని మొహంలోకి చూసింది.

"భయపడకు కస్తూరీ" అన్నాడు రాజు వణికిపోతూ.

బ్రిడ్జిమీదనించి వెళుతోంది టాక్సీ.

"డ్రయివర్, టాక్సీ ఆపు" అరిచాడు రాజు.

కాని టాక్సీ ఆగలేదు. డ్రయివర్ మాట్లాడలేదు.

అరుస్తున్నాడు రాజు!

టాక్సీ వేగంగా వెళుతోంది. రాజు అరుపులకు పక్క నించి వెళుతున్నవాళ్ళు ఆశ్చర్యంగా చూస్తున్నారు.

ఉన్నట్టుండి టాక్సీ పక్కకు తిరిగింది.

కెవ్వున కేక పెట్టింది కస్తూరి.

టాక్సీ బ్రిడ్జిగోడకు డాష్ ఇచ్చి ఎగిరికిందకు పడి పోయింది.

జనం బ్రిడ్జి క్రిందకు పరిగెత్తుతున్నారు.

—ఐపోయింది—

# మాయమైన బుల్లెట్

## సికిందర్

ఉదయం 11 గంటలకి ఈల వేసుకుంటూ ఆఫీసులో ప్రవేశించిన జాన్ ని చూసి లాల్ మండిపడి అన్నాడు.

"ఇంత ఆలస్యమైందేం? ఎక్కడున్నావు ఇంత సేపూ?"

జాన్ చిన్నగా నవ్వాడు. "ఆలస్యానికో అందమైన కారణం. క్రింద కార్లో ఒక అమ్మాయి...."

లాల్ రెచ్చిపోయి అర్చాడు, "యూ డర్టీ పార్ట్ నర్! తెల్లారుతుండగానే...."

"మిస్టేక్, పార్ట్ నర్, మిస్టేక్! తెల్లారుతుండగాకాదు, ఉదయం తొమ్మిది గంటలకు నేనింకా నిద్ర లేవక ముందు ఆమె నా తలుపు తట్టింది. గాభరాగా లోనికి వచ్చి, నా చేతులు పట్టుకొని, జాన్! నేను మీ చెల్లెని. నన్ను రక్షించండి. నన్నెవరో పొంచి వుండి రహస్యంగా గమనిస్తున్నారు. నన్ను-నన్నేదో చెయ్యాలనుకొంటున్నారు. నన్ను కాపాడిండి ప్లీజ్!' అంటూ కన్నీళ్లు

పెట్టుకొంది.

జాన్ మాటలు విని లాల్ సూటిగా చూశాడు. "నువ్వు కలగన్నావా? లేక పొరబడ్డావా? తెల్లారుతుండగానే ఆపదలో యిరుక్కునే అమ్మాయిలెవరు? నువ్వు చెప్పేది బహుశా రాత్రి జరిగివుంటుంది."

జాన్ అడ్డంగా తల వూపాడు "కాదు, ఇప్పుడు జరిగింది. క్రింద కార్లో ఆమె వుంది."

"ఆల్ రైట్, ఆమె దేనికి భయపడుతోంది? ఎవరికి భయపడుతోంది? ప్రేమ వ్యవహారమా? విలన్స్ మధ్యలో ప్రవేశించారా?"

జాన్ మళ్ళీ నవ్వాడు. "ఆమె బ్యాగులో రివాల్వర్ వుంది. దాన్నెవరో రహస్యంగా పెట్టారు. అందులో ఒక బుల్లెట్ తక్కువ వుంది."

లాల్ కళ్ళు విశాలమయ్యాయి. "రివాల్వర్లో బుల్లెట్ లేనంతమాత్రాన అది ప్రాణ నష్టానికి గురయిందని చెప్పలేం. కేవలం ఆమెని భయపెట్టడానికి ఎవరయినా దాన్ని తొలగించి రివాల్వర్ని బ్యాగులో పెట్టి వుండవచ్చు. వెల్, ఆమె ఏం చెప్పింది?"

"ఆమె చెప్పిందంతా విన్నాను. కాని సలహా యివ్వలేదు. కేసులు సంయుక్తంగా స్వీకరించాలని నువ్వు కండిషన్ పెట్టావుగా?"

"అవును, బుద్ధిమంతుడివి. ఆమెని తీసుకురా; కేసు సంయుక్తంగా విద్దాం."

జాన్ క్రిందికి వెళ్ళి అయిదు నిమిషాల్లో ఒక ఇరవై ఏళ్ళ యువతితో తిరిగి వచ్చాడు. ఆమె వస్త్రధారణ చూస్తే ఆమెకెంత భయం ఆవహించిందో తెలుస్తుంది. కళ్ళలో ఎక్కడలేని ఆందోళన. పాలిపోయిన ఆమె

ముఖంలో ఏమాత్రం కళ లేకపోగా, పరిస్థితి ఏ కొంచెం విషమించినా పెద్ద పెట్టున ఏడ్చేందుకు సిద్ధంగా వుంది.

"మిస్ శైలజ. సౌత్ ఇండియా ఎంటర్ ప్రైజెస్ ఆఫీసులో టైపిస్టు" పరిచయం చేశాడు జాన్.

ఆమె నమస్కరించింది. లాల్ తలూపి కూర్చోమన్నాడు. ఆ తర్వాత ఆమె భయాన్ని దూరం చేస్తూ అన్నాడు—

"జీవించడానికి ముఖ్యంగా కావల్సింది ధైర్యం. ధైర్యం కోల్పోతే ప్రతి చిన్న సమస్య ఒక భూతంలా కనిపిస్తుంది. ధైర్యం చూపిస్తే పొంచివున్న పరిస్థితులన్నీ పలాయనం చిత్తగిస్తాయి.

మిమ్మల్నెవరో అపరాధిని చెయ్యాలనుకుంటున్నారు- లేదా కనీసం అలా భయపెట్టాలనుకొంటున్నారు. ఒకర్ని భయపెట్టకుండా కొందరు ఈ లోకంలో బ్రతకలేరు. కాబట్టి భయపెట్టేవారికి భయపడకుండా మీరా బ్యాగులోంచి రివాల్వర్ తీసి చెత్తకుండీలో పారేసినప్పుడే మీ సమస్య చక్కగా పరిష్కారమయ్యేది. ఏమంటారు?"

"మిస్టర్ లాల్! ఈ ఆలోచన నాకు రాలేదుగానీ, మీరు చెప్పాక నేను మంచిపనే చేశాననిపిస్తోంది! నిజంగా మీరు నన్ను కాపాడతారా?"

"ఈ ఏజెన్సీ మీ సేవలు చేయడానికే. ఇక రివాల్వర్ చూపించండి."

ఆమె లాల్ కు బ్యాగు అందించి అంది: "రివాల్వర్ ని నేను ముట్టుకున్నాను. నా వేలిముద్రలు దానిమీద వుంటాయని జాన్ చెప్పారు."

లాల్ సొరుగులోంచి గ్లోవ్స్ తొడుక్కొని, బ్యాగులోంచి రివాల్వర్ తీశాడు. దాన్ని పరీక్షగా చూసి, మజిల్

వాసన చూశాడు. ముక్కు మండి ఛాంబర్ తెరిచి చూశాడు. ఒక బుల్లెట్ తక్కువ వుంది, కాని ఖాళీ షెల్ తొలగించి లేదు.

"ఈ రివాల్వర్ ప్రేల్చబడింది" అన్నాడతను. "మీరు దీన్ని ఎప్పుడు, ఎక్కడ చూశారు?"

"ఈ ఉదయం తొమ్మిది గంటలకు" అంది శైలజ, "ఆఫీసుకు బయలుదేరడానికి సిద్ధమవుతూ బ్యాగు తెరిచాను. అందులో దాన్ని చూసి అదిరిపోయాను."

"ఈ రివాల్వర్ ఎవరిదో మీకు తెలుసా?"

"నా బాస్-సాంబశివరావుది. మిస్టర్ లాల్, మీకు పరిస్థితి వివరంగా చెప్తే నా భయం అర్థం జేసుకుంటారు"

"అర్థం జేసుకుంటాను, చెప్పండి."

"నిన్న ఆదివారం మధ్యాహ్నం బాస్ నాకు ఫోన్ చేసి రాత్రి ఎనిమిది గంటలకి ఇంటికి రమ్మన్నారు-కొన్ని ఆఫీసు విషయాలు చర్చించడానికి. నేను సరిగ్గా ఆ సమయానికి వెళ్ళాను. కానీ అక్కడాయన లేరు! ఎక్కడికెళ్ళారో తెలియలేదు.

"నాతో చెప్పకుండా నన్ను రమ్మని చెప్పి ఆయన ఎక్కడికెళ్ళారో అంతుబట్టలేదు సరే, అక్కడికెళ్ళి నేను కొత్త చిక్కులు తెచ్చుకున్నాను! నా వ్యక్తిత్వాన్ని పోగొట్టుకున్నాను!"

"ఏమిటి మీరనేది?"

శైలజ నెమ్మదిపడింది. "నా బాస్ భార్య సులోచనతో రాత్రి నాకు ఘర్షణ జరిగింది. ఆమె ఒట్టి అనుమానపు పిశాచి. ఆమెకెంత అనుమానమో బాస్‌కు అంత చపలత్వం. యాభై ఏళ్ళొచ్చినా సరసాలకు కొదువలేదు. ఈ ఉద్యోగంలో చేరిన ఈ ఆర్నెల్లలో నేను చాలా

విసిగిపోయాను ఆయన చేష్టలకి.

"ఆయన నాతో ఎక్కడ వ్యవహారం నడుపుతు న్నాడోనని ఆమె అనుమానం. కాని ఆయన వెకిలిచేష్టలకి మించి హద్దులు దాటరని నాకు తెలుసు. ఆయనకంత ఓపికా, శక్తీ లేవు. ఈ విషయం ఆమెకు తెలియదు. ఒళ్ళంతా కళ్ళు చేసుకొని మమ్మల్ని జాగ్రత్తగా గమ నిస్తుంది. ఆయన ఇంటికి ఆలస్యంగా వెళ్తే నిలదీసి అడుగుతుంది.

నేనామెను ఎక్కువసార్లు చూడలేదు. ఇంటికెళ్ళే అవసరం తరచు రాదు. నలభై ఏళ్లు వచ్చినా భర్తమీద అంత శ్రద్ధ చూపడానికి కారణం పిల్లలేకపోవడమను కొంటాను....పిల్లలుంటే ఆ సంతృప్తిలో భర్త గురించి పట్టించుకోనేది కాదు. ఇప్పుడామెకు భర్త తప్ప దిక్కు ఎవరు?"

"నిన్న రాత్రి ఏం జరిగిందో చెప్పండి?"

"ఆయన రమ్మన్న సమయానికి వెళ్లాను-రాత్రి ఎని మిది గంటలకి. అప్పుడే వున్నట్టుండి మబ్బులు కమ్మి ఆకాశం నల్లబడింది. మెరుపులు మెరిశాయి. గాలి వీచి, హఠాత్తుగా వర్షం ప్రారంభమైంది.

"నేను బాస్ ఇంటికెళ్ళేసరికి ఆయన భార్య అప్పుడే ఎక్కడినుంచో వచ్చినట్టుంది - కొత్త బట్టల్లో వుంది. తలుపు తెరిచి నన్ను ఆశ్చర్యంగా చూసింది. నన్ను బాస్ పిలిచినట్లు చెప్పాను. ఆమె ముఖంలో రంగులు మారాయి. లోనికి రమ్మని తలూపింది. నాకు భయం వేసింది-ఆమె వాలకం చూసి. నేను లోనికెళ్ళగానే ఆమె దఢాలున తలుపులేసి, బాస్ ఇంట్లో లేరని చెప్పింది."

"తర్వాత?"

"ఎక్కడికి వెళ్ళారని అడిగాను. తెలియదంది. తా నప్పుడే బయటినుంచి వస్తున్నట్లు చెప్పింది. క్షణ క్షణా నికీ కోపంతో ఎఱ్ఱబడుతున్న కళ్ళతో నన్ను మ్రింగేసేలా చూస్తూ బాస్ ఎందుకు పిల్చారని అడిగింది. ఆఫీసు విష యాలు మాట్లాడ్డానికని చెప్పాను. ఇమె విషపు నవ్వు విసిరింది. ఆ సమయంలో నేనక్కడికి ఎందుకొచ్చానో వేరే అర్థముందని చెప్పింది."

"ఏమిటది?"

"నిన్న సాయంత్రం 4గంటలకు బాస్ స్నేహితుడెవరో బర్త్ డే పార్టీకి పిల్చారుట. ఆమె భర్తతో వెళ్ళడానికి సిద్ధమయింది. కాని, ఆయన హఠాత్తుగా నిర్ణయం మార్చు కొని ఆమెనే వెళ్ళమన్నారట....ఏవో ఆఫీసు పనులున్నా యని చెప్పారట.

"కాబట్టి—తనని ఒంటరిగా పార్టీకి పంపి, నన్నక్క డికి పిలిపించడంలో ఆయన ఉద్దేశమేమిటో స్పష్టంగా తెలుస్తోందని చెప్పింది.

"ఆయన ఆఫీసు పనిమీదే పిల్చారని గట్టిగా చెప్పాను. 'కాదు! నీ మాయ మాటలతో నన్ను నమ్మించకు! మీ ఇద్దరి వ్యవహారం నాకు తెలుసు! నేనేమీ గుడ్డిదాన్ని కాదు తెలుసా? నువ్వంటే ఎంత ఇష్టం లేకపోతే ప్రాణ స్నేహితుడి పార్టీ మానుకొని నిన్నిక్కడికి పిలిపిస్తాడు!' అనర్చింది.

"అంతటితో వూరుకోలేదు. నానా దుర్భాషలాడింది. 'తండ్రిలాంటి వాడితో సరసాలాడ్డానికి నీకు సిగ్గులేదూ?' అంటూ ఇంకిలాంటి మాటలెన్నో....ఓహ్, వర్ణించలేను! ఆమె మాటల్లో ఏమాత్రం నిజంలేదని నేను వాదించాను.

"ఆమె సహనం కోల్పోయి నన్ను కొట్టబోయింది. నేను తప్పించుకున్నాను. కానీ ఆమె వదల్లేదు. తలుపు దగ్గర నన్ను పట్టుకుంది. నా చెంపమీద బలంగా కొట్టింది. నేనూ సహనం కోల్పోయాను. విసురుగా చెయ్యెత్తి ఆమె ముఖంమీద చరిచాను. ఆమె గట్టిగా అర్చింది—కానీ ఎవరికీ విన్పించలేదనుకుంటాను—ఆకాశం గర్జిస్తోంది—అదే మంచిదైంది.

"నేను తటాలున తలుపు తెరిచి బయట కురకబోయాను గానీ, గాలి నన్ను లోనికి తోసేసింది. ఈలోపు ఆమె తేరుకుని, నా జడ పట్టుకొని చరచర బెడ్‌రూంలోకి లాక్కెళ్ళి నేలమీద పడేసింది. ఒక్క గంతువేసి, సొరుగులోంచి రివాల్వర్ తీసింది. దాన్ని నాకు గురిపెట్టి—"

"ఏం చేసింది?"

"హెచ్చరిక చేసింది" అంది శైలజ గుటక వేసి, "రేపీపాటికి నేను వుద్యోగం వదిలేసి దూరంగా పారిపోకపోతే చంపుతానంది. నా ఉద్యోగం గురించి మాట్లాడే హక్కు ఆమెకు లేదన్నాను. 'మరి-నాకూతురులాటిదానివి, నా భర్తను వల్లో వేసుకొనే హక్కు, నీతి నియమాలూ నీకున్నాయా?' అందామె. ఇలాటి పిచ్చి మాటలు వాగితే పళ్ళూడగొడ్తానన్నాను.

"మిస్టర్ లాల్," శైలజ అంది ఆవేశం అణచుకొంటూ, "ఈ మాటలు చెప్పి కొద్దిలో నేను ప్రాణాలు పోగొట్టుకొనేదాన్నే. ఆమె నా మీదకి దూకి రివాల్వర్ ట్రిగ్గర్ నొక్కబోయింది. ఆమెని బలంగా వెనక్కి నెట్టేసి, రివాల్వర్ని దూరంగా విసిరేశాను! ఆమె వెళ్లి కిలా పడిపోయింది. అంతే—ఆతర్వాత ఏమీ జరుగలేదు. నేను లేచి పరిగెత్తి వచ్చేశాను."

"అప్పుడామె తెలివి తప్పిందా?" అడిగాడు లాల్.

"లేదనుకుంటాను. ఆ అవకాశం లేదు—ఆమెకంత గట్టి దెబ్బ తగల్లేదు."

"వెల్, మీరెక్కడుంటున్నారు?"

"అపర్ణా అపార్ట్‌మెంట్స్ - చార్మినార్ క్రాస్ రోడ్స్‌లో. అక్కడనుంచి తిన్నగా ఫ్లాట్‌కొచ్చి రాత్రంతా నేను బయటికెళ్ళలేదు. మరి ఈ రివాల్వర్ నా గదిలో, నా బ్యాగులో ఎలా వచ్చిందో అర్థం గావడంలేదు. దాన్ని చూసి నా ప్రాణాలెగిరిపోయి జాన్ దగ్గరికి పరుగెత్తుకొచ్చాను. ఆయన రివాల్వర్‌లో ఒక గుండు లేదని చెప్పారు.... ఇక వూహించండి నా పరిస్థితి!"

"మీ బాస్ ఎక్కడున్నారో తెలియదా?"

"తెలియదు. రాత్రి ఇంటికి మూడుసార్లు ఫోన్ చేశాను. ఇంట్లో ఎవరూ లేరనుకుంటాను—రెస్పాన్స్ లేదు. ఒకవేళ ఆమె బయటికెళ్ళి భర్తను గాలించి పట్టుకొని, రివాల్వర్‌తో చంపి, దాన్ని నా బ్యాగులో...."

లాల్ నవ్వాడు. "పిచ్చి ఆలోచన మానండి. ఆమెకు భర్త తప్ప దిక్కెవరు? మీరేకదూ ఈ మాట అన్నది?"

శైలజ వెంటనే అంది, "ఆవేశంలో ఆమె ఏ అఘాయిత్యమైనా చేయవచ్చు!"

"ఆమె చంపాలనుకుంటే మిమ్మల్నే చంపాలి!"

"అయితే మీరిప్పుడేమంటారు?"

"రిసీవర్ ఎత్తి మీ బాస్‌కు ఫోన్ చెయ్యండి, ఇప్పుడొచ్చాడేమో చూద్దాం."

శైలజ ఒక నెంబర్ డయల్ చేసి, "ఇంట్లో సమాధానం లేదు" అంది. ఆ తర్వాత మరో నెంబర్ డయల్

చేసి కొన్ని క్షణాలు మాట్లాడి రిసీవర్ పెట్టేసి, "ఆఫీసులో కూడా లేదు" అంది.

లాల్ సాలోచనగా జాన్‌ని చూశాడు.

"నాతో చెప్పకుండా ఆయన ఎక్కడికీ వెళ్ళరు" అంది శైలజ మళ్ళీ.

"కానీ—ఎక్కడికి కెళ్తాడో తెలుసా?" అన్నాడు జాన్.

"భార్యతో పార్టీ మానుకొని నన్ను రమ్మని చెప్పి, అత్యవసరంగా వెళ్ళే పనులు ఆయనకు లేవు. వెళ్ళినా ఇంతవరకూ తిరిగిరానంతటి పెద్ద పనులు కూడా లేవు. నేను మీనన్‌కు కూడా ఫోన్ చేశాను. అతనూ తెలియదన్నాడు."

"మీనన్ ఎవరు?"

"నా బాస్ పార్ట్‌నర్. కానీ కంపెనీ వ్యవహారాలతో అతనికి సంబంధం లేదు. స్లీపింగ్ పార్ట్‌నర్—పెట్టుబడి పెట్టాడు, అంతే. బాస్ వ్యవహారాలతనికి తెలియవు."

"సరే, జాన్ యిప్పుడొక స్టేట్‌మెంట్ టైపు చేస్తాడు. మీరు దానిమీద సంతకం చేయాలి. ఆ తర్వాత మనం మీ బాస్ ఇంటికెళ్తాం" అన్నాడు లాల్.

"అక్కడికా! మళ్ళీ ఎందుకు? నేను రాను."

"ఎందుకు రారు?"

"ఈ జన్మలో మళ్ళీ ఆమె ముఖం చూడను."

లాల్ లేచి నిలబడ్డాడు. "వెల్, సెంటిమెంట్స్ మానండి! మీ బాస్ ఎక్కడికెళ్ళాడో తెలియదు సరే, ఆయన భార్య ఎక్కడికెళ్ళింది? రాత్రినుంచి ఇంట్లో ఎందుకు లేదు? సంఘటల్నిబట్టి చూస్తే మనం అక్కడికెళ్ళక తప్పదు.

"శైలజ! మీరు చెప్పే ప్రతి మాటా నిజమయితే తప్పు సహాయపడలేం. ఆల్ రైట్, ఇక మీరు ఈ రోజున ఈ సమయాన, ఈ రివాల్వర్ని మా స్వాధీనం చేసినట్లు స్టేట్మెంట్ మీద సంతకం పెట్టండి."

## 2

లాల్ కారు దిగాడు. ఆ తర్వాత జాన్, శైలజ దిగారు.

"లుక్ సిస్టర్!" లాల్ అన్నాడు, "గేటు గడియ వేసి లేదు. తలుపుకి తాళం లేదు. ఓరగా తెరిచి వుంది-చూస్తున్నారా? ఆమె వచ్చేసి వుండాలి. లేదా మీ బాస్ అయివుండాలి—లేదా ఇద్దరూ వచ్చివుండాలి. కాబట్టి మిమ్మల్ని మీరు అదుపులో వుంచుకోండి. రాత్రికిలాగా సిగపట్లకు సిద్ధమైతే నేనొప్పుకోను. మగవాళ్ళు తన్నుకోవచ్చుగానీ, ఆడవాళ్ళు తిట్టుకున్నా సహించను! అర్థమైందా? ఇక పదండి, లోనికెళ్దాం...."

ముందు లాల్ గేటు తెరుచుకొని లోని కెళ్ళాడు. అతని వెనుక జాన్, శైలజ వెళ్ళారు. జాన్ లోపల తడిగా వున్న నేలను చూసి అన్నాడు—

"క్రింద నేల చూడు! రాత్రి వర్షం పడింది. నేల ఇంకా మెత్తగా వుంది. ఇందులో అడుగు జాడలు లేవు, టైర్ ప్రింట్స్ లేవు—ఇంట్లో ఎవరూ లేరు పార్ట్నర!"

లాల్ నేలనూ జాన్నీ మార్చి మార్చి చూసి తల వూపాడు.

"శైలజ, మీ బాస్ కార్లో వెళ్ళాడనుకుంటాను?" జాన్ అడిగాడు.

ఆమె అయోమయంగా తలూపింది.

"వెల్, రాత్రి మీరిక్కడికి వచ్చాక వర్షం ప్రారంభ

మెంది. తిరిగి వెళుతున్నప్పుడు కూడా పడుతుండాలి— అందుకే ఇక్కడ మీ అడుగు జాడలు లేవు. వర్షంలో కొట్టుకుపోయాయి. అంతేనా?"

"తిరిగి వెళుతున్నప్పుడు వర్షం వుంది. నేనిక్కడ అర గంట సేపు వున్నాను."

జాన్ లాల్ వైపు తిరిగాడు. "ఇక పోలీసుల్ని పిల వడం మంచిదనుకుంటాను...."

"ఎందుకు?"

"ఈ పరిసరాల్లో నాకేదో వింతవాసన వేస్తోంది" అన్నాడు జాన్ చుట్టూ చూస్తూ, "రాత్రి వర్షం పడుతు న్నప్పుడు శైలజ వెళ్ళింది గనుక ఆమె అడుగు జాడ లేర్పడలేదు. అదే వర్షంలో సులోచన కూడా వెళ్ళి వుంటే ఆమె అడుగు జాడలు కూడా ఏర్పడవు. అలాగే అదే వర్షంలో రావ్ ఇంటికి వచ్చినా కారు టైరు గుర్తు లుండవు.

"కానీ—ఇక్కడ నేలలో అడుగు జాడలు, టైరు ప్రింట్స్ ఏవీ లేవు. రావ్ రాత్రి వర్షంలో వచ్చివుంటే కారు వుండాలి. అదీ లేదు. కాబట్టి అతను ఇప్పటివరకు ఇంటికి రాలేదు. సులోచన రాత్రి ఉద్రేకంలో వుంది గనుక ఆమె బయటికి వెళ్ళాలనుకుంటే తక్షణం అంటే వర్షంలోనే వెళ్ళాలి. ఆ తర్వాత వర్షం వెలిశాకే తిరిగి రావాలి. కాబట్టి ఆమె జాడలుండాలి. అవీ లేవు. ఒక వేళ ఆమె బయటికెళ్ళలేదనుకొంటే ఫోన్ కాల్స్‌కి ఎందుకు సమాధాన మివ్వలేదు? ఆమె రాత్రివెళ్ళి ఇంత వరకూ తిరిగి రాలేదా? అయితే తలుపు లెందుకు తెరిచి వున్నాయి? ఎంత వుద్రేకంలో వున్నా ఇంటినలా తెరిచి పెట్టి వెళుతుందా?"

"అంటే లోపల ఆమె...."

"లోపలే వుండాలి. ఫోన్‌కు రెస్పాన్స్ యివ్వలేని సితిలో...."

"అంటే?!" శైలజ అంది కంగారుగా.

"అంటే—మీరిప్పుడు సజీవంగా వున్న ముఖంకాదు, నిర్జీవంగా వున్న సులోచన ముఖం చూడబోతున్నారు" అన్నాడు జాన్.

లాల్ వేగంగా ఇంటికేసి కదిలి వెళ్ళాడు. గబ గబ మెట్లెక్కి తలుపుని చిన్నగా కాలితో నెట్టాడు. తెరుచుకుంది. లోపల నిశ్శబ్దంగా వుంది. ఎవరూ లేరు. అయినా లాల్ "సులోచనగారూ! మీరు లోపల వున్నారా?" అనర్చాడు.

సమాధానం రాకపోవడంతో సందేహిస్తూ లోనికి నడిచాడు. వేగంగా బెడ్‌రూంవైపు కదిలి ద్వారం దగ్గర ఆగిపోయాడు.

గది మధ్య శవం వుంది.

సీలింగ్‌కి వ్రేలాడుతున్న లైటు వెలుగులో గది స్పష్టంగా కన్పిస్తోంది. నేలమీద నిర్జీవంగా పడివున్న సులోచన దేహం మీద బ్రా, పావడా తప్ప ఏమీ లేవు.

ఆమె చీర, జాకెట్ బెడ్‌మీద వున్నాయి. బెడ్ ఎడమవేపు వుంది. ద్వారాని కెదురుగా కిటికీ వుంది. అది మూసివుంది. గదిలో ఎక్కడి వస్తువు లక్కడ చెక్కు చెదరకుండా వున్నాయి, ఒక్క బోర్లాపడ్డ పేము కుర్చీ తప్ప.

లాల్‌కి సులోచన ముఖం చూశాక ఆశ్చర్యమేసింది. చావుకు ముందు పెనుగులాడిన సూచనలు ఆమె ముఖంలో లేవు. అయితే రిగర్ మార్టిస్‌వల్ల నలభై ఏళ్ళ వయసులో

కూడా బిగి సడలని అందం చెదిరిపోయింది. ఆమె వెల్లకిలా ప్రశాంతంగా నిద్రపోతున్నట్లు కన్పిస్తోంది. కుడి చెయ్యి గుండెపైన, ఎడమచెయ్యి నేలమీద. గుండె భాగం నుంచి కారిన రక్తం బ్రాను తడిపేసి, నేల నాక్రమించుకొని ఘనీభవించింది.

లాల్ ఆ దృశ్యం చూసి, నిట్టూర్చి వెనక్కి తిరిగాడు.

బయట ఆవరణలో విగ్రహంలా నిలుచున్న శైలజనూ సిగరెట్ తాగుతూ దిక్కులు చూస్తున్న జాన్‌నీ చూసి, వేగంగా వెళ్లి కలుసుకున్నాడు.

"బాడ్‌లక్! నువ్వన్నదే జరిగింది...."

శైలజ వూపిరి పీల్చడం మరిచిపోయింది. "చనిపోయిందా?"

ఆమెని లాల్ సూటిగా చూశాడు. "అవును. విచిత్రంగా వుంది కదూ? ఇప్పుడు మీ కథనం ఏమిటి?"

"నన్నను మానిస్తున్నారా? నేను మిమ్మల్నే నమ్ముకున్నాను."

"ఇప్పుడు దేవుడ్ని నమ్మినా లాభం లేదు. నిన్నరాత్రి మీ ప్రవర్తనకు ఇప్పటి పరిస్థితి అనుకూలంగా వుంది."

"ఓహ్! నాకేమీ తెలియదు" అర్చింది శైలజ గొంతు చించుకొని. "నాకేమీ తెలియదు. ఆ రివాల్వర్ గురించి నాకేమీ తెలియదు. నేనేమీ చేయలేదు. మిమ్మల్నెలా నమ్మించాలి?"

"డామిట్!" జాన్ కసిరాడు. "తెల్లారి నిద్రలేచి మీ నోటినుంచి అబద్ధాలు విన్నాను. అప్పుడే మీమీద నా కనుమానం వస్తే పోలీసుల కప్పగించేవాడ్ని! నిన్న రాత్రి మీరు వెళ్ళాక ఇక్కడి కెవరూ వచ్చినట్టు సూచనలు లేవు. ఘర్షణలో ప్రమాదవశాత్తు మీరు సులోచ

నను చంపేసి వెళ్ళిపోయారు."

"షటప్! నేను చంపివుంటే లాల్ చెప్పినట్లు రివాల్వర్‌ని చెత్తకుండీలో విసిరేదాన్ని! నేరంచేసి ఎవరైనా పోలీసుల సహాయం కోరుతారా?"

"మీరు డిటెక్టివ్‌ల సహాయం కోరారు—మా సహాయం. మిమ్మల్ని డబ్బుతో కొనేసి సాక్ష్యాధారాల్ని గల్లంతు చేయాలనుకున్నారు. ఈ పని మీరు పోలీసుల సహాయంతో చేయలేరు."

"పోలీసుల్ని పిలవండి! నన్నేవరేం చేస్తారో చూస్తాను!"

"ఛాలెంజ్!" జాన్ పిడికిలి బిగించి బొటన వేలు చూపించాడు.

"మరీ అంత వెర్రి ధైర్యం పనికిరాదు" లాల్ కల్పించుకున్నాడు.

"జాన్, లోపలి దృశ్యం చూశాక నాకో అభిప్రాయం ఏర్పడింది. త్వరపడి నిర్ణయానికి రాకుండా, ఈ వ్యవహారాన్ని ఇంకా లోతుగా చూసి శైలజ విషయం ఆలోచించాలి.

"శైలజ! మీరు నిజం చెప్పండి చాలు; మీరు నిర్దోషులైతే ఈ హత్య మీ మెడకు చుట్టుకోకుండా చూసే బాధ్యత నాది. సగం నిజం చెప్పినా నా నుంచి సహాయం అందదు! ఇక పోలీసులు వచ్చేలోపు నేనడిగే ప్రశ్నలకు చకచకా సమాధానాలివ్వండి.

"జాన్, సుబ్బోళ్ళి కృష్ణన్‌కు ఫోన్ చెయ్యి."

# 3

ఇన్‌స్పెక్టర్ బాలకృష్ణన్ కారు దిగి డిటెక్టివ్‌లను విష్ చేశాడు,

"హలో ఫ్రెండ్స్! గుడ్ మార్నింగ్ నైస్ మార్నింగ్. రాత్రి వర్షం పడి మార్చి ఎండని మాయం చేసింది."

"మబ్బులు విడిపోతున్నాయి. మరికాస్సేపట్లో సూర్యుడు మాడ్చేస్తాడు!" అన్నాడు లాల్. "కాబట్టి లోనికెళ్లి మన పని చూద్దాం."

"శవాన్ని చూసే ముందు ఈ పరిసరాల్ని గమనించారా?" కృష్ణన్ అడిగాడు.

"మేం శవాన్ని చూస్తామనుకోలేదు. కాని, పరిసరాల్ని గమనించాక లోపల శవం వుందని జాన్ పసిగట్టాడు."

"వెరీ వెల్! అయితే ఇక్కడ అడుగు జాడలు.... టైర్ ప్రింట్స్...."

"ఏవీ లేవు-ఈ అడుగు జాడలు మావి."

కృష్ణన్ తలూపి శైలజను ఓరగా, అనుమానంగా చూసి, "పదండి లోనికెళ్దాం" అన్నాడు.

అందరూ ఇంటి వైపుకు దారి తీశారు. ఇంట్లోకెళ్ళాక శైలజను శవాన్ని చూడనీయకుండా హాల్లో కూర్చోబెట్టి బెడ్‌రూంలోకెళ్లారు.

ముందు ఫోటోగ్రాఫర్ శవాన్ని ఫోటోలు తీశాడు. తర్వాత డాక్టర్ పరీక్షించాడు. బుల్లెట్ గాయం బ్రాగుండా ఎడమ వక్షాన్ని చీల్చుకుంటూ గుండెను తాకిందని చెప్పాడు. చావు రాత్రి ఏ సమయములోనయినా సంభవించి వుండవచ్చని అన్నాడు. అయితే దేహమంతటా వ్యాపించిన రిగర్ మార్టిస్‌నిబట్టి చావు సంభవించి 12 గంటలపైనే అవుతోందని చెప్పాడు.

లాల్ బెడ్ మీద వున్న చీరనూ, జాకెట్‌నూ పరిశీలించాడు. జాకెట్ ఎక్కడా చిరిగిలేదు, యెక్కడా

రంధ్రాల్లేవు. చీర నలిగినా తెలుసుకోలేనంత ఖరీదైనది.

జాన్ గదిని జాగ్రత్తగా చూడసాగాడు. ఎడమ వైపు బెడ్ ప్రక్కన టేబిల్ వుంది. దాని మధ్య సొరుగు లాగివుంది. సొరుగులో ఏమీ లేవు. టేబిల్ క్రింద ఒకజత హీల్ చెప్పులున్నాయి. టేబిల్ మీదవున్న ఫ్లవర్ వాజ్ ప్రక్కన తాళాల గుత్తి, కొన్ని ఆభరణాలున్నాయి.

బెడ్ మీద దుప్పటి, దిళ్ళు చెదిరిలేవు. కాని, దాని క్రింద బంగారు రంగులో మెరుస్తున్న ఏదో వస్తువుని చూసి జాన్ ఛటుక్కున కూర్చున్నాడు.

"కృష్ణన్! కిటికీ తెరిచి ఇటు రండి!"

కృష్ణన్ తికమకగా చూసి కిటికీ తెరిచాడు. గదిలో మరింత వెలుగువచ్చింది. గబగబ వెళ్ళి జాన్ ప్రక్కన కూర్చున్నాడు. లాల్ వంగి చూశాడు.

"వెల్, అది రిస్టువాచీ!" అన్నాడు జాన్.

కృష్ణన్ చెయ్యిజాపి దాన్నందుకొని చూశాడు: "సరిగ్గా 9-00 గంటలకు ఆగిపోయింది. శవం చేతికి వాచీ వుంది. అయితే ఇదెవరిది?"

"దాన్నిలా ఇవ్వండి!" అన్నాడు జాన్. కృష్ణన్ అందించిన వాచీ తీసుకొని, "మీరిక ఈ గది వివరాలు వ్రాసుకోండి!" అన్నాడు.

లాల్ కిటికీ దగ్గర నిలబడి బయటికి చూశాడు: విశాలమైన తోట, 50 అడుగుల దూరాన ప్రహరీగోడ కన్పిస్తున్నాయి. సిగరెట్ పొగ వదుల్తూ వెనక్కి తిరిగి సూటిగా హాల్లో కూర్చున్న శైలజను చూశాడు. ఆమె చేతులు నలుపుకుంటూ, అసహనంగా కూర్చొనుంది.

ఆ తర్వాత లాల్ దృష్టి ఎదురుగా హాలుకి ఎడమప్రక్క గదిలో పడింది.

గది చీకటిగా వుంది. తలుపులు బార్లా తెరిచి వున్నాయి. లాల్ అనుమానంగా హాల్లోకెళ్ళి తల పైకెత్తి చూశాడు. సీలింగ్ కి వ్రేలాడుతోన్న లైటు వెల్గడంలేదు. తల దించి, మళ్ళీ ఆ గదిలోకి చూసి నడిచాడు. శైలజ ఛటుక్కున లేచి నిలబడింది. లాల్ ఆమెను వారించి కూర్చోమన్నాడు.

ఆ తర్వాత ఎదురుగా గదిలోకెళ్ళి జాగ్రత్తగా కర్చీఫ్ తో కిటికీ తెరిచాడు. వెలుగు ప్రసరించింది.

అది ఆఫీసు గదిలావుంది. కిటికీప్రక్కన కుర్చీ, టేబిల్, గోడకు రాక్,ఎదురుగా పెద్ద బీరువావున్నాయి. బీరువాపై తలుపులకి అరలు లేవు. అందులో చాలా ఫైళ్ళున్నాయి. క్రింది మూడు అరలకి తలుపులూ, వాటికి తాళాలూ వున్నాయి. కొన్ని ఫైళ్లు, లెడ్జర్లూకూడా నిర్లక్ష్యంగా పడేసివున్నాయి. వీటన్నిటిలో లాల్ దృష్టి నాకర్షించింది ఓమూలవున్న లెటర్ పాడ్.

ఆ లెటర్ పాడ్ మీద ఏవేవో అంకెలు, పిచ్చిగీతలూ వున్నాయి. సిరాతో వ్రాయడంవలన వాటిలో చాలా వరకు నీటిబిందువులు పడి చెదిరిపోయినట్లున్నాయి.

లాల్ ఛటుక్కున నేలమీదకు వంగి చూశాడు. అలాగే చూస్తూ తలుపువరకూ నడిచాడు. మరుక్షణం అతని పెదవులమీద మందహాసం చోటుచేసుకుంది.

"వహ్వా! రాత్రి వర్షంలో ఇక్కడికొచ్చిన మనిషి చాలా తెలివిగా అడుగుజాడల్ని శుభ్రంచేయడం జరిగిందన్నమాట!"

"ఎవరు?"

లాల్ తలెత్తి ద్వారంలో నిలబడ్డ జాన్ ని చూశాడు: "ఎవరికి తెలుసు? శైలజ వర్షంలో రాలేదు—నోట్ ది

పాయింట్."

జాన్ నేలమీద చూశాడు. అక్కడక్కడ లేత గోధుమ వర్ణంలో మరకలు కనిపిస్తున్నాయి.

"శైలజ కథనం నేను నమ్మను!" అన్నాడు జాన్, "ఈ రిస్టువాచీ ఆమెది. దీన్ని ఎప్పుడు, ఎక్కడ పోగొట్టుకుందో చెప్పలేకపోతోంది! కాని—రాత్రి సులోచనతో ఘర్షణలో జారిపోయి వుండవచ్చని అంది. అంతవరకు బాగానే వుంది. అయితే, ఆమె రాత్రి ఎనిమిదిన్నరవరకే ఇక్కడ వున్నానని చెప్తోంది. మరి ఈ గడియారం తొమ్మిది గంటలెలా చూపిస్తోంది? అబద్ధాలకోరు క్లయింట్! ఆమె మనకొద్దు!"

"జాన్! అంత తేలిగ్గా నిర్ణయానికి రావద్దని చెప్పాను. ఇప్పుడీ వ్యవహారం చాలా క్లిష్టంగా తయారైంది. మరి కొందరు వ్యక్తులు వెలుగులోకొస్తే తప్ప ప్రయోజనం శూన్యం—"

లాల్ బయటకు వెళ్ళి గచ్చును జాగ్రత్తగా చూస్తూ నడిచాడు. హాల్లో కొంతవరకే మరకలు కన్పించి అదృశ్యమయ్యాయి.

బెడ్‌రూంలోకూడా వెళ్ళి జాగ్రత్తగా చూశాడు. అక్కడా కన్పించలేదు.

గబగబ బయట వరండాలోకొచ్చి చూశాడు. అస్పష్టంగా కన్పించాయి. కానీ, క్రింద మట్టి నేలలో కన్పించలేదు.

తిరిగి ఆఫీసు గదిలోకొచ్చి ఈసారి వస్తువుల్ని జాగ్రత్తగా పరిశీలించసాగాడు. టేబిల్ మీద లెటర్ పాడ్ కాయితాన్ని చింపి జేబులో పెట్టుకున్నాడు. వేలిముద్రల నిపుణుడ్ని పిలిచి లైటు స్విచ్ మీద, తలుపులమీద,

టేబిల్ మీద, బీరువా సొరుగులమీదా వేలిముద్రలకోసం గాలించమన్నాడు.

అయినా అతని మనసు నేలమీదే కేంద్రీకృతమై వుంది. మళ్ళీ నేలమీద వంగి గది అంతటా చూశాడు. లేత గోధుమవర్ణంలో మరకలు అంచనాకు మించి కన్పిం చాయి: కొన్ని ద్వారంవైపు వెళ్తూ, కొన్ని టేబిల్ చుట్టూ, మరికొన్ని బీరువా దగ్గర....

"కమాన్ !బాత్ రూం కెళ్దాం!" అన్నాడతను హఠా త్తుగా.

అప్పుడే కృష్ణన్ లోనికొచ్చాడు: "ఎందుకు? మూత్రా నికా?"

"ఆ అవసరం మీ కొచ్చిందా? అభ్యంతరం లేదు, వెళ్ళిరండి!"

కృష్ణన్ నవ్వాడు, "ఇందాకట్నించీ చూస్తున్నాను— మీరు అల్సేషియన్ కుక్కలా ఇల్లంతా తిరుగుతూ...."

"అడుగు జాడల్ని గాలిస్తున్నాను. ఈ అడుగుజాడలు నీటితో కడిగి వెయ్యబడ్డాయి.... నేనిప్పుడు బాత్ రూం కెందుకు రమ్మన్నానో అర్థమైందా?"

కృష్ణన్ తలూపి వెంట వెళ్ళాడు.

బాత్ రూంలో రెండు ఇత్తడి బకెట్లు, రెండు బిందెలు మూడు చెంబులు శుభ్రంగా కడిగి వరుసగా పెట్టి వున్నాయి—తళతళ మెరుస్తూ. వాటిలో నీటిచుక్క లేదు. గది నేల పొడిగా వుంది. తడిసిన గుడ్డలు ఎక్కడా లేవు.

లాల్ బయటికి వచ్చి పెరట్లోకి దారితీశాడు. పెరటి తలుపు లోపలినుంచి తాళం వేసివుంది. గోడ పదడుగుల ఎత్తు వుంది. గోడదగ్గర ఎక్కడా నేల చెదిరి లేదు.

"వర్షంలో వచ్చిన మనిషి వర్షంలోనే వెళ్ళివుండాలి-

అందుకే అడుగుజాడలు లేవు, ఇంట్లో తప్ప!" అన్నాడు లాల్.

"వచ్చిందెవరు?"

"చెప్పలేను."

"సరే—లాల్—ఆ అమ్మాయి మాపులు నాకు నచ్చడం లేదు. ఆమె ఎవరు? ఈ కేసు పూర్వాపరాలేమిటి?"

లాల్ ఇంట్లోకి నడుస్తూ అన్నాడు, "నాకు కొన్ని ముఖ్యమైన పనులున్నాయి. కేసు వివరంగా జాన్ మీకు చెప్తాడు. ఇక్కడ మీ పని ముగిశాక మా ఆఫీసుకి తీసు కెళ్ళి మీకో వస్తువు బహూకరిస్తాడు."

"ఏ వస్తువు?"

"హత్యాయుధం....కమాన్, శైలజా! మనం మీనన్ ఇంటికెళ్దాం" లాల్ శైలజ మోచెయ్యి పట్టుకొని బయటికి దారితీశాడు.

## 4

సోమాజిగూడలో ఒక ఇంటిముందు కారాపి, "ఈ ఇల్లేనా?" అనడిగాడు లాల్.

శైలజ తలూపింది. ఇద్దరూ కారు దిగి లోనికి నడిచారు. మెట్లదగ్గర ఓ ఆరేళ్ళ అబ్బాయి ఎదురుపడి; "ఆంటీ! డాడీ ఇల్లాయ్!" అనర్చాడు.

లాల్ తికమకగా చూశాడు.

"మళయాళం" అంది శైలజ, "కిట్టూ! నీ మమ్మో ఏతుః?"

"అకత్తు వాయిక్కున్ను కయూణుః!"

"విళిక్కు!"

కిట్టూ లోనికురికాడు.

లాల్ శైలజను ఆశ్చర్యంగా చూశాడు, "మీకు

మళయాళం వచ్చా?"

శైలజ నవ్వింది. "అంతంతమాత్రం. కానీ మీనన్‌కూ అతని భార్యకూ తెలుగు బాగా వచ్చు."

లోపలినుంచి ఓ ముప్పై ఏళ్ళ స్త్రీ బయటకొచ్చింది. ఆమెను చూస్తూనే శైలజ కళ్ళలో నీళ్ళు పెల్లుబికి వచ్చాయి. పరిగెత్తి వెళ్ళి గట్టిగా చుట్టుకుంది.

ఆ స్త్రీ కంగారుపడి, లాల్‌ని అయోమయంగా చూస్తూ, "శైలజా! ఏం జరిగింది? ఆయనెవరు?" అంది.

"డిటెక్టివ్ లాల్!....అక్కా, నన్నిక నువ్వే రక్షించాలి!"

"ఎందుకు! ఏం జరిగిందసలు!"

శైలజ ఆమెను విడిచి దూరంగా జరిగింది: "నువ్వూహించనిది-నేనూ వూహించనిది-సులోచన చనిపోయింది; హత్య చేయబడింది!"

ఆ స్త్రీ వూపిరి బిగబట్టింది "ఏమిటీ! నువ్వనేది—"

"క్షమించండి" లాల్ ముందుకెళ్ళి అన్నాడు. "నేను మీ భర్తని కలుసుకోవాలి. ఆయనెక్కడున్నారు?"

ఆమె నెత్తురుచుక్క లేని ముఖంతో లాల్ దగ్గర కొచ్చింది. అతన్ని పరీక్షగా చూసి, పూడుకుపోయిన స్వరాన్ని సవరించుకొని, "నా పేరు వాసంతి" అంది. ఆ తర్వాత అనుమానంగా చూస్తూ ఆతృతగా అడిగింది:

"నాకేమీ అర్థంగావడం లేదు. సులోచన చనిపోయిందా? ఇది నిజమా. నేను నమ్మను"

"నేను మీవారి గురించి అడిగాను."

ఆమె నిట్టూర్చింది, "క్షమించండి, ఆయనెక్కడికెళ్ళారో నాకు తెలియదు. ఉదయం పది గంటలకు డిటెక్టివ్ దినేష్‌తో వెళ్ళారు....ఎక్కడికో తెలీయదు."

లాల్ ముందుకు జరిగాడు "డిటెక్టివ్ దినేష్? దేనికి? అతనితో ఏం పని?"

"ఆయన—వ్యవహారాలు నాకు తెలియవు."

"దినేష్ అడ్రసు ఏమిటి?"

"తెలియదు."

"ఫోన్ నెంబర్?"

"అదీ తెలియదు! అతనీ మధ్యే బెంగుళూరు నుంచి వచ్చి ఆఫీసు తెరిచాడు."

"అతను మీ వారితో ఏం మాట్లాడాడో తెలుసా?"

"తెలియదు."

"సరే, సాంబశివరావు గురించి మీకు తెలుసా?"

"ఆయన కేమయింది?"

"ఆయన నిన్నటినించి కన్పించడం లేదు."

"ఓహ్! ఏమిటిది? అసలేం జరిగిందో నాకు చెప్పండి! రావ్ ఎక్కడికెళ్ళారు? సులోచనను ఎవరు చంపారు? శైలజ ఎందుకిలా భయిపడుతోంది? మీ రెవరి తరఫున-"

ఆమె ప్రశ్నల వర్షానికి అడ్డు తగిలాడు లాల్, "మీ వారికి ఆఫీసు వుందా?"

"—కానీ అక్కడి కెళ్లారనుకోను."

"ఎందుకనుకోరు?"

"ఈ మధ్య ఆయన బయటి పనులతో బిజీగా వుంటున్నారు."

"సరే—ఆఫీసు అడ్రసు ఇవ్వండి—అదృష్టాన్ని పరీక్షించుకుంటాను."

వాసంతి అడ్రసు చెప్పింది. లాల్ థాంక్స్ చెప్పి సెలవు తీసుకొంటూ శైలజను చూశాడు.

"నేను మీతో రాను!" ఛటుక్కున అందామె.

"అవును, లాల్. ఆమె నిక్కడే వుండనివ్వండి!" వాసంతి అంది.

లాల్ ఇద్దర్నీ తదేకంగా చూసి సరేనని తలూపాడు.

# 5

జూబ్లీ ట్రాన్స్‌పోర్ట్ కంపెనీ ఆఫీసు టాంక్‌బండ్ దగ్గర సాగర్ వ్యూ బిల్డింగ్ రెండో అంతస్తులో వుంది.

లాల్ అక్కడికి చేరుకొని, ఆఫీసుబాయ్ వారిస్తున్నా అతన్ని మృదువుగా ప్రక్కకు తప్పించి, స్వింగ్ డోర్స్ నెట్టుకుంటూ లోనికెళ్ళాడు.

లోపల ఎదురెదురుగా కూర్చున్న ఇద్దరు వ్యక్తులు అవాక్కయిపోయి మాటలాపేశారు.

వాళ్ళలో నలభై ఏళ్ళ మనిషి లాల్‌ని ఎగాదిగా చూసి "లోనికొచ్చే ముందు తలుపు తట్టడం సాంప్రదాయం. ఎవరు మీరు?" అనరిచాడు.

"నా పేరు లాల్. డిటెక్టివ్‌లు కొన్ని సమయాల్లో సాంప్రదాయాల్ని పాటించవనసరం లేదనుకొంటాను...."

మరో మనిషి—పాతికేళ్ళ యువకుడు ఛటుక్కున లేచి, "గ్లాడ్‌టు మీట్యూ, మిస్టర్ లాల్!" అంటూ కరచాలనం చేసి, "మిస్టర్ మోనన్! నన్ను కిక్ ఇచ్చి ఈ కేసును మిస్టర్ లాల్ కప్పగిస్తారని నాకు తెలియనే లేదు!" అన్నాడు.

మోనన్ ముఖం చిట్లించి కలవరంగా చూశాడు.

ఆ యువకుడు నిండుగా నవ్వి అన్నాడు. "కూర్చోండి, మిస్టర్ లాల్! ముందు నన్ను పరిచయం చేసుకోనివ్వండి! నా పేరు దినేష్—డిటెక్టివ్‌ని. నెలరోజుల క్రితం ఇక్కడ ఆఫీసు తెరిచాను. మా వూరు బెంగుళూరు. అక్కడ తెలి

సిన ముఖాల్లో విలువ వుండదని ఇక్కడికొచ్చాను."

లాల్ కూడా నవ్వాడు. "చాలా సంతోషం. మీ గురించి నేనింకా విన్లేదు. ఇక్కడ పోలీసుల పర్మిషన్ తీసుకున్నారా?"

"నా లైసెన్స్ దేశవ్యాప్తంగా చెల్లుతుంది."

"మీ రేదేనా కేసును దేశవ్యాప్తంగా పర్యటించి దర్యాప్తు చేయవచ్చు. కానీ ఎక్కడైనా ఆఫీసు తెరవాలంటే పోలీసు పర్మిషన్ లేనిదే అసాధ్యం—మీరు చట్టాన్ని రక్షించాలనుకుంటే—అందుకు పోలీసుల సహకారం వుండాలనుకుంటే—"

ఈ మాటలు విని దినేష్ ముఖం ఎర్రబడింది.

"ఆ విషయం నాకు తెలుసు. నేనిక్కడ కొత్త. నాకిక్కడ నమ్మకం కుదిరితే తప్పక పర్మిషన్ కోరుతాను."

"నన్ను కలవండి—మీ పని సులువు చేస్తాను."

"థాంక్యూ! అయితే మీరిక్కడికి......... ఎందుకు వచ్చారు?"

"మీ క్లయింట్‌తో మాట్లాడాలి. డోంట్ బాదర్, మీనన్ మీ క్లయింటే."

మీనన్ అనుమానంగా చూసి, "ఏం మాట్లాడాలి?" అన్నాడు.

"మీరు సౌత్ ఇండియా ఎంటర్‌ప్రైజెస్ ఫరంలో పెట్టుబడి పెట్టారా?"

"అవును."

"అయితే మీ పార్టనర్ సాంబశివరావు గురించి మాట్లాడాలి."

మీనన్ సిగరెట్ వెలిగించి నింపాదిగా అన్నాడు, "నా పార్ట్‌నర్ సాంబశివరావు నిన్న సాయంత్రంనుంచీ

కన్పించడంలేదని శైలజ ఇందాక ఫోన్ చేసింది. అంతకు మించి నాకేమీ తెలియదు. ఆ కంపెనీలో నేను వర్కింగ్ పార్ట్ నర్ ననిగాను—స్లెలెంట్ పార్ట్ నర్ ని—పెట్టుబడి పెట్టాను అయిదేళ్ళక్రితం. బిజినెస్ వ్యవహారాలతో నాకు సంబంధం లేదు. సంవత్సరాంతానికి లాభాలు తీసుకోవడమే నా పని!"

"ఎంత వాటా వుంది?"

"ఇరవై అయిదు శాతం. యెందుకు?"

"లాభాలెలా వుంటున్నాయి?"

"లాభాలు తృప్తికరంగా లేకపోతే వాటా వాపసు. స్టాపిట్! అసలేమిటీ ప్రశ్నలు?"

"లాభాలు తృప్తికి మించి వుంటున్నాయా?"

"ఉంటున్నాయి, కానీ...."

"ఏమిటి?"

"ఈ ప్రశ్నలు దేనికి?"

"మీరు మాట మార్చేస్తున్నారు. లాభాలు తృప్తికరంగా వుంటున్నాయో, లేదో నిస్సందేహంగా చెప్పండి!"

మీనన్ లాల్ ని ఓసారి తీక్షణంగా చూసి, "తృప్తికి మించి వుంటున్నాయి - సందేహం లేదు. కానీ ఈ సందేహాలన్నీ మీ కెందుకో అంతుబట్టడంలేదు. మీరిప్పుడైను మార్చేశారా—డిటెక్షన్ నుంచి టాక్స్ ఆఫీసరుకి?"

"మేం అన్ని వేషాలూ వేస్తాం కదూ దినేష్? ఓ. కే. మిస్టర్ మీనన్, ఇక రావ్ గురించి చెప్పండి: అయన ఎక్కడికి కెళ్ళారు?"

"ముందే చెప్పాను-నాకు తెలియదు."

"ఆయన చాలా అసాధారణ పరిస్థితుల్లో అదృశ్య

మయ్యారు. లేక ఆయన అదృశ్యమే అలాంటి పరిస్థితులకి దారితీసి వుండవచ్చు. ఆయన ఆచూకీ తెలుసుకోవడం ఇప్పుడు చాలా ముఖ్యం!"

"నన్నడుగుతా రెందుకు! ఆయన భార్య నడగండి! స్నేహితుల్నడగండి! స్టాఫ్ నడగండి!" తీవ్రస్వరంతో అన్నాడు మీనన్.

"ఇక్కడికి రాకముందు ఆ ప్రయత్నాలన్నీ చేశాను. ఫలించలేదు. ఆయన సిటీలో లేరని తెలిసింది. ఆయన ఎవరికీ చెప్పకుండా మాయమయ్యారు. అయినా ఆయన పార్ట్‌నర్‌గా మీరేమీ కంగారు పడకపోవడం కొన్ని అనుమానాలను కలిగిస్తోంది...."

"నా మీద అనుమానమా!"

"నిస్సందేహంగా! రాత్రి ఆయన భార్య హత్యచేయబడింది. ఆధారాల్నిబట్టి నిన్న సాయంత్రంనుంచీ రావ్ ఇంటికి రాలేదు. ఆమె హత్య, ఆయన అదృశ్యం, ఇక్కడ మీరు డిటెక్టివ్‌తో చర్చలు.... వెల్, వీటన్నిటికీ ఏదో సంబంధముందనుకొంటున్నాను."

మీనన్ తటాలున లేచాడు. లాల్ చేతులు పట్టుకుని "సులోచన హత్య చెయ్యబడిందా?" అనర్చాడు.

అతని ముఖంలో తెచ్చిపెట్టుకున్న కంగారు చూసి లాల్ నవ్వాడు.

"ఈ విషయం మీకు ముందే తెలుసుకదూ?"

"ఏమిటీ! నాకిప్పుడే తెలిసింది."

"—అని మీ మాటలు చెప్తున్నాయి. ముఖం కాదు. మీరు నటిస్తున్నారు. చాలా విషయాలు దాస్తున్నారు" అన్నాడు లాల్ మీనన్‌ను చూసి నవ్వుతూ "రాత్రి మీరు రావ్ ఇంటికెళ్ళారు. అప్పుడక్కడ సులోచనతో

శైలజకు ఘర్షణ జరుగుతోంది. శైలజ తప్పించుకొని వెళ్ళిపోయాక మీరింట్లో ప్రవేశించి దుస్తులు మార్చుకొంటున్న సులోచనను షూట్ చేశారు. ఆ తర్వాత రివాల్వర్‌ని శైలజ బ్యాగులో పెట్టారు. ఇప్పుడు దినేష్‌తో ఈ హత్య విషయంలో తీసుకోవల్సిన జాగ్రత్తల్ని చర్చిస్తున్నారు."

మీనన్ ముఖంలో నెత్తురుచుక్క లేదు.

"మిస్టర్ లాల్!" దినేష్ అర్చాడు కోపంగా చూస్తూ "మీరు అర్థంలేని ఆరోపణలు చేస్తున్నారు. మీనన్‌తో నా సంబంధాన్ని అపార్థం చేసుకుంటున్నారు. ఆయన నా సహాయం ఇవాళ కోరలేదు—వారం క్రితం కోరారు. ఆయనకు ఏ హత్య గురించీ తెలియదు. ఒక కంపెనీ కేసులో సాక్ష్యాధారాల్ని సేకరించడానికి నన్ను నియమించారు. వారం రోజులుగా నా దర్యాప్తు కొనసాగుతోంది. ఆయన్ను రోజూ కలుసుకొంటున్నాను."

"ఏ కేసు దర్యాప్తు చేస్తున్నారు?"

"ఒక కంపెనీకి సంబంధించింది. ఆ కంపెనీ మిస్టర్ మీనన్‌ను చీట్ చేస్తోంది. ఇంతకంటే ఏమీ చెప్పలేను. ఈ వృత్తి నియమాలు మీకు తెలుసు."

# 6

జాన్ గుప్పుమని సిగరెట్ పొగ వదిలి నవ్వాడు. "ఈ కేసు అటర్ ఫ్లాప్ అవుతుంది పార్ట్‌నర్! భారీ తారాగణం వున్నా పసలేని కథతో ముస్తాబయిన సినిమాలా! నెవర్ మైండ్, కృష్ణన్‌కు రివాల్వర్ ఇచ్చాను. ఈ కేసు వివరించి చెప్పాను. చక్కగా విని ఆనందించాడు. ఈ రివాల్వర్ మీద శైలజ కోమలమైన వ్రేళ్ళ తాలూకు ముద్రలుంటాయి. మరి కాస్సేపట్లో ఆమె మృదు

వైన హస్తాలకు ఇనప సంకెళ్ళు పడతాయి—పూర్ క్రీచర్. ఇంకా నువ్వామె గురించి ఎందుకు తాపత్రయ పడుతున్నావు?"

"నువ్వామె పరిస్థితి చూసి ఎందుకానంద పడుతున్నావు?" అన్నాడు లాల్ కఠినంగా. "రాత్రి ఆమె రావ్ ఇంటికెళ్ళింది గనుక—సులోచన చేతిలో రివాల్వర్‌తో ఘర్షణ పడింది గనుక—హత్యాస్థలంలో ఆమె రిస్టువాచీ ఆమె మాటల్ని అబద్ధం చేసింది గనుక — నువ్వామె ననుమానిస్తున్నావా?

"వెల్, హత్య జరిగినప్పుడు సులోచన ఒంటిమీద చీర లేదు, జాకెట్ లేదు. ఒప్పుకొంటావా? అంటే ఆమె ఒంటిమీద బ్రా, పావడాతో శైలజతో తలబడిందా? శైలజ వెళ్ళి తలుపు తడితే—అప్పుడే పార్టీనుంచి వచ్చి దుస్తులు మార్చుకొంటున్న సులోచన అర్ధ నగ్నంగా వచ్చి తలుపు తీసిందా? ఆలాటి పని సభ్యతగల ఏ స్త్రీ చెయ్యదు."

"అలా ఎందుకు చెయ్యాలి? శైలజ వెళ్ళి తలుపు తడితే సులోచన వచ్చిందెవరో అడిగి తెలుసుకుని-తలుపు తీసే వుంది లోనికి రమ్మని కేకేసి వుండాలి. అప్పుడు శైలజ లోనికెళ్ళి, అర్ధనగ్నంగా వున్న సులోచనతో..." జాన్ మాటలా పేశాడు. ఉన్నట్టుండి అతని కళ్ళు మెరిశాయి.

"అసలు సులోచన అర్ధనగ్నంగా ఎందుకుండాలి? ఆమె జాకెట్ మీద బుల్లెట్ రంధ్రం లేదు గనుకనా! హత్య జరిగాక హంతకురాలు శవంమీద చీర, జాకెట్ తీసేసి—రంధ్రం పడ్డ జాకెట్‌ను మాయంచేసి, మరో జాకెట్ అక్కడ ఎందుకు పడెయ్యకూడదు?"

లాల్ ఉలిక్కిపడ్డాడు. "అవును, అలా జరగవచ్చు. పార్టీ కెళ్ళినప్పుడు ఆమె ఎలాంటి జాకెట్‌లో వుందో తెలుసుకోవాలి."

జాన్ నవ్వాడు "అలాటి జాకెట్లు ఆమెకెన్ని వున్నాయో తేలుసుకోలేం."

"డామిట్! ఇక ఆ విషయం వదిలెయ్. జరుగుతున్న సంఘటనల్ని బట్టి చూస్తే మీ నన్ డిటెక్టివ్ సహాయం కోరడం నా కనుమానం కలిస్తోంది."

"రాత్రి అతని ఎలిబీ చెక్ చేస్తే అనుమానం తీరుతుంది. హత్య జరిగిన యింట్లో అడుగు జాడలు యెవరివో కావు. శైలజవి. ఆమె వర్షం పడక ముందు అక్కడికెళ్ళలేదు. పడుతున్నప్పుడు వెళ్లి హత్య చేసింది. అందుకే అడుగు జాడల్ని—"

హఠాత్తుగా ఫోను మ్రోగడంతో జాన్ చిన్నగా నవ్వి "కృష్ణన్ అనుకుంటాను" అన్నాడు. "శైలజ అరెస్టు గురించి శుభవార్త చెప్పడానికి...."

లాల్ రిసీవర్ అందుకున్నాడు "యస్, లాల్ హియర్" అన్నాడు.

"మిస్టర్ లాల్, నేను సాంబశివరావుని" అంది అవతలి కంఠం.

"వాట్?"

"మిస్టర్ లాల్! నేనిప్పుడే వచ్చాను. ఇంటికెళ్లి పొరుగువాళ్ల నోటినుంచి దారుణమైన వార్త విని చలించిపోయాను. నా భార్య చనిపోయింది! ఘోరమైన చావు" రావ్ గొంతు ఒక్కసారిగా పూడుకుపోయింది. "రాత్రి నేను ఇంట్లో వుండి వుంటే.... ఓహ్! ఈ దారుణం జరిగేది కాదు. ఇలా జరుగుతుందని కల్లో కూడా...."

"రాత్రి మీ రెక్కడున్నారు!" లాల్ అడ్డు తగిలాడు.

"విజయవాడలో. మిస్టర్ లాల్, మీరు శైలజను తీసుకెళ్ళారని తెలిసింది—ఆమె ఏం చేసింది? దయచేసి ఒకసారి నా ఆఫీసుకొస్తారా ఆమెతో, విషయాలు వివరంగా మాట్లాడుకుందాం?"

"అలాగే, మీరక్కడే వుండండి" లైను కట్ చేసి లేచాడు లాల్.

జాన్‌కు విషయం చెప్పి, మీనన్ ఇంటికి ఫోన్ చేసి శైలజను తక్షణం ఆమె ఆఫీసుకు బయలుదేరమన్నాడు.

ఆ తర్వాత డిటెక్టివ్‌లు సాంబశివరావు ఆఫీసుకెళ్ళారు. ఆఫీసు ముందు కారాగడం, ఆటోలోంచి శైలజ దూకడం ఒకేసారి జరిగాయి. ఆమె ఫేర్ చెల్లించడం మర్చిపోయి కంగారుగా వచ్చి లాల్ చెయ్యి పట్టుకొంది.

"ఏం జరిగింది? బాస్ వచ్చారా?"

లాల్ తలూపాడు.

"ఓహ్! నా ముఖం ఎలా చూపించను!"

"ఎలాంటి భయం లేకుండా; ఎలాంటి భావాలు కన్పించకుండా."

లాల్ ఆమెతో ఆఫీసులో కెళ్ళాడు. జాన్ ఆటో ఫేర్ చెల్లించాడు.

ఆఫీసులో రావ్ అసహనంగా పచార్లు చేస్తూ కన్పించాడు. అతని బట్టలు మాసిపోయి వున్నాయి. ముఖం అలసిపోయింది, జుత్తు రేగిపోయింది. ఎడతెరిపి లేకుండా సిగరెట్ పీల్చేస్తున్నాడు.

లాల్ శైలజతో లోనికెళ్ళి కూర్చున్నాడు. తర్వాత జాన్ వచ్చాడు.

లాల్ ఒకసారి గడియారం చూసుకొని, రావ్‌ని చూసి

అన్నాడు:

"మిస్టర్ రావ్! నిదానించండి. ప్రాణం లాటరీలో డబ్బులాటిది—పోతే తిరిగిరాదు! కాబట్టి కర్తవ్యం ఆలోచించండి. మీరెంత మనసు విప్పి మాతో మాట్లాడితే అంత త్వరగా మీ భార్య హత్యకు కారణమైన వ్యక్తిని శిక్షించి ఆమె ఆత్మకు శాంతి చేకూర్చినవారవుతారు—"

రావ్ కొన్ని క్షణాలు నిశ్చలంగా లాల్ ముఖంలోకి చూసి అన్నాడు:

"నన్నేం చేయమంటారు? నా భార్య హంతకుడ్ని పట్టుకోడానికి నేనెలా ఉపయోగపడతాను? చెప్పండి!"

"నిన్న మీరు ఆకస్మాత్తుగా ఎవరికీ తెలియకుండా విషయవాడ ఎందుకెళ్ళారు?"

"నా పర్సనల్ పనిమీద. నిన్న మధ్యాహ్నం విజయవాడలో పార్టీనుంచి ఫోన్ వచ్చింది. సులోచనతో పార్టీకి వెళ్ళే ప్రోగ్రాం కాన్సిల్ చేసుకొని బయలుదేరాను. నిన్న ఎనిమిది గంటలకు శైలజను రమ్మని చెప్పినట్టుకూడా జ్ఞాపకం. కదూ శైలజా?"

శైలజ తలూపింది.

"ఆ పార్టీ ఎవరు? మీతో ఏం సంబంధం?"

"అది టాప్ సీక్రేట్. నా బిజినెస్ వ్యవహారాల గురించి అడిగే హక్కు మీకు లేదు. ఇలాటి అనవసర ప్రశ్నలతో కాలం వృధా చెయ్యడ మెందుకు? మీ సందేహాన్ని నివృత్తి చేస్తాను, వినండి: రాత్రి నేను విజయవాడలో వున్నట్లు మీకు ఎలిబీ కావాలి. —హోటల్ నరకి మేనేజిమెంటుకి ఫోన్ చేసి నిన్న రాత్రి 12 గంటలకు రూం 124 లో ఎవరు దిగారో కనుక్కోండి. రూం ఎప్పుడు ఖాళీ అయిందోకూడా కనుక్కోండి.

"ఈ మధ్యాహ్నం 11 గంటలకు ఖాళీచేశాను. ఆ మధ్య కాలమంతా ప్రతి క్షణానికీ నా కదిలికలు తెలుసుకోవాలంటే వీలుగాదు. నేనక్కడ కలుసుకున్న వ్యక్తుల గురించి చెప్పను. అయినా నా భార్య హత్యలో నన్నే అనుమానిస్తారనుకోను."

"మేం అనుమానించడంలేదు, వాస్తవాలు సేకరిస్తున్నాం. మీనన్ మీద మీ అభిప్రాయమేమిటి?"

"అతనికీ వ్యవహారంతో సంబంధం ఏమిటి!"

"అతనొక డిటెక్టివ్ సహాయం కోరుతున్నాడు. అందుకేదో కారణం చెప్పినా అది సబబనిపించడంలేదు. మీలాగే రహస్యాలు దాస్తున్నాడు. నిన్నరాత్రి ఇక్కడ వర్షం కురిసింది. మీ ఇంట్లో చాలా అడుగుజాడలు కనిపించాయి. రాత్రి మీ ఇంట్లో ప్రవేశించిన మనిషి దేనికోసమో సోదా జరిపి వుండాలని నా అనుమానం...."

రావ్ ముఖం ఆకస్మాత్తుగా ఎర్రబడింది.

లాల్ మళ్ళీ అన్నాడు, "మీ కంపెనీలో అతనికి మంచి లాభాలొస్తున్నాయని చెప్పాడు. కానీ, ఆ మాటలు మనస్ఫూర్తిగా అన్నట్లు అతని ముఖం చెప్పలేదు. మీ భార్య హత్యగురించి చెప్పినప్పుడుకూడా కృత్రిమంగా కంగారు కనబర్చాడు. అంతేకాదు, డిటెక్టివ్ దినేష్‌కూడా తాను రహస్యం దాస్తున్నాననుకొంటూనే నిజం చెప్పేశాడు. అతనొక కంపెనీ చీటింగ్ కేసు దర్యాప్తు చేస్తున్నాడట....మీరు మీనన్‌ని చీట్ చెయ్యడంలేదూ?"

రావ్ బోనులోపడ్డ ఎలుకలా చూశాడు. కాస్సేపటి తర్వాత ఒక నిశ్చయానికి వచ్చి అన్నాడు:

"మిస్టర్ లాల్, ఒక నేను మీ దగ్గర రహస్యాలు దాచను! పరిస్థితి పూర్తిగా అర్థమైపోయింది! మీనన్

మాటల్లో మీరు పసిగట్టిన నిజం నిజమే! మూడేళ్ళనుంచి కంపెనీకి లాభాలు రావడంలేదు. నేనతన్ని చీట్ చేస్తున్నాను. తప్పుడు లెక్కల్లో నష్టాన్ని సృష్టించి ఈ మూడేళ్ళు అక్రమంగా కొంత డబ్బు నాస్వంతం చేసుకొన్నాను. దాన్ని కొందరికి లోన్సుగా ఇచ్చాను. అది బ్లాక్ మనీ—కాబట్టి సెక్యూరిటీ బాండ్స్ రహస్యంగా దాచాను. ఆ బాండ్స్ కొన్నాళ్ళకి చెల్లిపోయి వడ్డీతో సహా డబ్బంతా తిరిగి వస్తుంది. కాబట్టి ఆ డబ్బును ఒక సినిమా డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీలో పెట్టుబడి పెట్టాలనుకున్నాను. అందుకే నిన్న విజయవాడకూడా వెళ్ళి వచ్చాను. నెల రోజుల్లో డబ్బు సిద్ధంచెయ్యాలి.

"కానీ ఈ విషయాలన్నీ మోనన్ యెలా తెలుసుకున్నాడో అర్థం గావడం లేదు. అతను డిటెక్టివ్‌ను నియమించాడంటే కచ్చితంగా ఆ బాండ్స్‌ని గాలించి కోర్టులో దావా వేయడానికే!"

"ఆ బాండ్స్ మీరెక్కడ పెట్టారు?"

"ఇంట్లో, నా ఆఫీసులో కాదు—మరో చోట రహస్యంగా. ఆ బాండ్స్ కారణంగానే నా భార్య ప్రాణాలు కోల్పోతే అందుకు ప్రాయశ్చిత్తంగా నా నేరాన్ని ఒప్పుకొని శిక్ష అనుభవించడానికి సిద్ధంగా వున్నాను."

లాల్ తేలిగ్గా నిట్టూర్చి జాన్‌ని చూశాడు.

"సరే, మీరు వెళ్ళి బాండ్స్ వున్నాయో, లేవో చూడండి. లేకపోతే పోలీసులు సెర్చి వారంట్‌తో మోనన్ దగ్గరికెళ్తారు. వుంటే, మౌనంగా వుండిపోండి—మీరు చీట్ చేస్తున్నట్టు మోనన్ ఆరోపించేవరకూ. ఇక, మీ రివాల్వర్‌తో మీ భార్య హత్య జరిగిందని మీకు తెలుసా?"

"నా రివాల్వర్‌తోనా!" రావ్ అర్చాడు.

"అవును. మీ రివాల్వర్‌తోనే!"

"ఓహ్, దాన్ని శైలజకిచ్చాను!"

"నాకిచ్చారా!" అయోమయంగా అంది శైలజ.

"నాన్సెన్స్! వారం క్రితం షూటింగ్ నేర్చుకొంటా నంటే నాగార్జునసాగర్ తీసికెళ్ళి నేర్పిందెవరు?"

"కానీ—తర్వాత దాన్ని మీ కార్లోనే పెట్టేశాను!"

"ఎక్కడ?"

"గ్లోవ్ కంపార్టుమెంట్‌లో!"

"మరి నాకెందుకు చెప్పలేదు?"

"ఎలా చెప్పాలి! చెప్పే అవకాశం, సమయం, మీ వెకిలిచేష్టలతో.... చిలిపి మాటలతో నాకిస్తేనా!"

రావ్ ముఖం యెర్రబడింది: "నీ మాటలు మితిమీరుతున్నాయి! నన్నవమాన పరుస్తున్నావు!"

"నిజం చెప్పి నన్ను నేను రక్షించుకోవాలి! మీ పరువు కోసం నేనెందుకు బలికావాలి?"

"ఐసీ! ఆల్‌రైట్ బేబీ! ఈ దశకి యెదిగాక నిన్నింక సహించడం కష్టం. నీ అవసరం నాకు లేదు! వెళ్ళిక్కడ్నించి!"

శైలజ ఛటుక్కున లేచి నిలబడింది: "మీ అవసరం నాకేమిటి? ఈ కష్టాల్లో నన్నాదుకొంటారనుకున్నాను. మీ ముసలి వేషాలకు నేను లొంగని కసితో ఈ విధంగా పగ తీర్చుకొంటున్నారు! పదండి, లాల్! నా ఆత్మాభిమానం ముందు ఈ బోడి వుద్యోగమెంత?"

## 7

జాన్ కారు స్టార్టుచేసి శైలజను చూశాడు: "మీకు షూటింగ్ నేర్చుకోవాలని కోరిక యెందుకు కల్గింది?"

"ఆ కోరిక నాకు కలుగలేదు. ఒకరోజు ఆఫీసులో అతని సొరుగులో రివాల్వర్ చూశాను. దాన్ని చూశాక విచిత్రంగా, వింతగా, అంతలోనే భయంకరంగా— త్రాచుపాములా కన్పించింది. అయినా ధైర్యం చేసి దాన్ని ముట్టుకున్నాను! అప్పుడు నాకు ఇంకా కుతూహలం ఎక్కువై ట్రిగ్గర్ లాగబోయాను....అంతే, అతను గభాల్న లాక్కొని, రివాల్వర్ ప్రయోగించే పద్ధతి అలా కాదని చెప్పాడు."

"తర్వాత?"

"షూటింగ్ నేర్చుకోవాలని ఆసక్తి వుంటే నేర్పుతానన్నాడు. నాకేమీ తోచలేదు. రివాల్వర్ షూటింగ్— అదొక వింత అనుభవంగా వూహించుకొన్నాను! వెంటనే అనాలోచితంగా తలూపేశాను. ఆ నెపంతో అతను నన్ను సాగర్ తీసుకెళ్ళి—"

ఆ తర్వాత ఆమె చెప్పలేకపోయింది. పెదవులు చప్పరించి నిస్సహాయంగా చూసింది.

"మీ పట్ల అతని ప్రవర్తన సవ్యంగా లేకపోతే ఉద్యోగం మానెయ్యాల్సింది."

"అలాగే అనుకొన్నేదాన్ని. కాని, వదిలేస్తే మళ్ళీ దొరకడం యెంత కష్టమో మీకు తెలుసు. కొందరుంటారు—ముసలితనంలో పడుచుతనపు అనుభవాలు గుర్తొచ్చి విపరీత చేష్టలకు పూనుకొంటారు. నిజానికి వాళ్ళకు ఎలాటి ఉద్దేశమూ ఆసక్తీ వుండవు! అమ్మాయిల్ని వేధించి తృప్తిచెందడం అదొక రకం వైపరీత్యం! నేను పట్టించుకునేదాన్ని కాదు."

"మీరు రివాల్వర్‌ని నిజంగా కాల్గోనే పెట్టారా?"

"నిజంగా పెట్టాను. అతను ఒప్పుకోడు—నామీద

కసితో!"

"వీరిద్దరూ నిజం చెప్తుండవచ్చు" లాల్ అన్నాడు, "రావ్ కి తెలియకుండా సులోచన కాల్గోంచి రివాల్వర్ తీసి ఇంట్లో పెట్టివుండవచ్చు. వెల్, మిస్ శైలజ! చూస్తున్నకొద్దీ మీకీ చిక్కుల్లో లోతుగా ఇరుక్కుంటున్నారు. ఇప్పుడు మరొక ఉపద్రవం రాబోతోంది: ఇన్ స్పెక్టర్ మిమ్మల్ని అరెస్టు చేస్తాడు.

భయపడకండి. రివాల్వర్ మీద వేలిముద్రలున్నంత మాత్రాన మీరు హంతకులు కాలేరు. ఈ కేసులో కొన్ని అంశాలున్నాయి: హత్యా సమయం, అనుమానితుల ఎలిబీలు, శవ స్థితి, ఇంకా ఇతర ఆధారాలు—వీటన్నిటినీ జాగ్రత్తగా పరిశీలించి లోపం యెక్కడుందో కనిపెట్టాలి. కాబట్టి నిశ్చింతగా ఉండండి. మా సామర్థ్యం పైన విశ్వాసం వుంచండి...."

# 8

మర్నాడు ఉదయం 11 గంటలకు డిటెక్టివ్ లు కృష్ణన్ ఆఫీసుకు చేరుకొన్నారు.

కృష్ణన్ చుట్టూ నిపుణులమధ్య కూర్చొని చర్చలు జరుపుతూ కన్పించాడు. అతని ముఖం ఉద్రిక్తంగా, ఆందోళనగా వుంది.

లాల్ ముందుకు వచ్చి, "ఏం జరిగింది?" అన్నాడు.

కృష్ణన్ తలెత్తి ఆశ్చర్యంగా చూశాడు. అంతలోనే ఉద్రేకం. ఆందోళన, ఆశ్చర్యం—అన్నీ అణుచుకొని నవ్వాడు:

"ఏమీ లేదు, ఈ కేసు శైలజమీద ఫైలు చెయ్యడానికి అన్ని రిపోర్టులు సిద్ధమయ్యాయి."

"ఏమిటవి?"

కరిష్ణన్ గొంతు సవరించుకున్నాడు.

"హత్య జరిగిన రాత్రి రావ్, మీనన్‌ల ఎలిబీలు చెక్ చేశాను. సందేహం లేదు. హత్య జరిగిన సమయంలో రావ్ విజయవాడ వెళ్తూ దారిలో, ఆ రాత్రంతా విజయవాడలో హోటల్ నర్తకి గదిలో వున్నాడు.

"మీనన్ ఆరోజు సాయంత్రంనుంచీ ఇంట్లోనే వున్నాడు. హత్యా సమయంలో అతనికి బొంబాయి రూట్లో చెక్‌పోస్టునుంచి ఫోన్ వచ్చింది. బొంబాయి నుంచి వస్తున్న అతని కంపెనీకి చెందిన ఒక ట్రక్కును రిజిస్ట్రేషన్‌కు సంబంధించిన కారణాలవలన నిర్బంధించారు. అప్పుడు మీనన్ అక్కడికెళ్ళి వ్యవహారం పరిష్కరించుకున్నాడు. ఈ విషయం నేను చెక్‌పోస్టు అధికారులతో రూఢి చేసుకొన్నాను.

"కాబట్టి హత్యా సమయంలో అనుమానితు లిద్దరూ హత్యా స్థలానికి దూరంగా వున్నారు.

"ఇక - శైలజ నిన్న రాత్రి 8 గంటలకు రావ్ ఇంటి కెళ్ళి 9 గంటలకు తిరిగి వచ్చాననంటోంది గానీ—ఆమె ఫ్లాట్‌కు తిరిగి వచ్చినట్లు ఎలిబీ లేదు. ఆమె ఫ్లాట్‌లో ప్రవేశిస్తోండగా యెవరూ చూడలేదు. ఆమెను డ్రాప్ చేసిన ఆటోవాలా యెవరో తెలియదు!"

కృష్ణన్ అందర్నీ ఉత్సాహంగా చూసి మళ్ళీ అన్నాడు: "కాబట్టి మెడియర్ ఫ్రెండ్—ఆమె తొమ్మిది గంటలకు ఫ్లాట్‌కు చేరుకుందని మీరు నమ్ముతారా? హత్య 9-10 గంటలమధ్య జరిగింది. ఆమె వర్షంలో రావ్ ఇంటికి 9 గంటలకు వెళ్ళింది. నిన్న సాయంత్రం రావ్ నాకు ఫోన్ చేసి శైలజ వారం క్రితం తన రివాల్వర్ తీసుకుందని చెప్పాడు....

"ఆ రివాల్వర్ తిరిగి యివ్వాలన్న ఉద్దేశంతో దానితోబాటు శైలజ రావ్ పిలుపు నందుకొని వెళ్ళింది. అప్పుడే సులోచన పార్టీనుంచి వచ్చి బెడ్ రూంలో బట్టలు మార్చుకొంటోంది. శైలజ వర్షంలో బాగా తడిసి వుండటంవల్ల, చలికి వణుకుతూ తలుపు తోసుకుని లోనికి ప్రవేశించి, ఆఫీసుగదిలోకెళ్ళి చీకట్లో నిలబడింది. కానీ రావ్ ఇంట్లో లేడని ఆమెకు తెలియదు.

"సులోచన ఆమెను పసిగట్టి బయటికి రమ్మని కేక పెట్టింది. అప్పుడామె ఒంటిమీద బ్రా—పావడాతో వుంది. శైలజ భయపడ్తూ బయటికొచ్చింది. భర్త తనను పార్టీకి పంపి, శైలజను యెందుకు రమ్మన్నాడో సులోచన కర్థమైంది. అంతకు ముందునుంచీ వాళ్ళిద్దరి వ్యవహారం ఆమెకు తెలుసు.

"శైలజ బెడ్ రూంలోకెళ్ళాక ఇద్దరిమధ్య ఘర్షణ జరిగింది. పెనుగులాటలో శైలజ రిస్టువాచీ వూడిపోయింది. అది హత్యా సమయాన్ని స్పష్టంగా సూచిస్తుంది—సరిగ్గా 9 గంటలకు. శైలజ సులోచన దాడినుంచి రక్షించుకోడానికి బ్యాగులోంచి రివాల్వర్ తీసింది. అప్పుడు పరిస్థితి ఇంకా విషమించింది. ఇద్దరిమధ్య పెనుగులాటలో శైలజ చేతిలో రివాల్వర్ పేలింది. బుల్లెట్ సులోచన గుండెల్లోకి దూసింది. శబ్దం యెవరికీ వినిపించలేదు—ఆకాశం గర్జిస్తోంది."

"ఆ తర్వాత ఏం జరిగింది?" అడిగాడు జాన్.

"జరిగింది తెలుసుకొని శైలజ కంగారు పడింది. వెంటనే ఆఫీసు గదిలో, హాల్లో, బెడ్ రూంలో, వరండాలో.... అన్నిచోట్లా అడుగుజాడల్ని శుభ్రంగా కడి

గేసి బయటపడింది."

"అంతేనా?"

"అంతే!" కచ్చితంగా చెప్పేశాడు కృష్ణన్.

లాల్, డాక్టర్ వైపు తిరి అడిగాడు, "హత్యా సమయం నిన్న రాత్రి 9-10 గంటలమధ్య నిర్ణయించారా?"

"అవును."

"నమ్మకంగా చెప్తున్నారా?"

"నమ్మకంగానే చెప్తున్నానండీ!"

"హత్యకు ముందు సులోచన తెలివి తప్పిందేమో చెప్పగలరా?"

"చెప్పలేను— తెలివి తప్పించే పదార్థమేదీ ఆమె శరీరంలో లేదు."

"అంతర్గతంగా కాదు.... బహిర్గతంగా ఆమె దేహం మీద తెలివితప్పే వత్తిడి పడిందా?"

"ఆమె తల వెనుక భాగంలో బొప్పి కట్టింది. కాని అది చావుకు ముందు ఏర్పడిందని చెప్పలేను."

"ఎందుకు చెప్పలేరు?"

"బుల్లెట్ దెబ్బ తిన్నప్పుడామె నిలబడివుంది. బుల్లెట్ తగిలి వెల్లికిలా పడింది. అందువల్ల తల బొప్పికట్టవచ్చు."

"బుల్లెట్ సూటిగా గుండెల్లో దూరిందా?"

"లేదు. యేటవాలుగా రాసుకుంటూ వెళ్ళింది — గుండెను గాయపరుస్తూ భుజంలోకి.... తర్వాత బయటికి."

"బయటికా?"

"అవును. యెడమ వక్షంనుంచి భుజంలోకి రంధ్రం వుంది. కానీ బుల్లెట్ లేదు!"

"ఏమైంది?"

"అదే తెలియడం లేదు! ఆ విషయమే చర్చించుకుంటున్నాం. బుల్లెట్ దేహాన్ని చీల్చుకొంటూ బయట కెళ్ళిందన్నది మాత్రం నిశ్చయం. కాని గదిలో ఎక్కడా అది కన్పించలేదు - రక్తంమడుగులో కూడా లేదు!"

"బ్రాలో యిరుక్కొని వుండవచ్చు." జాన్ అన్నాడు.

"లేదు....దుస్తుల్లో యెక్కడా లేదు!"

"శవాన్ని తరలిస్తున్నప్పుడు ఆంబులెన్స్‌లో జారి పడవచ్చు."

"ఆంబులెన్స్‌ని క్షుణ్ణంగా సోదా చేశాం—లేదు!" అన్నాడు కృష్ణన్.

"స్ట్రెచర్ మీద తరలిస్తున్నప్పుడు ఆవరణలో ఎక్కడైనా పడవచ్చు." మళ్ళీ అన్నాడు జాన్.

కృష్ణన్ అడ్డంగా తలూపాడు, "ఇలాటి సంఘటనలు చాలా అరుదుగా జరుగుతాయి. శవాన్ని తరలించినప్పుడే మేం హత్య జరిగిన గదిని సీల్ చేశాం. బుల్లెట్ శరీరం లోంచి దూసుకెళ్ళింది కాబట్టి ఆంబులెన్స్‌లోనో—స్ట్రెచర్‌లోనో—పడే వీలులేదు. గదిలోనో పడాలి! కానీ ఎక్కడా లేదు. మిస్టర్ లాల్, శవాన్ని మొదటిసారిగా మీరే చూశారు—అప్పుడు బుల్లెట్‌ని కూడా చూశారా?"

"లేదు—చూసివున్నా శైలజను కాపాడాలన్న దుర్బుద్ధితో మాయం చేయను!"

"క్షమించండి, నా ఉద్దేశం అది కాదు...."

"ఓ కే! ఇప్పుడు శైలజమీద హత్య యెలా నిరూపిస్తారు? సులోచనను చంపిన బుల్లెట్ ఈ రివాల్వర్ నుంచి వెలువడిందని యెలా అనుకోవాలి?"

"గాయాన్నిబట్టి బుల్లెట్ కాలిబర్‌ను అంచనా వేసి రివాల్వర్ నుంచి వెలువడిందని తెలుసుకోవచ్చు." అన్నాడు కృష్ణన్.

లాల్ తల తిప్పి బాలస్టిక్స్ ఎక్స్‌పర్ట్ ఇస్కిందర్‌ని ప్రశ్నార్థకంగా చూశాడు.

ఇస్కిందర్ అడ్డంగా తలూపి అన్నాడు: "నో సర్, గాయాన్నిచూసి బుల్లెట్ క్యాలిబర్ చెప్పలేం. మోస పోతాం. దేహ-కణాలకి సాగే గుణముంది. బుల్లెట్ తాకి నపుడు దాని క్యాలిబర్‌కు అనుగుణంగా వ్యాకోచించి, తర్వాత ఆ క్యాలిబర్ కంటే తక్కువ పరిమాణానికి సంకోచిస్తాయి. ఈ సంకోచం వివిధ కారకాల మీద ఆధారపడివుంటుంది—నిర్దిష్టంగా అంచనా వేయలేం.

"అయితే, బుల్లెట్‌ని చూసి ఆ గాయం దానివల్ల ఏర్పడిందని సుమారుగా చెప్పగలం.

"కానీ ఈ కేసులో బుల్లెట్ లేదు. అయితే దాని క్యాలిబర్‌ని గాయాన్నిబట్టి గాక బ్రెయిన్‌లో ఏర్పడ్డ రంధ్రం ఆధారంగా అంచనా వేసినా—అది ఈ రివాల్వర్ నుంచే వెలువడిందని చెప్పలేం, బుల్లెట్ లభించేవరకూ.

"ప్రతి బుల్లెట్ ప్రేల్చబడ్డప్పుడు బ్యారెల్ లోపలి తలంలో సూక్ష్మాతి సూక్ష్మంగా, మనిషి వేలిముద్రలవంటి విశిష్టతతో, ప్రత్యేకంగా చెక్కివుండే రేఖాకృతుల్ని సంతరించుకుని బయటపడుతుంది.

"కాబట్టి—ఫలానా బుల్లెట్ ఫలానా రివ్వాల్వర్ నుంచి వెలువడిందని చెప్పడానికి టెస్టు బుల్లెట్స్ పరీక్షలు జరపాలి."

"వెరీ వెల్! అయితే ఈ రివాల్వర్ హత్యకు ఉప యోగించబడిందని చెప్పలేం-అంతేనా?" అన్నాడు లాల్.

"అవును."

"కానీ రివాల్వర్‌లో ఒక బుల్లెట్ షూట్ చెయ్యబడింది కదా!" కృష్ణన్ అరిచాడు.

"మిస్టర్ ఇస్కిందర్, ఈ రివాల్వర్ చివరిసారిగా ఎప్పుడు షూట్ చెయ్యబడిందో చెప్పగలరా?"

"సుమారు 48 గంటల క్రితం."

"ఎలా చెప్తున్నారు?"

"ఈ రివాల్వర్ మీద ప్రయోగాలు చేశాను. ఖాళీ షెల్‌లో బుల్లెట్ అవశేషాలమీద రసాయనిక పరీక్ష—బ్యారెల్ సిలి—ఛాంబర్‌లో గ్యాస్, బ్యారెల్‌లో బేస్ పౌడర్ వాసన తీవ్రత—వీటి నాధారంగా చెప్పగలను."

"సరే, అయితే బుల్లెట్ ఎలా మాయమైందనుకొంటున్నారు."

ఇస్కిందర్ కాస్సేపు సందేహించి అన్నాడు: "బుల్లెట్ ప్రయోగించిన దిశనుబట్టి చూస్తే అది వక్షాన్ని ఎడమవైపునుంచి తాకి, గుండెను రాసుకుంటూ భుజంలోంచి పైకి వెళ్ళింది. అంటే, షూట్ చేసిన మనిషి క్రిందకు వంగి వుండాలి, లేదా నేలమీద కూర్చొని వుండాలి. ఇద్దరి మధ్య సుమారు పదడుగుల దూరం వుండవచ్చు. కాబట్టి ఆ రేంజిలో బుల్లెట్ దేహాన్ని చీల్చుకొంటూ వెళ్ళి గోడలోనో, సీలింగ్‌లోనో ఇరుక్కునే అవకాశం వుంది."

"సీలింగ్ కాంక్రీటుది" అన్నాడు కృష్ణన్.

"ఆ దూరంనుంచి బుల్లెట్ కాంక్రీటులోకి సులభంగా 4 అంగుళాలు, గోడలో ఇటుకలుంటాయి కాబట్టి 4 నుండి 6 అంగుళాలవరకూ దూసుకుపోతుంది."

జాన్ అన్నాడు: "దాని మార్గంలో అడ్డంకులేవీ లేక

పోతే మాసుకుపోవచ్చునేమోగానీ, దేహంలోంచి బయట పడేసరికి అది చాలా శక్తిని కోల్పోయి నీరసించిపోతుంది ఇస్కిందర్ గారూ!"

అందరూ గట్టిగా నవ్వేశారు.

ఆ తర్వాత లాల్ అన్నాడు, "వెరీవెల్! బుల్లెట్ దేహంలోంచి బయటపడి సీలింగ్‌కో, లేక గోడకో తాకితే క్రిందపడిపోవాలి—లోనికి చొచ్చుకుపోదు! కాని గదిలో ఎక్కడా అది దొరకలేదు. ఎందుకు దొరకలేదు? ఈ సమస్యను ఛేదించడానికి ఇప్పుడు నా మెదడులో ఒక రహస్యద్వారం తెరుస్తాను. చూడండి."

"ఏమిటది?" కృష్ణన్ అడిగాడు.

"కిటికీ తలుపులు."

"కిటికీ తలుపుల్లో రంధ్రాలెక్కడా లేవు!" కృష్ణన్ అరిచాడు.

"నెవర్ మైండ్, హత్య జరిగినప్పుడు తలుపులు తెరచి వుండవచ్చు."

అందరూ విస్తుపోయి చూశారు.

"అంటే—బుల్లెట్ బయటికి దూసుకెళ్ళిందా!" ఇస్కిందర్ అన్నాడు.

"నిస్సందేహంగా! ఇంతకంటే అది మాయమవడానికి మరో మార్గం ఏదేనా వుందా, మైడియర్ ఫ్రెండ్స్?" అన్నాడు లాల్.

## 9

కృష్ణన్ గది తలుపు తెరిచి లైటు వెల్గించాడు.

లాల్, జాన్, ఇస్కిందర్ గదిలో సీలింగ్‌నీ, గోడల్నీ నిశితంగా పరిశీలించారు.

"ఆల్‌రైట్, ఎక్కడా రంధ్రాలు లేవు!" అన్నాడు

లాల్, "ఇక కిటికీ చూద్దాం!"

అందరూ కిటికీ దగ్గరికెళ్ళి రెక్కల్ని పరిశీలించారు.

"దటీజ్ రైట్! ఇందులో కూడా రంధ్రాల్లేవు! ఇక తెరవండి!" మళ్ళీ అన్నాడు లాల్.

కృష్ణన్ కిటికీ తలుపు తెరవడంతో రివ్వుమని గాలి లోనికి వీచింది. అందరూ బయట ఆవరణలోకి కళ్ళలో సెర్చిలైట్లు పెట్టుకొని చూశారు.

"బుల్లెట్ బయటికెళ్ళిందని ఏమిటాధారం?" కృష్ణన్ అడిగాడు.

లాల్ నవ్వుతూ కిటికీ ఫ్రేము పైభాగం చూపించాడు.

కిటికీ ఫ్రేము పైభాగం చెక్కలో ఒక మూల అర్థ చంద్రాకారంలో తొలిచినట్లు గాడి కనిపిస్తోంది.

"బుల్లెట్ అలా దూసుకెళ్ళింది....అదీ ఆధారం!" అన్నాడు లాల్.

ఇస్కిందర్ ఛటుక్కున కిటికీ ఎక్కి ఆ గాడిని పరిశీలించాడు.

"యూ ఆర్ ఫెంటాస్టిక్, మిస్టర్ లాల్. ఈ గాడి బుల్లెట్ వల్ల ఏర్పడిందే!"

లాల్ తలూపాడు. "బుల్లెట్ ఈ ఫ్రేమును రాసుకొంటూ వెళ్ళింది. బుల్లెట్ వేగానికి ఈ ఫ్రేము పెద్ద ప్రతిబంధకం కాబట్టి, ఆ బుల్లెట్ బయట ఎక్కడో దగ్గర్లోనే పడివుండాలి. కృష్ణన్, కిటికీనుంచి ఆ ప్రహారీ గోడవరకు క్షుణ్ణంగా గాలిస్తే బుల్లెట్ దొరకవచ్చు."

వెంటనే గాలింపు ప్రారంభమైంది. కృష్ణన్, బయట ఆవరణలో ఇరవై అడుగుల దూరాన గులాబీ మొక్క మడుగులో బుల్లెట్ ని చూసి, వెర్రిగా కేక పెట్టి కర్చిఫ్ తో చుట్టేశాడు.

# 10

సాయంత్రం 4 గంటలకు కృష్ణన్ నుంచి రిపోర్టుకోసం ఎదురుచూస్తున్న డిటెక్టివ్‌లు, స్వయంగా అతనే విచ్చేయడంతో ఆహ్వానించి కూర్చోబెట్టారు.

ఇప్పుడు కృష్ణన్ ముఖంలో బుల్లెట్ దొరికినప్పటి ఉషారు లేదు. అతను విచారంగా కూర్చొని కాస్సేపయ్యాక అన్నాడు:

"ఇస్కెండర్ నా ఆశలన్నీ అడియాశలు చేశాడు! ఆ బుల్లెట్ ఆ రివాల్వర్ నుంచి వెలువడలేదట....!"

జాన్ ముఖం ఎర్రబడింది.

లాల్ నవ్వాడు, "ఆ విషయం నాకు ముందే తెలుసు.. ఆ బుల్లెట్ ఆ రివాల్వర్ నుంచి వెలువడలేదు ముమ్మాటికీ!"

"మరి?"

లాల్ అన్నాడు: "కృష్ణన్, దొంగలు ఎలాంటి అవకాశం చూసుకొని ఇంట్లో జొరబడతారు? ఎవరూ లేనప్పుడు, లేదా అందరూ నిద్రిస్తున్నప్పుడు, లేదా ఆడవాళ్ళు ఒంటరిగా వున్నప్పుడు — అందులోనూ దుస్తులు మార్చుకొంటున్నప్పుడు ఆ అవకాశం బంగారంలా పండుతుంది!

"ఈ మధ్య సిటీలో ఒకానొక హోటల్‌లో ఓ పెద్దమనిషి బాత్‌రూంలో నగ్నంగా వుండగా, దొంగ ధైర్యంగా లోనికెళ్ళి కావల్సినవి తెచ్చుకున్నాడు — ఆ పెద్దమనిషి చూస్తున్నా వున్న పళంగా వచ్చి పట్టుకోలేకపోయాడు! ఇక స్త్రీల విషయంలో చెప్పనవసరంలేదు.

"దాదాపు ఇలాంటి స్థితిలోనే హత్య జరిగిన రాత్రి సులోచన వుంది. అయితే ఎనిమిది గంటలకు శైలజ వెళ్ళినప్పుడు మాత్రం ఆమె పూర్తిగా దుస్తుల్లో వుంది. శైల

జలో ఘర్షణ జరిగినప్పుడు ఆమె సహనం కోల్పోయి బెడ్ రూంలో సొరుగులోంచి రివాల్వర్ తీసింది. శైలజ అక్కడికి రివాల్వర్ తీసికెళ్ళలేదు. దాన్ని కార్లోనే పెట్టేసింది. అయితే ఆమెమీద కక్షతో రావ్ ఈ విషయం ఒప్పుకోలేదు.

"సులోచన ఆ రివాల్వర్ తో శైలజమీద దాడి చేసింది. ఆ దాడినుంచి తప్పించుకోడానికి శైలజ ఆమెను వెనక్కి నెట్టేసింది. సులోచన వెనక్కిపడి చలనం లేకుండా వుండిపోయింది. ఆ అదను చూసుకొని శైలజ బయటకురికి వర్షంలో ఫ్లాట్ కు చేరుకొంది.

"ఈ ఘర్షణంతా అప్పుడే ఇంట్లోకి వచ్చిన దొంగ బయట నిలబడి కిటికీలోంచి చూస్తున్నాడు. సులోచన తల నేలకి కొట్టుకొని తెలివితప్పింది. అప్పుడే ఆమె తలకు దెబ్బ తగిలింది... జాప్పి కట్టింది.

"ఈ అవకాశం చూసుకొని దొంగ ధైర్యంగా లోనికి వచ్చి గాలింపు ప్రారంభించాడు. అతనికావలసిన వస్తువు అతి ముఖ్యమైనది కాబట్టి ఆఫీసులో ప్రతి అంగుళం నిదానంగా వెతికాడు. కాని దురదృష్టవశాత్తు కాస్సేపట్లోనే సులోచన తెలివిలోకొచ్చింది. ఆమె లేచి, జరిగింది గుర్తు చేసుకొని, ఇక ఆ వర్షంలో చేయగల్గేదేమీ లేదనుకొని దుస్తులు మార్చుకోసాగింది.

"అప్పుడు లైటు వెలుగులో బయటివాళ్ళకు ఆమె కన్పించే కారణం ఒకటి, వర్షపుజల్లు పడుతున్న కారణం ఒకటి—ఈ రెండు కారణాలవలన ఆమె కిటికీ రెక్కలు తప్పకుండా మూసి వుండాలి.

"ఇంతలో ఆమె హాలుగుండా ఆగదిలోకి వస్తున్న ఆకారాన్ని చూసి భయపడింది. వెంటనే నేలమీద వున్న

రివాల్వర్ అందుకుంది.

"ఈ పరిణామానికి దొంగ అదిరిపోయాడు. ఆమె చేతిలో రివాల్వర్‌ను చూసి, చేసేదిలేక చేతులెత్తి నిలుచున్నాడు.

"అప్పుడా ఇద్దరిమధ్య సంభాషణ జరిగి వుండవచ్చు. సులోచన అతన్ని రివాల్వర్‌తో జాగ్రత్తగా హేండిల్ చేస్తోంది. దొంగ అక్కడినుంచి తప్పుకునేందు కాలోచిస్తున్నాడు. సులోచన అతన్ని ఎంతసేపు హేండిల్ చేసి వుండేదో గానీ—ఇంతలో దురదృష్టవశాత్తూ పెద్దగా గాలివీచి భళ్ళున కిటికీ రెక్కలు తెరుచుకున్నాయి. వాటిని మూయడానికి ఓ క్షణం ఏమరుపాటులో సులోచన ప్రక్కకి తిరిగింది-అంతే, దొంగ ఆ అవకాశాన్ని సమయస్ఫూర్తిగా వాడుకున్నాడు!"

"ఏం చేశాడు?"

లాల్ అన్నాడు, "రెప్పపాటు కాలంలో జేబులోంచి రివాల్వర్ తీసి—సులోచన చేతిలో రివాల్వర్ షాట్ నుంచి తప్పుకోవడానికి ఇస్కిందర్ చెప్పినట్టు వంగి, లేదా కూర్చొని షూట్ చేశాడు. ఉరుముల శబ్దంలో ప్రేలుడు, ఆమె కేక కలిసిపోయాయి. ఆమె నేల కూలింది."

"అప్పుడేం జరిగింది?"

"బుల్లెట్ ఆమె వక్షంలోంచు తెరిచివున్న కిటికీద్వారా బయట వర్షంలోకి దూసుకుపోయింది. దొంగ వెంటనే జరిగింది గ్రహించి కిటికీ మూసేశాడు. హత్యాస్థలంలో ఆధారాలుండకుండా అడుగుజాడల్ని శుభ్రం చేశాడు. అప్పుడు బెడ్ క్రింద శైలజ వాచీ కన్పించింది. దాన్ని చూశాక అతనికో ఆలోచన తట్టింది.ఆమెను ఈ హత్యలో ఇరికించాలనుకున్నాడు. సరిగ్గా హత్య జరిగిన సమయం

9 గంటలకు ఆ వాచీని ఆగేలా డ్యామేజి చేసి, శవం చేతిలో రివాల్వర్‌తో పారిపోయాడు.

"ఆ దొంగకు రావ్ కంపెనీ వ్యవహారాలు, ఉద్యోగుల వివరాలూ తెలుసు. నిండుగా గుళ్ళున్న ఆ రివాల్వర్‌ని నిర్జన ప్రదేశంలో ఒక షాట్ ప్రేల్చి — వేలిముద్రలు తుడిచి దాన్ని — శైలజ ఫ్లాట్‌కు రహస్యంగా వెళ్ళి బ్యాగులో పెట్టాడు."

"అయితే ఆ దొంగ ఎవరు?"

"ఈ కేసులో అతనితో మీ కింకా పరిచయం కాలేదు. వాస్తవాని కతను దొంగకాదు. వృత్తిరీత్యా ఈ దొంగ తనానికి పూనుకున్నాడు. అతను వేలిముద్రలు పడకుండా గ్లోవ్స్ తొడుగుతాడు. నేరస్థలంలో ఆధారాల్ని తారు మారు చేయగలడు. అవసరం వున్నా లేకపోయినా, వృత్తిరీత్యా ఎప్పుడూ రివాల్వర్ ధరిస్తాడు—అతను డిటెక్టివ్ దినేష్—ఈ మధ్యే ఇక్కడ ఆఫీసు తెరిచాడు."

కృష్ణన్ ఒక్క క్షణం స్తబ్దుడయ్యాడు. "దినేష్! అతనెందుకు దొంగలా మారాడు—దట్ బ్లడీ బాస్టర్డ్! వృద్ధిలోకొస్తాడనుకున్నాను!"

లాల్ అన్నాడు, "మీనన్ అతనికో కేసు అప్ప గించాడు. అతని పార్ట్‌నర్ రావ్ తనని చీట్ చేస్తున్నట్టు పసిగట్టాడు. రావ్ ఈ సంగతి నా దగ్గర ఒప్పుకొన్నాడు. తప్పుడు లెక్కలతో డబ్బు వెనకేసుకొని కొందరికి లోన్స్‌గా ఇచ్చాడు. ఆ లోన్స్ తాలూకు సెక్యూరిటీ బాండ్స్ అతనివద్ద రహస్యంగా వున్నాయి. మీనన్ వాటిని స్వాధీనం చేసుకొని కోర్టులో దావా వేయడానికి దినేష్ సహాయం తీసుకున్నాడు. మొన్న రాత్రి రావ్ లేని సమయం చూసుకొని అతనింటికెళ్ళాడు. ఆ తర్వాత

అక్కడేం జరిగిందో మీకు తెలుసు .... దట్సాల్, ఇన్స్పెక్టర్."

ఆ సాయంత్రం ఇన్స్పెక్టర్ బాలకృష్ణన్ దినేష్ ఆఫీసుకెళ్ళి రెయిన్కోటులో వున్న అతని రివాల్వర్ను స్వాధీనం చేసుకొన్నాడు. దాన్ని పరీక్షించిన బాలస్టిక్స్ నిపుణుడు ఇస్కిందర్, ఈసారి హత్యాయుధం అదేనని ధృవపర్చాడు. కృష్ణన్ వెంటనే శైలజను విడుదల చేసి, పబ్లిక్ ప్రాసిక్యూటర్తో మంతనాలు ప్రారంభించాడు.

"మీ మేలు ఎన్ని జన్మలకైనా మర్చిపోను!" అంది శైలజ వణుకుతున్న స్వరంతో, వర్షిస్తున్న కళ్ళతో లాల్ చేతుల్ని తడిపేస్తూ....

లాల్ తేలిగ్గా నిట్టూర్చి, ఆమె భుజంతట్టి, కారు డోర్ తెరిచాడు.

జాన్ కారు స్టార్ట్ చేసి నవ్వాడు, "వెల్! ఈసారి మేం మీ ఇంటితలుపు తడతాం!"

"దేనికి?" అంది శైలజ.

"పార్టీకి! కేసు సక్సెసయ్యాక అది మా కండిషన్."

—:ఐపోయింది:—

# పొగమంచు

సీరియల్



ముద్దా సురేష్

# (మూడవ భాగము)

"బయటకు పొండిరా దరిద్రపు.... పైతు వెధవల్లారా!"

స్వామీ కేశవానంద్ జీ తిట్లు విని నిశ్చేష్టులైపోయారు స్త్రీలు, పురుషులు.

ఏమిటిది?

యిప్పుడు మాట్లాడేది తమ స్వామీజీయేనా?

తమ చెవుల్ని తాము నమ్మలేకపోతున్నారా.... గ్రామీణులు.

"అలా నిలబడతారేం నా ముఖంచూస్తూ దెయ్యాల్లా?"

"ఓహో! మీరు మర్యాదగా చెప్తే వుంటారా?"

పళ్ళు పటపట కొరుకుతూ స్వామీజీ చటుక్కున సంతోషిమా విగ్రహం చేతిలో వున్న శూలాన్ని అందుకున్నాడు.

"ఊఁ వెళ్తారా! పొడిచెయ్యమంటారా?" అన్నాడు స్వామీజీ శూలాన్ని ఎత్తి పట్టుకుని, కళ్ళల్లో నిప్పులు కురిసేలా చూస్తూ.

భక్తులు, భక్తురాళ్ళు అదిరిపడి, ప్రాణభయంతో బిలబిలా పారిపోయారు.

* * *

"హేఁ! ఎక్కడ చచ్చాయే యీ గేదెలు?"

పొలికేక పెట్టాడు పశువుల యజమాని భైరవ్, తలపాగా దులిపి, తలకు చుట్టుకుంటూ.

"మళ్ళీ ఆ శంకర్ మియా చేలో పడివుంటాయ్."

గొణుక్కుంటూ పంచె ఎగదోసుకుని వేగంగా నడవసాగాడు భైరవ్.

అతను గట్టుదిగి, పొలంలో నడుస్తుండగా పొగమంచులోంచి బయటపడుతున్న గేదెలు కనబడ్డాయి.

పొగమంచు ప్రక్క పొలాలవైపు తేలిపోతూ ప్రయాణించడం గమనించాడు భైరవ్ విస్తుపోతూ.

వింతగావుందే ఆ పొగ?

దాని అంచులు కనబడుతున్నాయి, ప్రత్యేకమయిన ఆకారం వున్నట్టు.

మామూలు పొగమంచులా నేలనంతా ఆవరించలేదు.

అప్పటికే గేదెలు తమ యజమానివద్దకు వచ్చేశాయి.

ముందునడిచే గేదెలు, అతన్ని దాటి వెళ్ళిపోసాగేయి.

"అలాగ యెక్కడికే సైతాన్‌కి బచ్చే! ఇటువైపు షెడ్‌కి పదండి!" కోపంగా అరిచాడు, ఓ గేదెమీద బలంగా చరుస్తూ.

అకస్మాత్తుగా ఆ గేదె నిల్చిపోయింది.

తల అతనివేపు తిప్పి-తదేకంగా చూడసాగింది.

"ఛల్ .... ఛల్ ...." అర్చాడు అసహనంగా, భైరవ్ మళ్ళీ దాన్ని చేత్తో చరుస్తూ.

ఆ గేదె నిశ్చలంగా, మౌనంగా అతనికేసే చూస్తోంది. దాన్ని బిగ్గరగా తిట్టిపోస్తూ, భైరవ్ వెనక్కి తిరిగాడు మిగతా మంద యెంతవరకూ నడిచిందో చూద్దామని.

అన్నిగేదెలూ అక్కడే వున్నాయి.

గుంపుగా, అతనివైపు తిరిగి, రెప్ప వాల్చకుండా చూస్తూ.

"ఏమైందే మీకు యివ్వాళ?"

ఎందుకో ఆ స్తబ్ద వాతావరణం భైరవ్‌కి భయాన్ని కలిగించింది. కారణం అతనికే తెలియదు. ఈ రోజు గేదెలు ఎందుకు 'అలా' ప్రవర్తిస్తున్నాయో, అతనికి అర్థంకావడం లేదు.

"చల్ చల్ ....యింటికి పదండి....ఝు....ఝు"....

వాటిని అదిలించసాగాడు.

బొమ్మల్లా నిలబడిపోయిన గేదెల్లో ఆకస్మాత్తుగా చలనంవచ్చి అతని చుట్టూ గుంపుగా మూగిసాగాయి.

ఆ మూగ జంతువుల వైఖరి అతనికేం అర్థం కావడం లేదు.

వెనకనుంచి ఎవరో మెల్లగా త్రోసినట్లయి గిరుక్కున వెనుదిరిగాడు భైరవ్.

వెనక్కి తిరిగేలోగా—అతన్ని లారీ గుద్దినట్లు ఏదో అతని వీపును గుద్దింది....

తూలి, నేలమీద పడిపోయాడు భైరవ్.

"హత్!

పొండి!

వెనక్కి పొండి!

సైతాన్‌కీ బచ్చే...."

పిచ్చిగా అరుస్తూ చేతులతో, మోకాళ్ళతో లేవ డానికి ప్రయత్నిస్తున్నాడు భైరవ్.

ఉన్నట్టుండి, ఓ గేదె పైకి లేస్తున్న భైరవ్ డొక్కల్లో బలంగా కుమ్మింది, కాలి గిట్టలో.

భైరవ్ రబ్బరు బొమ్మలా వెనక్కి పడ్డాడు.

అతను ప్రాణభయంతో వికృతంగా కేకలు పెట్ట సాగాడు.

ఈసారి ఒక దెబ్బ అతని ముఖం మధ్యగా తగిలింది, ముక్కు పచ్చడి చేస్తూ....

బుస బుస పొంగింది రక్తం, అతని విరిగిన ముక్కు లోంచి....

కళ్ళు ఒక్కసారిగా మసకలు కమ్మాయి భైరవ్‌కి.

అతను కళ్ళు తెరిచి చూడ ప్రయత్నించినపుడు,

యెదురుగా దృశ్యం పీడ కలలా అవుపిస్తోంది.

గేదెలన్నీ అతనివైపు కమ్ముకుంటున్నాయి....

వాటి కనుగ్రుడ్లు బైటికివచ్చి కోపంగా చూస్తున్నాయి.

వాటి నోళ్ళల్లోంచి తెల్లని నురగ వెలువడుతోంది.

బిక్కచచ్చిపోతూ, యెలాగో పైకి లేవబోయాడు భైరవ్.

అంతే! "ఫట్" మంటూ అతని మోకాళ్ళను మళ్ళీ బలంగా కుమ్మాయి తలతో, రెండు గేదెలు.

అతను కళ్ళను కాపాడుకొనే ఉద్దేశంతో చేతులు ముఖానికి అడ్డు పెట్టుకోగానే, గేదెలన్నీ పళ్ళతో అతని వేళ్ళను కొరికివేయసాగాయి.

దిక్కులు పిక్కటిల్లేలా పెడబొబ్బలు పెడుతున్నాడు భైరవ్, చిత్రహింసలు అనుభవిస్తూ....

ఓ గేదె కాలు, మెరుపులా కదిలి, అతని దవడను విరగ్గొట్టింది....

రక్తం ఉబుకుతూ, గొంతుమీదకి ప్రవహించిసాగింది.

అంతే! స్పృహ తప్పి వెల్లకితలా జారిపడ్డాడు భైరవ్, పచ్చిక నేలపై.

సరిగ్గా అప్పుడు — అన్ని గేదెలు వంతులవారీగా ముందుకు కదిలి అతనిమీద విరుచుకుపడ్డాయి.

• • •

పొగమంచులోంచి బైటకి వచ్చాడు నెమలి పిట్టదొంగ. కాని అతను గ్రామం చివరవున్న తన కొంపవైపు వెళ్ళడంలేదు. అతను తోట యజమాని మేజర్ విశ్వనాథ్ మేడ వెనకభాగంవైపు నడుస్తున్నాడు.

అతను ఎక్కడకు వెళ్ళబోతున్నాడో — అతనికి స్పష్టంగా తెల్సు. కాలా యింతకుముందు కొన్నాళ్ళు విశ్వనాథ్ తోటలో కూలికి పనిచేశాడు.

ఆ తోటలో ఏవైపు ఏముందో, ఎక్కడ దాక్కో వచ్చో, అన్నీ తెలుసు.

యిప్పుడు కాలా, దొంగాడిలా భయపడుతూ పిల్లిలా అడుగులు వేయడంలేదు.

నిదానంగా, ఏ చప్పుడైనా లెక్కచేయకుండా గంభీరంగా నడుస్తున్నాడు.

తోట చివరవున్న పాక ముందాగాడు కాలా. తలుపు తోసుకుని లోపలికి ప్రవేశించాడు.

ఓ వారగా వున్న గొడ్డలిని అతను చేతిలోకి తీసుకున్నాడు.

ఒక్క క్షణం అటూ ఇటూ పరికించాడు.

గూట్లో వున్న మూడంగుళాల పొడవు మేకుల పెట్టె అతని దృష్టి నాకర్షించింది.

ఆ మేకులు ఫెన్సింగ్ కట్టడాన్కి ఉపయోగిస్తారు.

అన్నీ సరికొత్తవి.

అతని చెయ్యి పెట్టెలో జొనిపి, బరబరా చప్పుడు చేస్తూ గుప్పెడినిండా మేకులు అందుకుని జేబులో వేసుకొన్నాడు.

దాక్కునే ప్రయత్నాలేవీ చేయకుండా అతను సూటిగా మేడవైపు నడవసాగాడు.

అతను వెనక తలుపులు చేరుకుంటుండగా, వంటమనిషి సరిగ్గా అప్పుడే తలుపులు బార్లా తెర్చింది.

అంతే!

గొడ్డలి రివ్వున గాలిలోకి లేచి, తనలో నాటుకునే

ముందు ఆమెకు కనీసం అరిచే అవకాశం లేకపోయింది.

కళ్ళు మూసి తెర్చేలోగా అంతా జరిగిపోయింది!

పిచ్చాడిలా వున్న ఆ వ్యక్తిని అరక్షణంపాటు చూడ గల్గిందంతే! మరుక్షణం ప్రాణాలు వదిలింది.

కాలా గంభీరంగా వంటగదిలో ప్రవేశించి, పైకి వెళ్లే మెట్లు ఎక్కసాగాడు.

అతను యింతకుముందు యింట్లోకి ఎప్పుడూ రాలేదు. కాని మాటల శబ్దం ఆతన్ని డైనింగ్ హాల్ వైపు నడిపించింది.

ఎదురుగా వున్న తలుపు తెర్చి లోనికి నడిచాడు కాలా. ఆ గది ఖాళీగా వుంది. ఎదురుగా మరో తలుపు..

ఆ తలుపు తెరుచ్చుకోసాగింది....

అతను చటుక్కున తలుపు వెనక నక్కాడు.

అడుగుల చప్పుడు....

సన్నగా పాడుకుంటూ పనిమనిషి సగం వదిలివేయబడ్డ ఆహారపదార్థాల 'ట్రే'తో బైటికి వచ్చింది.

గుమ్మందాటి, వంటగదికి వెళ్ళే మెట్లు దిగసాగింది....

"టీ కెటిల్ స్టౌమీద పెట్టావా మున్నీ?" అన్నదామె వంటగది సమీపిస్తూ "వాళ్ళు తిండి మేస్తుండగా మనం రెండు కప్పుల టీ తాగుదాం."

వంటగది ఖాళీగా కనబడింది ఆమెకి.

స్టౌమీద టీ కెటిల్ పొగలు కక్కుకోంది.

చేతిలోని 'ట్రే' నేలమీద పెట్టి గాస్ స్టౌ వద్దకు నడిచిందామె.

స్టౌ వద్దకు చేరుకొంటుండగా తోటలోకి వెళ్ళే తలుపులు బార్లా తీసి వుండడం గమనించిందామె.

చల్లగాలి లోపలకు వస్తోంది.

మున్నీ—బయటవున్న చెత్త కుండీలో తుక్కు పార పోయబోయడానికో, గాలి పీల్చుకోడానికో వెళ్ళుండాలి అనుకుందామె.

గుమ్మందగ్గర వున్న టేబుల్ చుట్టూ తిరిగి నడిచిందామె మున్నీని పిల్చే ఉద్దేశంతో.

అంతే!

ఆమె గొంతును చీల్చుకుంటూ వికృతమైన కేక వెలువడింది....

ఎదురుగా, గుమ్మం అవతల పడివున్న స్త్రీదేహం—మెదడుసుంచి, ముక్కువరకూ చీలిపోయిన తల....రక్తపుమడుగు....

కళ్ళు బైర్లుకమ్మి స్పృహతప్పి కూలిపోతుండగా ఆమెకు 'మేడమీంచి' కెవ్వున గాలిని చీల్చుకుంటూ వెలువడుతున్న ఓ ఆర్తనాదం లీలగా వినబడింది.

§ § §

పనిమనిషికి మెల్లగా స్పృహ వచ్చింది....

మొదట్లో తాను ఎందుకు అలా పడిపోయి వున్నదో ఆమెకు ఏమీ అర్థంకాలేదు.

అకస్మాత్తుగా ఆమె శరీరంమీద వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి....

దాదాపు తన కాలుకు తగుల్తూ పడివున్న మున్నీ శవం ఆమె కళ్ళబడింది....

ఆమె ఒళ్ళు ఎండుటాకులా వణుకుతోంది....

సహాయంకోసం కేక పెట్టాలనుకొంటోంది....

కాని గొంతు పెగల్లేదు.

ఎలాగో ఆమె కాళ్ళమీద లేచి నిలబడింది....

తూలుకొంటూ, బలహీనంగా మెట్లవైపు అడుగు

వేసింది....ముందుకు పడుతూ, నోటిదగ్గర చేయిపెట్టుకుని వెక్కి-వెక్కి ఏడుస్తూ మెట్లు అధిరోహించింది....

అఖరి మెట్టు ఎక్కి, ఒగురుస్తూ ఆమె డైనింగ్ హాల్ వైపు పరిగెట్టింది ఎవర్నో పిలవడాన్కి ప్రయత్నిస్తూ....

తెరిచివున్న గుమ్మంలో తూలుతూ అడుగులు వేసి, తక్కున ఆగిపోయింది ఎదురుగా వున్న దృశ్యం చూస్తూ...

మేజర్ భార్య నేలమీద వెల్లకితలా పడివుంది....

మెడ ఖండించబడి....

చిక్కటి రక్తపు మడుగులో....

జీవంలేని, యజమానురాలి కనుగుడ్లు ఆమెవైపే చూస్తున్నాయి....

విశాలమైన డైనింగ్ టేబుల్ మీద పడివున్నాడు ఆమె యజమాని విశ్వనాధ్, అతని అరచేతులకి, పాదాలకీ, మేకులు దిగ్గొట్టబడి వున్నాయి.

ఒక వ్యక్తి ఆయనమీద నిలబడి వున్నాడు, చేతిలో రక్తం ఓడుతున్న గొడ్డలితో....

బిక్క చచ్చిపోయి, స్థాణువులా నిలబడి పనిమనిషి చూస్తుండగా ఆ వ్యక్తిలో చలనం వచ్చింది.

అతని చేతిలోని గొడ్డలి రివ్వున గాలిలోకి లేచింది.

మెరుపులా కదిలి, గొడ్డలి వేగంగా క్రిందికి దిగింది....

విశ్వనాధ్ భుజం ఆ గొడ్డలివేటుకి పుటుక్కున తెగిపోయి, గొడ్డలి డైనింగ్ టేబుల్ లో నాటుకొన్నది.

టేబుల్ మీంచి గొడ్డలి విడదీసి, మళ్ళీ పైకెత్తాడు ఆ వ్యక్తి....

అతని గొడ్డలి విశ్వనాధ్ రెండో భుజం తెగ్గొట్టే లోపుగా, ఆయన స్పృహ తప్పిపోయాడు.

ఆ వ్యక్తి—ఆయన కాళ్ళు నరికిన సమయాన్కి విశ్వ

నాథ్ మరణించాడు.

చేతిలోని గొడ్డలితో,
రక్తం చిమ్మిన శరీరంతో,
యమభటుడిలా,
ఆ వ్యక్తి తనవైపు చూడగానే,
పనిమనిషి కెవ్వున కేకలు పెట్టసాగింది,
దశదిశలు దద్దరిల్లేలా!....

* * *

"హలో రాణా!"

రాణా తలెత్తి ఆ యువతివైపు చూసాడు.

"హలో లూసీ!" నవ్వాడు గుర్తింపుగా.

పొంగి పొరలివచ్చే దుఃఖాన్ని బలవంతంగా ఆపుకొంటున్నట్టు సూచిస్తున్నాయ్ ఆమె ముఖ కవళికలు.

"హౌ డుయు ఫీల్ డార్లింగ్?" ఆవేదనగా అడిగిందామె.

"ఓ.కే."

రాణా—భావ్‌నగర్‌కి దగ్గర్లో వున్న కాంబే టౌన్‌లోని మిషనరీ హాస్పిటల్ బయటి మెట్లమీద కూర్చొని వున్నాడు.

లోపల వేచివుండటం అతనికి చిరాకు.

ఆసుపత్రి వాతావరణం అంటే అతనికి చెప్పరాని ఎలర్జీ.

"నీకు మరో రెండువారాలు రెస్టు కావాలంటున్నారు డాక్టరు"

మెట్లమీద అతని ప్రక్కగా ఆనుకొంటూ కూర్చుంది లూసీ.

"అవసరంలేదు" తల అడ్డంగా ఊపాడు రాణా.

"యిప్పుడు బాగానే వున్నాను. హాస్పిటల్‌లో యింకో రెండురోజులుంటే, మళ్ళీ తిరగబెడుతుంది 'పిచ్చి' నాకు."

ఆ మాటలకు చలించిపోయింది లూసీ, అతను హాస్పిటల్‌లో చేర్చబడిన మొదటిరోజుల్లో ఎలా ప్రవర్తించాడో జ్ఞాపకం వచ్చి.

భావ్‌నగర్ భూకంప సమాచారం, దేశాన్ని కదిపివేసింది.

ముఖ్యంగా మహారాష్ట్ర — రాష్ట్రంలోని బొంబాయి చుట్టుపక్కల ప్రాంతాలని.

భూగర్భ శాస్త్రవేత్తలు కంగారుపడ్డారు....

చుట్టుప్రక్కల గ్రామాల్లో, పట్టణాల్లో అలజడి....

గందరగోళం....

ఉద్యోగ బాధ్యతలమీద అతను భావ్‌నగర్ పరిసరాల్లో వున్నట్టుకూడా ఆమెకి తెలీదు.

అలాంటి విషయాల్లో సీక్రెటివ్‌గా వుంటాడు రాణా.

లూసీకి, రాణా చేసే ఉద్యోగం ఏమిటో తెల్సినా, దాన్నిగురించి యింకా కొన్ని అనుమానాలు లేకపోలేదు.

ఆ రోజున మధ్యాహ్నం మూడు గంటలకు రాణా ఆఫీసుకి ఫోన్ చేసింది లూసీ.

వివరాలు దొరికాయి.

అతను కాంబే మిషనరీ హాస్పిటల్‌లో జాయిన్ చేయపడ్డాడనీ, ప్రస్తుతం మెంటల్ షాక్‌లో వున్నాడనీ....

దడాలున ఫోన్ పెట్టేసింది లూసీ.

ఆమె గుండె వేగంగా కొట్టుకొంటోంది.

శరీరం వణుకుతోంది. గాభరాగా డైరెక్టరీ తిరగేసి, కాంబే హాస్పిటల్‌కి ఫోన్ చేసింది.

"సారీ మిస్! యిప్పుడు యెవరిగురించీ వివరాలు చెప్ప

లేము. ఫోన్ కాల్స్‌తో జామ్ అయిపోయిన పరిస్థితి ఇక్కడ. ట్రై లేటర్!" అని చెప్పి కనెక్షన్ కట్ చేసింది హాస్పిటల్ ఆపరేటర్.

తండ్రికి చిన్న కాగితంమీద ఓ వాక్యం రాసి, ఆ చీటీ టేబుల్ మీద కనబడేలా పెట్టి, హడావుడిగా కార్లో, బయలుదేరింది లూసీ బొంబాయిని వదిలిపెడుతూ.

కాంబే టౌన్ చేరుతుండగా మార్గ మధ్యంలో పోలీసులు అడ్డగించారామెను. రోడ్డు కడ్డంగా చాలా కార్లు ఆగిపోయి వున్నాయి. అందరూ, భూమి చీలిపోయిన విచిత్ర ప్రదేశాన్ని కళ్ళారా చూడ్డానికి వెళ్తున్నారు, కాలి నడకనా, కార్లలో, బస్సుల్లో....

కాని పోలీసులు వార్ని అడ్డగించి వెనక్కి పంపేస్తున్నారు. రూట్ బస్సులు కాన్సిల్ చేయవల్సిందిగా రోడ్డు రవాణా సంస్థని హెచ్చరించింది పోలీసు శాఖ.

రాణా కండిషన్ చెపుతూ, ఓ పావుగంట బ్రతిమాలిన తర్వాత, ఆమెకు పచ్చదీపం చూపారు ట్రాఫిక్ పోలీసులు.

రేసు గుర్రంలా పరిగెత్తింది లూసీ కారు.

పోలీసుల సలహామీద, వాహనాన్ని కాంబే ఊరి చివర ఆపేసి నడుచుకుంటూ హాస్పిటల్ కి బైల్దేరింది లూసీ.

ఆసుపత్రి చేరుకుని, పోలికలు చెప్పి రాణా గురించి ఎంక్వైరీ చేసింది లూసీ.

కిటకిటలాడుతోంది హాస్పిటల్.

భూకంపానికి గురైన యితర బాధితుల బంధువులతో పాటు, బయట వెయిట్ చేయవల్సిందిగా కోరబడిందామె.

రాత్రి యెనిమిది గంటలదాకా ఆమెను ఎవరూ పలక

రించలేదు. అప్పుడు ప్రత్యక్షమయ్యాడు అల్సిపోయిన ముఖంతో ఓ డాక్టర్. ఆమెను మూలగా తీసుకెళ్ళి చిన్న గొంతుకతో సలహాయిచ్చాడు, ఆ రాత్రికి లూసీ యిక పేషంట్‌ని చూడకపోవడం మంచిదని.

రాణా మెంటల్‌గా తీవ్రమైన షాక్‌కి గురి అయ్యాడనీ, తనకు తానే చేసుకొన్న గాయంవల్ల, 'బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూషన్' చికిత్స చేసామనీ, ప్రస్తుతం అతను ఘాటైన మత్తుమందు ప్రభావంలో నిద్రిస్తున్నాడనీ వివరించాడు డాక్టర్.

లూసీ ఉన్న ఉద్రిక్త పరిస్థితిని గమనించి, ఆమెకు 'అసలు' విషయం చెప్పలేదు డాక్టర్.

నిజానికి—రాణాకి పూర్తిగా పిచ్చెక్కింది!

మత్తులో వున్నాకూడా—అతను బెడ్‌కి పెడరెక్కలు విరిచి, బంధించబడ్డాడు.

అతన్ని మంచానికి బంధించడాని కారణం—ఉన్మాదంలో ఎవరికీ అపకారం చేయకుండా, తనకుతాను అపకారం తలపెట్టకుండా-చూడ్డంకోసం.

ఆ విషయాలన్నీ చెబితే లూసీ, కొలాప్స్ అయి పడిపోతుందని డాక్టర్కి తెలుసు.

'బహుశా రేపు చెప్పవొచ్చు' అనుకొన్నాడు డాక్టర్.

రాణాని తీసుకువచ్చే దారిలో, అతను అంబులెన్స్ అద్దాన్ని స్మాష్ చేశాడనీ, ఒక పొడుగాటి అద్దం ముక్కతో తన గొంతులో పొడుచుకోబోయాడనీ, అతన్ని నలుగురు బలంగా ఆపవల్సి వచ్చిందనీ, రాణాను రక్షించబోయిన డ్రైవర్—అతని దెబ్బకు దవడ ఎముక విరగ్గొట్టుకొని యిదే హాస్పిటల్‌లో లాండ్ అయ్యాడనీ—చెబితే లూసీ....?

పత్రికా విలేఖరులతో,

దగ్గర్లోని, భావ్‌నగర్ నుండి భయంతో పారిపోయి వచ్చిన గ్రామస్తులతో,

క్రిక్కిరిసిపోయిన ఓ లాడ్జిలో ఆరాత్రి గడిపింది లూసీ.

గుమిగూడి, చెప్పుకొంటున్న వారి అనుభవాలు పూర్తిగా విన్నది లూసీ. వారికి కథనం ప్రకారం—

భావ్‌నగర్ గ్రామంలో నూటయాభై మంది మరణించారట. మరో వందకు పైగా గాయపడ్డారు.

మరువరాని సంఘటనగా ఓ పసిపాప గురించీ, ఓ వ్యక్తిగురించీ—మరీ మరీ చెప్పుకొంటున్నారు.

వారిద్దరూ మృత్యువు నోటిలోంచి ప్రాణాలతో రక్షించబడ్డారు. లోపల ఉండగా వారు పైకిలాగబడ్డారు.

స్పృహ తప్పివున్న స్థితిలో పసిపాప—

ఆ వ్యక్తి షాక్‌లో వుండగా—

చాలాసేపు తర్వాతగానీ, తెలియలేదు లూసీకి వారు రాణా గురించి మాట్లాడుకొంటున్నారని.

మర్నాడుదయాన్నే లూసీ హాస్పిటల్‌కి పరిగెట్టింది.

ఈసారి — మధ్యాహ్నం రావల్సిందిగా కోరాడు డాక్టర్.

కారణం—కంట్రోల్ చేయిలేని వ్యక్తిగా మారాడు రాణా.

ఇంతకు ముందు ఆమె ఎరిగిన రాణాలా ఇప్పటి రాణా లేడు. అంతగా చూడాలనుకొంటే—అతని పరిస్థితి చూసి షాక్ తినడాన్కి సిద్ధపడి రావొచ్చు. యిదీ డాక్టర్ చెప్పిన కారణాలు.

రాణా కళ్ళారా చూసిన సంఘటనను తట్టుకోలేక

అలా మారాడని, కొంత విశ్రాంతి యిస్తే కోలుకుంటాడనీ ఓదార్చాడు డాక్టర్.

కాని, లూసీ ఒత్తిడి చేసింది — తాను వెంటనే రావాలని చూడాలని.

తర్వాత బాధపడింది—ఒత్తిడి చేసినందుకు. డాక్టర్ చెప్పింది అక్షరాలా నిజం!

అతను తనకు యింతకుముందు తెల్సున్న రాణా కాదు.

ఒక జంతువు!

వికృతంగా అరిచే జంతువు.

తోలు బెల్టులతో మంచానికి నాలుగువైపులా అతని కాళ్ళు చేతులు బిగించి కట్టబడ్డాయి.

స్పెషల్ వార్డులో వున్న ఒకే ఒక బెడ్ మీద—ఆ గదికి కిటికీలు లేవు.

పేషెంట్ చేతివేళ్ళు, తల పాదాలు మాత్రమే కదప గలడు.

అతని మెడకు బాండేజి వేయబడి వుంది.

తన నాలిక తానే కొరుక్కోకుండా నోటికడ్డంగా ఏదో కుక్కబడి ఉంది....

జంతువు పంజాల్లా, అతని చేతివేళ్ళు వెనక్కి ముందుకి కదులుతున్నాయి....నిర్విరామంగా.

అతని కళ్ళు—

వెడల్పుగా అయిన అతని కళ్ళలో—

ఆ పిచ్చి చూపులు తను జీవితంలో మర్చిపోలేదు.

అతను తన నోట్లో కుక్కబడ్డ 'వాడ్డింగ్'ని పళ్ళతో వదులు చేసుకొని, తుపుక్కున ఉమ్మాడు.

మరుక్షణం....భీకరంగా అరవసాగాడు.

బూతులు తిట్టసాగాడు....

ఒక్క క్షణం—అతని క్రోధపూరితమైన కళ్ళు—లూసీ వంక చూసాయ్.

కాని ఆ చూపుల్లో గుర్తింపు లేదు.

ఓ నర్సు పరిగెట్టుకొంటూ వచ్చింది....

మరోసారి సూది బెండులాంటి దాన్ని అతని నోట్లో కుక్కింది—అతను తన వేళ్ళు కొరక్కుండా జాగ్రత్త పడుతూ.

అశ్రుధారలు దృష్టిని మసకపరుస్తుండగా లూసీ మెరుపులా ఆ ప్రదేశాన్ని వదిలిపెట్టింది.

ఖచ్చితంగా తను ప్రేమించిన వ్యక్తిలా లేదు ఇప్పటి రాణా.

రాక్షసత్వం అతని ప్రతి కదలికలో కనబడుతోంది.

తిరిగి రాణా మామూలు మనిషి కాగలడా?

గంటల తరబడి ఏడుస్తూ, హోటల్ గదిలో గడిపిందామె.

ఓపిక తగ్గి నీరసం రాగా, తన బాధను మరొకరితో పంచుకోవాలని ఆక్రోశించింది ఆమె హృదయం.

ఎవరు వున్నారు?

ఎవరికి చెప్పుకోవాలి?

రెండు నిముషాల తర్వాత తండ్రికి ట్రంకాల్ చేసింది లూసీ.

వెంటనే యింటికి వచ్చెయ్యమన్నాడు తండ్రి.

అవును....

మృగంలా మారిన రాణా నుండి,

ఈ భయంకర వాతావరణం నుండి,

పారిపోతే....తనకు ఓదార్పు కావాలి....

'అలాగే' అని తండ్రికి చెప్పబోతుండగా అంతరాత్మ

చెళ్ళున కొట్టింది లూసీని.

రాణా ఒంటరివాడు....

అతనికి ఈ విశాల ప్రపంచంలో తను తప్ప ఎవరూ లేరు 'నా' అన్నవాళ్ళు.

దగ్గరుండి, అతని బాగోగుల్ని చూసేదెవరు?? ఓ నిర్ణయాన్కి వచ్చిందామె. మరొకరి సహాయం లేకుండా రాణా ఆరోగ్యం చక్కబడ్తుందని అనిపించిన రోజున బొంబాయి వస్తానని చెప్పి ఫోన్ పెట్టేసింది లూసీ.

మర్నాడు డాక్టర్-లూసీకి రాణాతో రెస్క్యూ చేయబడ్డ లల్లీ అనే పసిపాప గురించి చెప్పాడు....

అగాధంలో వెలువడ్డ గాస్‌ను ఆమె తట్టుకోలేక అసాధారణ కోమాతోపడి, ఆ మధ్యాహ్నమే ప్రాణాలు విడిచింది.

వయసులో పెద్దవాడు కావడంవల్ల, సహజంగా వ్యాధి నిరోధకశక్తి ఎక్కువగా ఉండడంవల్లా—ఆ గాస్ ప్రభావంతో రాణా పిచ్చివాడుగా మారి-ప్రాణాలతో బైట పడ్డాడు.

ఏది యేమైనా మెదడికి యేర్పడ్డ నష్టం—శాశ్వతమా తాత్కాలికమా అన్న విషయం కొద్దిరోజుల తర్వాత గాని నిర్ధారించలేమని చెప్పాడు, డాక్టర్.

మరుసటిరోజు, తిరిగి ఆసుపత్రిని విజిట్ చేసినప్పుడు సంతోషంగా గంతులు వేసింది లూసీ.

రాణా పిచ్చి ప్రవర్తన పూర్తిగా మాయమైంది!!

అయితే అతను యింకా బలహీనంగా ఉన్నాడు, బూడిద రంగులోకి మారిన కళావిహీనమైన ముఖంతో—

గ్లూకోజ్ యింజక్షన్స్ అవసరం యిక లేదు.

ఉన్మాదస్థితి తగ్గడం వల్ల — ఆహారం తీసుకుంటు

న్నాడు.

ఐదారు రోజుల తర్వాత పూర్తిగా కోలుకొని, అతను యింటికి వెళ్ళడానికి రెడీ అయ్యాడు.

ఆస్పత్రి మెట్లమీద రాణా ప్రక్కగా కూర్చున్న లూసీ, అతని చేతిని తన చేతిలోకి తీసుకుంది.

అతను ఆమె బుగ్గలపై సున్నితంగా ముద్దుపెట్టి "థాంక్స్" అన్నాడు నవ్వుతూ.

"ఎందుకు?"

"ఇన్ని రోజులు నన్ను కనిపెట్టి ఉన్నందుకు. భయపడి పారిపోనందుకు."

లూసీ మౌనం వహించింది.

"డాక్టర్లు చెప్పారు నేనెలా ప్రవర్తించే వాడినో. నువ్వు ఖచ్చితంగా జడుసుకొని ఉండాలి."

"అవును. చాలా భయపడ్డాను."

"పూర్తిగా పిచ్చివాడైన మనిషి యింత త్వరగా యెలా కోలుకోగలిగాడా అని వాళ్ళింకా ఆశ్చర్యపోతున్నారు. అగాధంలో బయలుదేరిన గాస్.... లేక దాని పేరేదైనా, అదే కారణమని చెపుతున్నారు. తాత్కాలికంగా మెదడుపై దాని ప్రభావం పడి మాయమైందట.. నేను చాలా అదృష్టవంతుడ్ని. 'అది' ఆ పసిపాపను చంపేసింది." అన్నాడు రాణా తదేకంగా ఎక్కడో చూస్తూ, ఆవేదనగా.

అతని చేయి నొక్కింది లూసీ "యింత త్వరగా హాస్పిటల్ నుండి వెళ్ళడం మంచిదంటావా?"

"ఓహ్ ఎస్! వాళ్ళు ఉండమని చెబుతున్నారు. ఇంకా టెస్టులు చేయాలిట. జబ్బు మళ్ళీ తిరగబెట్టడానికి అవకాశముందేమోనని వాళ్ళ అనుమానం. కాని

నేనొప్పుకోలేను. యిప్పటిదాకా జరిగిన చిత్రహింసలు చాలు. పత్రికా విలేఖర్లు, దూరదర్శన్ వాళ్ళు....వీళ్ళంతా సగం ప్రాణంతో బైటపడ్డ భూకంప బాధితుల వెంట బడి మిగతా ప్రాణం తీశారు. వాళ్ళకు ప్రధానమైన టార్గెట్ నేనయ్యాను. చివరికి రామ్ కింకర్ కూడా నిన్న వచ్చి-నన్ను ప్రశ్నలతో వేధించాడు.''

రామ్‌కింకర్ — వాతావరణ కాలుష్య పరిశోధన శాఖలో రాణాపైన ఉండే బాస్!

రామ్‌కింకర్‌ని కొన్ని విషయాల్లో మెచ్చుకుంటాడు రాణా.

మరికొన్ని విషయాల్లో తిట్టుకుంటాడు.

ఎంతో కష్టపడి తను తయారు చేసిన పరిశోధనాం శాలు పట్టికెళ్ళి యిస్తే—"ఫైల్ పగిలిస్తాను'' అంటాడు ముక్తసరిగా.

బలమైన యాక్షన్ తీసుకోలేదు అపరాధులమీద, అధికారం వున్నా.

అతని అధికారం—రాజకీయవాదుల జోక్యం ముందు తలవొంచుతోందని రాణా అనుమానం.

"ఏం కావాలట అతనికి?'' అడిగింది లూసీ.

"నా వారంరోజుల ఎసైన్‌మెంట్ పూర్తి చేసానో లేదో అడిగాడు''ముక్తసరిగా అన్నాడు రాణా, సిగరెట్ వెల్గించుకుంటూ.

ఆ దారుణ భూకంపానికి కారణం ఖుల్నా మిలటరీ బేస్‌లో జరుగుతున్న ప్రయోగాలా?

అన్న రామ్‌కింకర్ ప్రశ్న గురించి లూసీకి రాణా చెప్పలేదు—చెప్పకూడదు.

ఏది యేమైనా ఆ మహా విపత్తుకు కారణం ఆ మిల

టరీ బేస్ అని చెప్పడాన్కి రాణా వద్ద కూడా ప్రూఫ్ లేదు.

"ఫాట్ లిటిల్ టోడ్! కోలుకున్న పేషెంట్ తో చర్చించవల్సిన విషయాలా అవి? ఐ హేట్ హిమ్!" అంది తీక్షణంగా లూసీ.

"నువ్వనుకొన్నంత చెడ్డవాడు కాదు. ఎనీవే, రేపు ఆయనకి రిపోర్టు చెయ్యాలి నా ఎస్సైన్ మెంట్ గురించి" కోపంగా నోరు తెరుస్తున్న లూసీని చేత్తో వారిస్తూ అన్నాడు. "జస్ట్ ఓ పావుగంట మాట్లాడటమే. తర్వాత ఓ వారం రోజులు శలవులో వుంటాను."

"యు డూ దట్ రాణా!" అంది కోపంగా లూసీ.

"ష్యూర్!" నవ్వుతూ ఆమె భుజంపై చేయి వేసాడు రాణా.

"నిజంగా లూసీ, యిప్పుడు బలంగా, ఉత్సాహంగానే వున్నాను. గొంతుకలో కొంచెం మంట. అంతే. డాక్టర్లు చెప్పారు నేను చాల చాల అదృష్టవంతుడ్నని. అద్దం ముక్కతో నేను కంఠంలో పొడుచుకున్నది పెద్ద గాయం కాలేదు. ఎనీవే, దేవుడికొక్కడికే తెల్సు యిక్కడ అవసరమైన దానికంటె యెక్కువ విశ్రాంతి తీసుకున్నానని. కమాన్ డార్లింగ్, మళ్ళీ పిచ్చివాడ్ని కాకముందే యిక్కడ్నుంచి పారిపోదాం."

త్రుళ్ళిపడి భయంగా చూస్తున్న లూసీకేసి చూసి పగలబడి నవ్వాడు రాణా.

•   •   •

రాణా, లూసీ ఫియట్ కార్లో కాంబేని వదిలిపెట్టి శాంతినగర్ అనే గ్రామంలోంచి ప్రయాణిస్తుండగా జరిగింది ఆ సంఘటన....

ఉదయపు ఆకాశం ఆహ్లాదకరంగా ఉంది.

వేగంగా బొంబాయి దూసుకుపోవడం వారి లక్ష్యం కాదు.

అందమైన ప్రకృతిని యెంజాయ్ చేస్తూ ప్రయాణించడం—

దట్టమైన మేఘం నేలబారుగా వారి కెదురైంది....

మామూలు మేఘంలా రూప రహితంగా కాకుండా అంచులు కనబడేట్లు స్పష్టమైన ఆకారంలో విశాలంగా కమ్ముకొని ఉన్నదా మేఘం!

"స్ట్రేంజ్" గొణుక్కుంటూ కారాపాడు రాణా. "అది పొగా, మేఘమా, మంచా?"

"మంచు అంత దట్టంగా ఉండదు. మేఘం నేలమీద యెలా వుంటుంది? పొగ అయితే ఒక్కచోట నిలవదు తేలిగ్గా ఉంటుంది కాబట్టి. వెనక్కి వెళ్ళిపోదాం రాణా. నా ఒంటిమీద ఏదో పాకుతున్నట్టుంది దాన్ని చూస్తుంటే" అంది లూసీ ముందుకు చూస్తూ.

"చాలా దూరం ప్రయాణించాం. వెనక్కి ఎక్కడికెళ్తాం? నెమ్మదిగా దాన్ని దాటి పోదాం. విచిత్రంగా వుంది కదూ—గోడలా నిలబడి అది?"

వెనగ్గా హారన్ కయ్యిన వినబడ్డంతో యిద్దరూ త్రుళ్ళిపడ్డారు.

ఓ టూరిస్టు బస్ వెనకాల్నించి రయ్యిన ముందుకు దూసుకుపోయింది.

అందులోంచి స్కూలుపిల్లలు తలలు బైటపెట్టి నాలికలు సాచి వెక్కిరించారు, ఫియట్ కారువైపు చూస్తూ.

"బ్లడీఫూల్!" తిట్టుకొన్నాడు రాణా "అంత

స్పీడ్‌లో ఆ మేఘంలోకి పోతున్నాడు...."

రోడ్డు చివర విశాలంగా అలుముకున్న పొగమంచు బస్సును మింగివేయడం గమనించారు రాణా, లూసీలు.

అకస్మాత్తుగా ఆ పొగమంచు కదిలి, తమవైపు ప్రయాణిస్తోందని గ్రహించాడు రాణా.

"గుడ్ గాడ్! అది ఎంత వేగంగా కదుల్తోందో" విసుపోతూ కారుని ముందుకి పోనిచ్చాడు రాణా.

లూసీ అసహజంగా భయపడుతుండడం గమనించాడు రాణా.

క్షణాలలో వారి వాహనం మేఘం మధ్య భాగంలోకి ప్రవేశించింది.

రాణా ఊహించినదానికంటె దట్టంగా వుంది ఆ పొగమంచు.

ఎదురుగా దారి, లీలామాత్రంగా కనపడుతోంది.

అప్రయత్నంగా కారు నడపసాగాడు రాణా. దారి బాగా కనబడ్డంకోసం విండ్ స్క్రీన్ దగ్గరగా జరుగుతూ.

అప్పుడప్పుడు విండ్ స్క్రీన్ వైపర్స్‌ని ఆన్ చేస్తున్నాడు అద్దంమీద అలుముకున్న పొగను తొలగించడానికి.

రాణాకి ఓ విషయం అర్థంకావడం లేదు.

ఆ పొగమంచు లేదా మేఘం .... పసుపురంగులో ఉందేమిటి?

సరిగ్గా అదే సమయంలో, ఓ సన్నని, పదునైన వాసన రాణా ముక్కుపుటాల్ని తాకింది. అతని మెదడు కణాల్లో ఓ సన్నని నరం కదిలినట్లయింది!

దీనికీ భూకంపానికీ ఏమైనా సంబంధముందా? ఆ

దారుణ సంఘటన గురించి, యిప్పుడు ఎక్కువగా జ్ఞాపకం లేదు రాణాకి.

మెదడులో చాల కొద్ది భాగంలో యింకా షాక్ ప్రభావం ఉంటుందని డాక్టరు చెప్పారు.

కానీ,

ఎలాగో, ఆ వాసన, ఆ పసుపురంగు, ఆ సబ్బ వాతావరణం—అతనిలో దేన్నో మేలుకొలపసాగాయ్.

అంతే!

చలి చమటలు పడుతుండగా కారు నిలిపివేశాడు రాణా.

"క్యాహువా?" భయంగా వేగంగా పల్కింది లూసీ కంఠం.

"నహీం మాలూమ్ లూసీ! అదో రకమైన ఫీలింగ్.... ఈ పొగమంచు నాకు యింతకుముందు పరిచయమున్నట్లు అనిపిస్తోంది...."

లూసీ చేయి, రాణా భుజంమీద పడింది "డార్లింగ్! భావ్‌నగర్‌లో ఏర్పడిన ఎరప్షన్ నుంచి ఓ విధమైన గాస్ లేదా పొగలాంటిది బైటపడిందని పేపర్లు రాశాయ్. గ్రౌండ్‌లోని ఓ విధమైన ప్రేలుడువల్ల అలా జరిగి వుండొచ్చని ఊహించారు వాళ్ళు. యిప్పుడు మన చుట్టూ వున్న పొగా, అదీ ఒకటేనే...."

"నో లూసీ! ఒక్కటే అయి ఉండదు. అప్పటి పొగ, ఈపాటికి ఆకాశంలో గాలికి చెదిరి, విడిపోయి ఉండాలి. యిలా ముద్దలా ప్రేలాడదు."

"హౌ కెన్ యు టెల్ దట్? భూమిలోంచి పొగ రావడం ఓ అసాధారణ సంఘటన. అలాంటప్పుడు అది ఎలా పనిచేస్తుందో నువ్వెలా చెప్పగలవ్?"

"ఆల్ రైట్! యిక ఆ విషయాన్ని ఈ పొగమంచు మధ్య ఉంటూ చర్చించడం అనవసరం. ఈ మేఘం వెనక్కి కదులుండడంవల్ల మనం ముందుకు వెళ్ళడమే సులభం అనుకుంటాను" అంటూ తలుపులు బిగించబడి ఉన్నాయో లేదో పరీక్షించి, విండో అద్దాలు పైకెత్తేసాడు రాణా.

"ఓ. కే. బట్ బీ కేర్ ఫుల్" జవాబిచ్చింది లూసీ.

కారుని మళ్ళీ పోనిచ్చాడు రాణా, కళ్ళు పెద్దవి చేసుకుని ముందుకు చూస్తూ.

ఓ వందగజాలు ముందుకు వెళ్ళగానే ఎదురైంది వారికో దృశ్యం!

యింతకుముందు తమను వెక్కిరించిన-స్కూలుపిల్లల-బస్సు ఓ గోతిలో కూలిపోయి ఉంది—

కుర్రాళ్ళు బస్సు వెనక నిలబడి ఉన్నారు గుంపులు గుంపులుగా మాట్లాడుకుంటూ.

"మిమ్మల్ని రోడ్డుకడ్డంగా నిలబడొద్దని చెప్పానా? పదండి వారకి" కసురుకుందో కంఠం విద్యార్థుల్ని.

లూసీని లోపలే ఉండమని చెప్పి, కారు దిగాడు రాణా, తిరిగి తలుపు మూస్తుండగా మళ్ళీ తాకింది రాణా ముక్కుపుటాల్ని ఆ విచిత్రమైన వాసన!

"ఎవరికైనా దెబ్బలు తగిలాయా?" స్కూల్ మాస్టర్ లా కనబడుతున్న ఆకారాన్ని అడిగాడు రాణా.

"కొంతమంది కుర్రాళ్ళకి చిన్న చిన్న గాయాలయ్యాయండీ."

జవాబిచ్చింది ఆ ఆకారం, రాణాని సమీపిస్తూ, "కాని మా డ్రైవర్ కి తలమీద బలమైన దెబ్బ తగిలింది."

(సశేషం)

## "ముఖచిత్ర వాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ము ఖ చి త్రా ల కు సంబంధం వుండేటట్లుగా ఒక్క-మాటలోగాని, చిన్న వాక్యంలోగాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 8/-లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ ఇంటిదగ్గర అంద జేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీల కోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగడం సరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 90/-లు ముందుగా పంపవచ్చును. •



# క్రీమ్‌లో తమాషా

[ఈ శీర్షికలో ప్రచురింపబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును—ఎడిటర్]

## "పొగడ్త వద్దు!"

ఒక త్రాగుబోతు భర్త ఏదైనా అవసరం వస్తే కాని భార్యతో మాట్లాడేవాడు కాదు. ఓ రోజు భార్య కూర్చున్న చోటికెళ్ళి....

"అబ్బా!....ఈ రోజు నువ్వెంత అందంగా వున్నావు శాలినీ. నీ బుగ్గలు లేత గులాబీ రేకులు, నీ ముక్కు సంపెంగను మరిపిస్తోంది. నిన్ను పొందిన నేను ఎంత అదృష్టవంతుడ్ని శాలినీ...."

"ఆ....ఆ....చాల్చాల్లే ఆపండి. ఇక నన్ను మీరు పొగడద్దు....!" కచ్చితంగా చెప్పింది భార్య.

"ఏం—? ఎందుకని?" ప్రశ్నించాడు భర్త.

"మీరు పొగిడినప్పుడల్లా నా వొంటిపై నుండి ఏదో ఒక నగ మాయమవుతున్నది. అన్ని నగలూ నిన్నటితో ఆఖరయ్యాయి మరి....!"

—యం. వీరాస్వామి, మల్కాజిగిరి.

## చాలని వయస్సు?

ప్యారిస్‌లో ఫుట్‌పాత్‌మీద ఒక అబ్బాయి కూర్చున్నాడు. అతడి చేతిలో సిగరెట్ వుంది.

ఓ వృద్ధురాలు అటువైపు వస్తూ ఆ బాలుణ్ని చూచింది.

"ఏమబ్బాయి బడికి వెళ్ళవా?" అని అడిగింది.

"లేదు. నా కింక బడిలో ప్రవేశించడానికి తగిన వయసు లేదు."

"ఎన్ని సంవత్సరాలు నీ కిప్పుడు?"

"మూడు సంవత్సరాలకు ఓ నెల తక్కువుంది." అన్నాడా అబ్బాయి నిర్లక్ష్యంగా.

—చాగాపురం నాగేశ్వరరావు, మల్దకల్.

## ఎలా చెప్పాలి?

కిరణ్మయి దగ్గరగా వెళ్ళి "ఏమండీ! మీకు హిందీ వచ్చా?" అడిగాడు రావు. అతడామెను ఎన్నో రోజులుగా ప్రేమిస్తున్నాడు కాని ఆ విషయం చెప్పడానికి సాహసం చాలడం లేదు.

"అర్థం అవుతుందిగానీ బదులు చెప్పడం రాదు, యెందుకండీ" అనుమానంగా అడిగింది కిరణ్మయి.

"మై తుమ్‌కో ప్యార్ కర్తా హూ" అని చెప్పి సిగ్గుతో తల వాల్చుకున్నాడు రావు. రెండుక్షణాలాగి తలెత్తి ఆమె ముఖంలోకి చూశాడు.

"మా అన్నయ్య మిమ్మల్ని పట్టుకు తంతాడు—అని హిందీలో ఎలా చెప్పాలో చెప్పండి. నేనూ మీకా ముక్క చెప్పేస్తాను" అంది ఆమె నవ్వుతూ....

—సుంచు కృష్ణస్వామి, నిజామాబాద్.

## రైలు టికెట్!

ఓసారి ప్రఖ్యాత సాహితీవేత్త "మార్క్‌ట్వైన్" ఇంగ్లండ్‌లో గుర్రప్పందాలకెళ్ళాడు. అవి ముగియగానే అతడి దగ్గరకు స్నేహితుడొకాయన వచ్చి "నా డబ్బంతా పోగొట్టుకున్నాను. దయచేసి నాకు లండన్‌కు వెళ్ళేందుకు

రైలు టికెట్ తీసుకో" అని మొరపెట్టుకున్నాడు.

"బాగుంది. నేనూ ఈ గుర్రప్పందెంలో చాల పోగొట్టుకున్నాను. ఓ ఉపాయం చెప్తాను. నీవు నా సీటు క్రింద దాక్కో. నేను నా కాళ్ళతో నువ్ కనిపించకుండా వుండేట్లు చూసుకుంటాను....సరేనా?"

స్నేహితుడికి మార్క్‌ట్వైన్ ఆలోచన నచ్చినట్టుంది. దానికి అతడు వెంటనే ఒప్పుకున్నాడు.

ఆలోచించిన ప్రకారమే మార్క్‌ట్వైన్ తన స్నేహితుడ్ని క్రిందనుంచి కనపడకుండా, తన కాళ్ళు జోడించి వుంచాడు. ఐతే రెండు టిక్కెట్లను ముందే తీసుకొనుంచుకున్నాడు. రైలు బయల్దేరగానే టికెట్ కలెక్టర్ వచ్చాడు.

"రెండు టిక్కెట్లిచ్చారు కదా?....మరి....ఇంకొకరు ఎక్కడ?" అనడిగాడు టి. సి. ట్వైన్ తల తడుముకుని "ఏం చెప్పన్లెండి. అది నా ఫ్రెండుది. వాడికి కొంచెం పిచ్చి. అందుకనే నా సీట్ క్రింద దాక్కొన్నాడు చూడండి" అన్నాడు.

క్రింద బల్లిలా ముడుచుక్కూచున్న ట్వైన్ స్నేహితుడి మొహం చూడాలప్పుడు—

—ఎన్. నరసింహమూర్తి (రేణుశ్రీ) తుంగభద్రా డ్యాం.

## ముద్దు?

తల్లి: (కూతురుతో) మీ పిన్నికి ఓ ముద్దివ్వమ్మా!

కూతురు: ఉహూం! నేనివ్వను.

తల్లి: ఎందుకని?

కూతురు: నిన్న పిన్నిని నాన్న ముద్దెట్టుకోబోతే, చెంప పగులకొట్టింది.

—వి. సుమలత, పార్వతీపురం.

